# అక్షర సుమార్చన



సీతా లక్ష్మణ హనుమత్సమేత

సాకేత సార్వభౌమునకు

అక్షర సుమార్చన.

లోకంబులు లోకేశులు,
లోకస్థులు దెగినఁదుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం,
దేకాకృతి వెలుగు నతని నేసేవింతున్.

# నే కట్టిన గుడి

రామాయణము భారతీయ సంస్కృతికి ప్రతీక. శ్రీరాముడు భారతీయుల జీవితాలతో పెనవేసుకున్న ఆత్మబంధువు. రాముని తలవనివారుండరు. రామభక్తి మన రక్తంలో ప్రవహించే అంత ర్వాహిని.

రామచరిత మానసము భక్తిరసప్రధానమైన మహోత్కృష్ట కావ్యము. అది తెలుగులోనికి అనువదించాలని నాకు చిన్నతనంనుంచీ కోరిక వుండేది. అప్పట్లో నాకు హిందీ ఒక్క మాటకూడా రాదు. కాని కోరిక మాత్రం చాల తీవ్రంగా వుండేది.

రామతత్త్వం తెలుసుకోవటం సులభం కాదు. కనీసం రామ చరిత మానస కావ్యాన్నైనా పూర్తిగా అర్థం చేసికోవాలంటే తగి నంత భాష రావాలి. అందుచేత హిందీ నేర్చుకోవడం మొదలు పెట్టాను. నా చదువు పరీక్షలమీద దృష్టికంటె భాష నర్థం చేసుకోవ టం, భావాన్ని గ్రహించటం మీదనే ఎక్కువ కేంద్రీకృతమైంది. అదృష్టవశాత్తూ మంచి పండితులు, విద్యావేత్త, ఉభయభాషా ప్రవీ ణులూ అయిన శ్రీ ఓంప్రకాశ్ శర్మా శాస్త్రిజీ వద్ద విద్య నేర్చుకునే అవకాశం నాకు కలిగింది. వారు ఢిల్లీ వాస్తవ్యులు. హిందీ భాషాభి మానులు. వారివద్ద చదువుకుని నేను పంజాబ్ యూనివర్సిటీ ఆనర్స్ ఇన్ హిందీ (Honours in Hindi) డిగ్రీ పొందాను. వారి కెల్ల ప్పుడు నేను కృతజ్ఞురాలిని.

అయితే చదువు ముగించిన తరువాత రామాయణ రచనకు పూనుకోవాలంటే ధైర్యం చాలలేదు. అప్పట్లో అడపా తడపా చిన్న చిన్న రచనలు చేయటమేకాని రామానుగ్రహము లేనిదే రామ చరితము వ్రాయలేననిపించేది. చివరకు ఎలాగో ప్రేరణ కలిగింది. దీక్షగా అరవైనాలుగు రోజులలో మొత్తం అక్షరం విడవకుండా

అనువదించాను. అంతటి బృహత్కావ్యాన్ని రచించి ముద్రించకుండా దాచడంకంటె గ్రంథాన్ని సంక్షిప్తంచేసి ముద్రించి భక్తులచేతికి అందించడంలో సులువూ, సౌకర్యమూ వుంటుందని భావించాను. అందువల్ల ఎంతో పెద్ద గుడి కట్టాలనుకొని, చివరకి చిన్న గుడి కట్టాను. గుడికంటె గుడిలో రాముడు ప్రధానం గనుక-పాఠకు లందరూ ఈ గుడిలోకి రాముడికోసం తొంగిచూస్తారనే విశ్వసిస్తు న్నాను. మూలం రామచరిత మానసం. కాని యీ సాకేత సార్వ భౌమ ఆ గ్రంథానికి మక్కికి మక్కి అనువాదం కాదు. భావాలన్నీ అందులోవే.

రామాయణాలన్నింటికీ మూలం వాల్మీకమే అయినప్పటికీ, ప్రతి ఒక్కటీ ఒక్కొక్క ప్రత్యే కత సంతరించుకొన్నట్లు కనపడు తుంది. తులసీదాసు మహాభక్తుడు. ఆయన సకల వేదవేదాంగాలు, పురాణేతిహాసాలు, శాస్త్రాలు చదివి మననం చేసుకున్న మహనీ యుడు. వారి కావ్యనాయకుడు వాల్మీకి రామాయణంలోవలె మాన వోత్తముడు, మర్యాదా పురుషోత్తముడు మాత్రమేకాదు. త్రిగుణా తీతుడు, అప్రమేయుడు. సర్వవ్యాపక బ్రహ్మ. అవాఙ్మానస గోచ రుడు. ఋషులు, మునులు తపస్సుచేసి సమాధిస్థితియందు కూడ దర్శించలేని సచ్చిదానందమూర్తి. చిన్మయ రూపుడు.

అందుచేతనే యీ కావ్యము అత్యంత భక్తిరస ప్రధానమైనది. ఇందు దొరుకు రసతన్మయత్వం మరే యితర కావ్యాలలోను దొరక దనిపిస్తుంది. ఉత్తర హిందూస్థానములో తులసీ రామాయణము పంచమ వేదంగా భావిస్తారు. ప్రతి ఇంటా నిత్యపారాయణ, మాస పారాయణలు చేసి మంగళహారతు లందిస్తారు. ఈ రామాయణ మందలి నాయకుడు పరబ్రహ్మ, పరంధామము నిచ్చువాడు, మోక్ష ప్రదాత యని వారి నమ్మకము.

సాకేత సార్వభౌముడు మానస రామాయణములోని నాయ కుడు. బలోపేతుడు. గుణనిధానుడు. ఋషులను మునులను గూడా సమ్మోహితుల నొనర్చిన సౌందర్యరాశి. రామశబ్దములోనే రమ్యత వున్నదనిపిస్తుంది. ఎన్నిసారులు విన్నా, ఎన్నిసారులు చదివినా,

ఎన్నెన్ని కలములతో వ్రాసినా తరగని ఐశ్వర్యం రామాయణము. అందుచేతనే నాకు శ్రీరాముని చరితము చేతనైన రీతిగా కీర్తించ వలెనని బుద్ధిపుట్టింది.

శ్రీ రాపూరు సత్యనారాయణగారు గొప్ప కావ్యశిల్పి. వారు ఈ కావ్యానికి "సాకేత సార్వభౌమ" అని పేరుపెట్టారు. ఉప శీర్షిక లన్నీ పెట్టారు. ఇవన్నీ సింహాసనారూఢుడైన ఆ సార్వభౌమునకు రాజభూషణము లలంకరించినట్లున్నాయి. సార్వభౌముని శోభకు మరింత అందాన్ని చేకూర్చాయి. వారికీ వారి కుటుంబమునకు సర్వేశ్వరుడు సకలైశ్వర్యముల నిచ్చి ఆయురారోగ్యములను ప్రసాదించ వలసినదిగా ప్రార్థిస్తున్నాను.

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు ఆశీస్సులు పంపించారు. వారి ఆశీస్సులు భగవంతుని ప్రసాదంగా భావించుకొని వారికి నమస్కరిస్తున్నాను. మా పెద్ద నాన్నగారు శ్రీ గురుజాడ రాఘవశర్మగారు 'ఆమోదం' పంపి దీవించారు. గురుజాడవారి ఆడబడుచుగా వారి దీవెన అందుకోవడానికి నేనెంతో గర్విస్తున్నాను.

మహనీయులు, ఆచార్యవర్యులు ఈ కావ్యంలో రామాయణ ప్రశస్తి చేశారు. సాహిత్య క్షేత్రంలో అనేక పున్నెపు పంటలు పండించిన పవిత్ర కృషీవలురు వీరు. వీరి వాక్కులు ఈ కావ్యపు పుటలలో వెదజల్లడం నా మహద్భాగ్యంగా భావిస్తున్నాను. వారందరికీ నా హృదయపూర్వక వందనా లందజేస్తున్నాను.

ఈ కావ్యం 'అర్చన' భావానికి తగురీతిగా చిత్రం వేసి రూపులు దిద్దిన శ్రీ శీలా వీర్రాజుగారికి ధన్యవాదా లర్పిస్తున్నాను. ఈ గ్రంథం అచ్చవడానికి తోడ్పడిన అందరికీ వందనములు.

నిడుమోలు లక్ష్మీ బాలప్రసూనాంబ.

# గుచ్చిన పచ్చతోరణాలు

రాము డొక్కడే! ఆలయా లెన్నో!... వీటిని పాలరాతితోనూ కట్టవచ్చు, పండు ఇటుకతోనూ కట్టవచ్చు. భక్తి అందరికీ ఒకటే! భక్తినిబట్టి ఆలయ స్వరూపాలు మారుతూ వుంటాయి. అన్నిటా వచ్చి నిలుస్తున్నాడా ఆపన్నా నీకశరణ్యుడు. భక్తు లందరికీ దర్శనమిస్తాడు - అభయహస్తం జాస్తాడు.

కొందరు భక్తులు పాలరాతితో రామ మందిరాలు నిర్మిస్తే - కొందరు పసిడిపలుకులతో ఆ దివ్యమందిరాన్ని నిర్మిస్తారు. వాల్మీకి కట్టిన మందిరం వరప్రసాదంగా నిలిచిందినాటివరకు స్వర్ణకాంతులు విరజిమ్ముతూ, స్వర్గపథాన్ని చూపుతోంది. ఆ తర్వాత ఎందరెందరో రామాయణాలువ్రాసి ధన్యులయ్యారు. అందులో తులసీదాసు పరమ పావనమైన రామ మందిరం తనభాషలో నిర్మించి తన్మయుడయ్యాడు. భాష వేరైనా భక్తిరసప్రవాహం ఒకటే. అందువల్ల ఆ రామాయణాన్ని కొందరు తెలుగుభాష పేరిట మూసలలో పోయగలిగారు. తెలుగువారు 'రామమానస కథామృతాన్ని' చవిచూసే అవకాశం కల్పించారు. తీయని తెలుగు పలుకులతో అదే ఆలయాన్ని శ్రీమతి ప్రసూనగారు సృష్టించారు. వీరిని ప్రోత్సహించింది వీరి సుకృతమే! ఆలయ నిర్మాణానికి చేయూతనిచ్చింది వీరి భర్త శ్రీ రామమూర్తి గారు.

రామమందిర నిర్మాణ సమయంలో కొంత రజను నాపైన కూడా కురవాలనే కూర్మితో ప్రక్కగా నన్ను నిలబెట్టారు. వారు నిర్మించిన ఆలయ గవాక్షాలకు పచ్చ పచ్చని తోరణాలు గ్రుచ్చి

అలంకరించాను. ఈ ఆలయానికి 'సాకేత సార్వభౌమ' ధామమని నామకరణం చేస్తే అంగీకరించారు ఈ పుణ్య దంపతులు. ఈ పవిత్ర కృషిలో వారితోపాటు నన్ను కూడా నిలిపి, సుకృతాన్ని పంచిపెట్టినందుకు వారి కెంతో అభినందిస్తున్నాను. ప్రతి పుటలో చిందే కౌసల్యానందనుని చిరు మందహాసం, వాడని మల్లెపందిరిగా మారి పరిమళాలు గుమ్మరిస్తుందనీ- వారినీ, అందరినీ మురిపిస్తుందనీ, ముక్తిభావన కల్పిస్తుందనీ ఆశిస్తున్నాను.

ఈ పవిత్ర గ్రంథాన్ని భాషా కుటీర ప్రచురణగా వెలువరించే అవకాశం కల్పించిన శ్రీ రామమూర్తి దంపతులకు నా అభివాదన లందజేస్తున్నాను. భాషా కుటీరం ఒక భక్తిరస గ్రంథాన్ని వెలువరించే వరాన్ని ప్రసాదించిన ఆ శ్రీరామచంద్రమూర్తికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

రావూరు వెంకట సత్యనారాయణరావు

# శ్రీరామమూర్తి దంపతులు ధన్యజీవనులు

"సాకేత సార్వభౌముని" స్మరించిన చాలును, అపరిమితా నందపరవశులము కావలసినదే! శ్రీ వాల్మీక రామాయణమేగాక అసంఖ్యాకములుగా వేరువేరు రామాయణములు కలవు. ప్రతి ఒక్క కవికి శ్రీ సీతారాములను వర్ణించవలయుననే కుతూహలముండును.

తులసీ రామాయణము-హిందిలో ఉద్గ్రంథము. రచయిత్రి హిందీ భాషలో బహు పాండిత్యమును ఆర్జించి, సరసమైన మృదు మధుర శైలిలో-తెలుగులో, భావగంభీరముగ, తులసీ రామాయణము ఉత్కృష్టతను వ్యక్తపరచుచూ శ్రీ సీతారాముల చరిత్రను భక్తులకు వెల్లడించుచున్న విషయము-బాల్యప్రభృతి తమకు శ్రీ సీతారామ చంద్రులపై నున్న అకుంఠిత భక్తిప్రపత్తులను తెలియచేయుటయే కాగలదు.

పితృవాక్యపరిపాలన విషయములో శ్రీరామచంద్రుని సరి పోలినవారు లేరు. శ్రీరామునకు-సామ్రాజ్య పట్టాభిషేకము, పదు నాలుగు వత్సరములు వనవాసము-ఒకటియే! సమానమే! సమ దృష్టియే! తన భర్తకు సహధర్మచారిణిగా అయనను వెనువెంట వెంబ డించుటయే సీతమ్మవారి కోరిక! రాజ్యము ఎంతయో, వనవాసము అంతయే-ఆమెకు!

శ్రీరామచంద్రుడు పౌరుషము పూని రావణుని సంహరించి ధర్మపత్ని సీతను గొనివచ్చిరి. మహాపౌరుషము పూని సీతను విడ నాడిరి. శ్రీ సీతారాముల వర్ణించుటకు ఎవరి తరము? వారల స్మరించి, ప్రార్థించి తరించుటయే పరమావధి.

సత్సాంప్రదాయములుగల కుటుంబములో జన్మించి, సాక్షాత్ శ్రీరామమూర్తికి పత్నియై, ఆవెంటనే గృహమునకు యజమానియై, అత్యంత నేర్పుతో గృహకృత్యములను నిర్వర్తించుకొనుచూ, అవకాశము చూచుకుని, హిందీభాషను అభ్యసించుచూ, పరీక్షలలో ఉత్తీర్ణురాలై, ఇంగ్లీషుభాషను అలవర్చుకు పట్టభద్రురాలై, జన్మతః ప్రావిర్భవించిన విచక్షణజ్ఞానముతో ఆధ్యాత్మ విచారణ, దైవచింతన జరుపుచూ, దీక్షతో తులసీరామాయణముయొక్క ప్రాముఖ్యతను ముక్కోటి ఆంధ్రులకు తెలియపరచిన శ్రీ చి॥ సౌ॥ ప్రసూనను, యీమెగారి భర్త అయిన చి॥ శ్రీ శ్రీరామమూర్తి పంతులును, సర్వవిధముల అభివృద్ధి చెందవలయునని నారాయణ స్మరణపూర్వకముగ ఆశీర్వదించుచున్నాను.

ఇవియే నారాయణ స్మృతులు.

శ్రీ త్రివిక్రమ రామానందభారతి స్వామి
శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి
కుర్తాళము.

# ఆమోదము

శ్రీమద్భారతము, భాగవతము, రామాయణములు మన భారతీయ సంస్కృతికి మూలకందములు. సంస్కృత భారతమును కవి త్రయమున్నూ, మహాభాగవతమును భక్తాగ్రేసరుడగు పోతనామాత్యుడును తెనుగున పద్యముల ననువదించిరి. ఇక వాల్మీకిరామాయణము ననుసరించి యెందరో మహాకవులు సంస్కృతమునను, తెనుగునను, హిందీలోను అనువదించిరి

దాదాపు ప్రతి ప్రఖ్యాతకవి 'శ్రీరామ రామ రామేతి, రామే రామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే' అని పరమశివుడు పార్వతి కుపదేశించిన శ్రీరామమంత్రము ఇహపర సాధకము రామాయణ మహాత్మ్యము గురించి, రామకథా ప్రాశస్త్యము గురించి యెన్నియో మహాపురుషుల మేలిసూక్తులున్నవి. రామ నామం మధురం, రూపం మధురం, భావం మధురం, చరితం మధురం, చరణం మధురం, కథనం మధురం. అట్టి మధురాతి మధురమగు రామాయణము జన్మతారకం. ఇప్పుడట్టి 'రామచరిత మానస' రామాయణమును మా బిడ్డ చి॥ సౌ॥ ప్రసూన యెప్పుడో తెనుగున ననువదించినది.

అది 600 పుటల బృహద్గ్రంథము. పూర్తిగ దీనిని ముద్రించుట, ముద్రించినను, యెందరి కందుబాటులో నుండునో అని, సంక్షిప్తపరచిన సులువుగా నుండునని, సహృదయులగు కొందఱి సాహిత్యప్రియుల ప్రేరణచే యిప్పుడు 150 పుటల మేలిగ్రంథముగా వెలువడుచున్నది.

శ్రీ రామాయణ ప్రాశస్త్యము గురించి 'చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం, యేకైకమక్షరం ప్రోక్తం; మహాపాతక

నాశనం' అను సూక్తిననుసరించి సంస్కృత వాల్మీకి రామాయణ మందు ప్రత్యక్షరము పఠనమననాదులచే మహాపాతక నాశనముగా, జన్మతారకముగా వక్కాణించియున్నారు. అందుచేతనే రామాయణాంతర్గతమగు 'సుందరకాండ' పారాయణ యెంత ప్రాముఖ్యమో నేటికిని తెల్లము; మరియు వ్యాధులపోగొట్టి, యిహపర సాధనముగా, నిత్యజీవితమున వినియోగమగునది యీ గ్రంథము. మహాభాగవత మన్ననో, అక్షర ప్రాధాన్యముకలది. భావప్రాధాన్యమై తాత్త్వక దృష్టితో వినియోగమగు పవిత్రగ్రంథము. ఇదిగాక కథలన్నిటిలో శ్రీరామకథలో, ప్రతిపాత్ర, ప్రతిసంఘటన, మామూలు మానవకోటి కాదర్శమై ఆచరణయోగ్యమై, ప్రబోధదాయకమగు కథాసంపుటి చరిత్ర శ్రీ రామాయణము. కేవలము 'రామ' నామము విడిగానే గాక, 'రా'కారము 'మ'కారము కూడి పలుకబడు రామ శబ్దము కూడ యెనలేని జన్మతారకమని, ఒక మహాభక్తకవి 17 వ శతాబ్దములో అందించిన యీ శ్లోకము గ్రహింతము-

శ్లో॥ ధ్యాయామి రామ, మభిరామగిరా, మరంద
దారామధుఘ్న మితరామ మరే విరామం
ఆరామ మద్భుత తరామల సద్గుణానామ
ఘో రామ యఘ్న, మసురామర వందితాంఘ్రిః॥

మరొక విశేషము, మన ఆంధ్రదేశమున అవతారమూర్తియగు శ్రీరామచంద్రుని దేవాలయముల విగ్రహములుగాను, దేవతార్చనల సాలగ్రామములుగాను అర్చించు అలవాటు. ఉత్తరాదిని శ్రీరామ విగ్రహములకు తుల్యముగా శ్రీ తులసీదాసు రామాయణ గ్రంథమును, దేవతార్చన పట్టిపై అర్చించి, కర్పూరహారతులిచ్చి పఠించు నాచారము నేటికి కానవగును.

పవిత్ర కాశీక్షేత్రమున, శ్రీ తులసీదాసు పాలరాతి విగ్రహమును దర్శింపవచ్చు. అదిగాక, మహాధనీ, భక్తుడు శ్రీ బిర్లా, యీ క్షేత్రమున పాల'రాతి'లో, తులసీదాసు మందిరము నిర్మించి, అందలి

కుడ్యములపై తెల్ల పాలరాతి పలకలపై శ్రీ తులసీదాసు రామాయణ చరణము లన్నింటిని రచింపజేసెను. దర్శనీయ భక్తుల కివి పఠనయోగ్యములై అలరారుచున్నవి. ఆ ప్రక్కనే నేడాంధ్రదేశమున విరివిగ ప్రచారమంది, వర్తింపబడు తులసీదాసు రామాయణము తర్వాత 'హనుమాన్ చాలీసా' మూర్తిస్వరూపుడగు శ్రీ హనుమాన్ మందిరమున్నది. దానినంటి లక్షలు వెచ్చించి శ్రీరామచంద్ర దేవాలయం నిర్మించుచున్నారు. ఇట్టివే తులసీదాసు రామాయణ మందలి గాథ, భక్తిప్రపత్తి చిహ్నములగు మందిరములు, పవిత్రసూక్తులు.

ఇట్టి 'భక్త తులసీదాస హృదయాంబుజాత నిర్ముక్త రామాయణ సారము' జాను తెనుగున ననువదించి ఆంధ్ర మహాజనుల కందించిన, మా గురుజాడవంశజాత, మా తమ్ముని బిడ్డ చి॥ సౌ॥ నిడుమోలు లక్ష్మీబాలప్రసూనాంబను, సహృదయులగు పాఠక మహాశయులు గ్రంథమునందలి విశేషముల గ్రహించి, సమాదరించి, యాశీర్వదింత్రుగాత. ఇవే నా హృదయపూర్వకమగు శుభాకాంక్షలు.

ఇట్లు
శ్రేయోభిలాషి - బృందావనవాసి
**గురుజాడ రాఘవశర్మ**

# భాగవత అధ్యాత్మ రామాయణము

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

వ్యక్తి స్వీయధర్మంతో సమాజధర్మాన్ని ఆరాధించే విధాన్ని చెప్పింది రామాయణం. సమాజధర్మాని కనుగుణంగా స్వీయ ధర్మాన్ని మలచుకొనే మెళకువను చెప్పింది భారతం. వ్యక్తినీ సమాజాన్నీ భక్తిసూత్రంతో బంధించి పరమాత్ముని పాదాలముందుంచింది భాగవతం. రామునియందు ధర్మం సిద్ధం. ధర్మరాజునందు ధర్మం సాధ్యం. భాగవత భక్తులకు ధర్మం సాధనం. సాధన రూపమైన ధర్మం సమాజానికి అనుసరణీయం. అందువల్లనే భాగవతభక్తి ప్రజలకు ప్రాణప్రదమైంది ధర్మాన్ని సాధించే ధర్మరాజు ఆదర్శప్రాయుడైనాడు; ధర్మరూపుడైన రాముడు ఆదర్శప్రాయుడైనాడు లోకం ఆదర్శవ్యక్తిని ఆరాధ్యశక్తిగా భావించటం సహజం. రాముడు దేవుడు కావటానికి ఈ ప్రజాప్రవృత్తియే ప్రణవమార్గం వేసింది భాగవత దృష్టితో రామాయణాన్ని చదువ నారంభించింది. భక్తుడు రామాయణాన్ని చేపట్టినప్పుడు దాన్ని భాగవత రామాయణాన్ని చేశాడు. ఈ భాగవత రామాయణ భావనా ప్రస్థానంలో పరమ రమణీయాకృతిని సంతరించుకొన్న కృతి తులసీదాస రామాయణం.

భక్తి ముక్తిని కోరే మానసికశక్తి, ధర్మం ఫలాన్ని కోరదు. ఫలం ధరాన్ని వెన్నంటి వస్తుంది. భక్తి భగవంతుణ్ణి కోరుతుంది. భాగవతభక్తుని కామనవెంట ధర్మం పరుగులిడుతుంది. రామాయణంలో ధర్మరూపుడైన రాముడు కోరేదేమీ లేదు. ధర్మం అతని ఊపిరి; అతని చైతవ్యం. భక్తులు రాముణ్ణి కోరుతారు. వాల్మీ

రామాయణంలో పాత్రలు భక్తిని జీర్ణించుకొన్న ధర్మప్రవృత్తులు. తులసీ రామాయణంలోని పాత్రలు భక్తినే ధర్మంగా మలచుకొన్న ఆర్ద్రప్రవృత్తులు. వాల్మీకి ధర్మాన్ని భక్తితో నవనీతం చేశాడు; తులసీదాసు భక్తిని ధర్మమార్గంలో మధువులా ప్రవహింపజేశాడు.

భక్తి ముముక్షువుల చేతుల్లో జ్ఞానభిక్ష నందుకొంటుంది. జ్ఞానం రామాయణాన్ని పరమార్థ సాధనానికి ప్రతీకగా భావిస్తుంది. రాముణ్ణి పరమాత్మకు ప్రతీకగా చెపుతుంది. అప్పుడు - ధర్మం దైవంగా మారుతుంది; ఆదర్శం ఆలోచనగా పరిణమిస్తుంది; ఉపదేశం ఉపాసనగా ఉన్మీలిస్తుంది. అధ్యాత్మ రామాయణ స్వభావ మదే. తులసీదాస రామాయణం అధ్యాత్మ భక్తితో ముక్తిని కోరింది; రామాయణానికి భాగవత ప్రపత్తిని ప్రసాదించింది. ఒక్కమాటలో చెప్పాలంటే-రామచరిత మానసం భాగవత అధ్యాత్మ రామాయణం! అది ఒక త్రివేణీ సంగమం !!

# అత్యుత్తమ గ్రంథం

ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

మన ప్రాచీన సంస్కృతికంతకూ మహాభారత రామాయణాలు మౌలికములైన ఆధారాలు. ఈ రెండింటిలో ఆధ్యాత్మికదృష్ట్యా రామాయణానికి ఎక్కువ ప్రాశస్త్యం లభించింది. రామాయణంలో అన్నదమ్ముల ఆదర్శజీవితం, సీతాదేవియొక్క పాతివ్రత్య ధర్మం చాలా చక్కగా చిత్రింపబడినది. ఈ కారణంచేత అప్పటినుంచి ఇప్పటివరకు సీతాదేవి స్త్రీలందరికీ మార్గదర్శకురాలై ప్రభావము వహించింది. ఆమె అడుగుజాడలలో నడవవలెనను ఆశయం హిందూ స్త్రీలందరికి ప్రఖ్యాతిగా కనిపించింది. అలాగే రామలక్ష్మణుల భాతృస్నేహము మార్గదర్శకమైనది. రామాయణంలో హనుమంతునికి ప్రత్యేక ప్రఖ్యాతి వుండుట సర్వజన విదితము. అతని పేరు భక్తికి ఆదర్శమైనట్టిది. రామాయణంలో మనకు కనిపించే ఇతర పాత్రలు కూడా ఇదేవిధముగా యుగయుగములనుండి భారతీయులను ఆకర్షించినవి.

రామాయణ గాథకు చారిత్ర్యక ఆధారములు వున్నవా! లేవా! అనే సమస్యను విమర్శకు లనేకులు చర్చించడము కద్దు. కాని ఈలాటి సమస్యను లేవదీయడము ఎక్కువ సమంజసము కాజాలదు. దానికి చరిత్రలో ఆధారములున్నా లేకపోయినా అది కోటానుకోట్ల భారతీయుల హృదయములపై శాశ్వతముద్ర వేయగలిగినది. మన గ్రంథము లన్నిటిలో దానికి ఉత్తమస్థానము ఈ కారణంచేతనే లభించినది. యుగయుగాల పర్యంతము ఈ ఉత్తమస్థానము స్థిరముగా నిలిచి యుండగలదు.

బా ల కాం డ

# రామమహిమ - నామమహిమ

సాకేత సార్వభౌమునకు వందనం, ఇష్టదేవతకు ఇదే నా వందనం. వాగ్దేవికి వందనం, సకల విద్యా పూజితునకు వందనం, కవి కోకిల వాల్మీకికి వందనం, భక్తశిరోమణి తులసీదాసునకు వందనం, రామభక్తు లందరికీ వందనం. సర్వమంగళదేవతకు వందనం, వాయు సుతునకు వందనం, మహానుభావులెందరో! అందరికీ వందనం, సాష్టాంగ వందనం.

సకలశాస్త్ర పురాణాగమము లన్నింటిలోను శ్రీరాముని యశస్సు కీర్తించబడివున్నది. త్రికాలజ్ఞులు శుక శౌనకాది మునులు రామనామము జపించిరి. అది మహామంత్రము. భగవంతుడు సగుణుడు, నిర్గుణుడు అనికూడా నిరూపణమైనది- నామరూప రహితుడు, జగద్వ్యాపకుడు, అఖిలాండకోటి బ్రహ్మాండమునే సృష్టించిన దేవదేవుడు శ్రీరఘుకులమందు దశరథ సుతుడుగా అవతరించి భక్తులకు, ఋషులకు, మునిపుంగవులకు మోక్షమొసగెను. అహల్యకు శాపవిమోచన గావించి శబరి, జటాయువువంటి భక్తులకు మోక్షమిచ్చెను.

శివుడూ పార్వతీ ఎల్ల వేళలా రామనామజపము చేయుచుందురు. మరా-మరా అని జపించిన వాల్మీకి శ్రీమద్రామాయణమునకే సృష్టికర్త యాయెను. రెండక్షరముల ఈ నామము నరనారాయణుల వంటి వని శ్రీ తులసీదాసు వుల్లేఖించిరి.

రామనామము శ్రీరామునికంటెను గొప్పదని యందురు. శ్రీరాముడు కొంతమందినే ఉద్ధరించెను. కాని రామనామము స్మరించిన వారినందరినీ ఉద్ధరించును. ప్రహ్లాదుడు ఈ నామము జపించి

భక్తశిరోమణి యయ్యెను. ధృవుడు అత్యున్నత స్థానము నందెను. హనుమంతుడు ఈ నామజపము చేసి శ్రీరామునే వశమొనరించు కొనెను. అజామీళుడు ముక్తి పొందెను. రామనామమహిమ వర్ణించలేము.

కలియుగమునందు రామనామము స్మరించిన చాలును, సమస్త కోరికలు సిద్ధించును. శాంతి కలుగును. శ్రీరామా! రామ చంద్రా! అని పిలువనివారు, తలపనివారు వుండరు. ఆర్తులు రామా! యని స్మరించి తమ కష్టముల నెడబాపుకొనుచుందురు. ఈ సంసారమునందు మనకు ప్రాప్తించు ఘోరదుఃఖములన్నియూ రామనామ స్మరణవలననే దాటగలుగుదుము.

శ్రీ త్యాగరాజస్వామివారు శ్రీరామచంద్రుని మహిమ కను గొని ప్రతి హృదయమునందుననూ హత్తుకొనువట్లు కీర్తించిరి. ప్రతి హృదయము ఒక రామభక్తి సామ్రాజ్యము గావించిరి. భక్త రామ దాసు రామభక్తికే ప్రతీక! భక్తపోతన రామభక్తి యనెడి తేనెలో తన కలమును ముంచి భాగవతమును వ్రాసినారు.

రామనామ బలమే తనకు బలమని పూజ్య బాపూజీ చెప్పి యుండిరి. వారి జీవితకాలముననూ, సర్వ కార్యకలాపములందుననూ, చివరకు అంత్యక్షణములందుకూడ రామనామ స్మరణమే జీవన్ముక్తి మార్గమని నమ్మియుండిరి.

యుగయుగములందుననూ రామకోటి వ్రాసిన, వ్రాయుచున్న భక్తులెందరో గలరు. నామమహిమవలన భక్తులు పొందు ఆత్మశాంతిని సౌఖ్యములను వర్ణించలేము. శ్రీరామచంద్రుడు సచ్చిదానంద మూర్తి. పరమాత్ముడు. పరంధామము నిచ్చువాడు. శీలనిధానుడు. వారి నామము స్మరించుటవలన ఎల్లరకూ ఎల్లవేళలా శుభములే కలుగును.

మాటలకూ మనస్సుకూ భాషకూ భావానికీ అందని అవా ఙ్మానస గోచరుని కీర్తిచంద్రికలు గ్రోలవలెనను ఆశ గలిగినది. ఈ ప్రయత్నము తలపెట్టితిని. శ్రీరాముడే నాకు వ్రాయుశక్తిని ప్రసా దించవలెను! అండగా నిలువవలెను!! శ్రీరామ. శ్రీరామ. శ్రీరామ.

# సాంబశివుడు - సతీదేవి

సాకేత రాజకుమారుడు పరబ్రహ్మము. సర్వవ్యాపకుడు. మాయారహితుడు. అయోనిజుడు. అగోచరుడు. ఇచ్ఛారహితుడు. భేదరహితుడు. అట్టి పరాత్పరుడు శ్రీరఘుకులమందు పుట్టెను. జ్ఞానుల, సిద్ధుల, మునుల కోరికలు తీర్చెను. దేవతల ప్రార్థనలు విని శ్రీహరి మనుష్యుడుగా అవతరించెను. భూభారమును తగ్గించుటకు అవతరించిన శ్రీరఘునాధుడు అవినాశి.

త్రేతాయుగములో ఒకసారి పరమశివుడు సతీదేవీ సమేతుడై అగస్త్య మహాముని ఆశ్రమమునకు వెళ్లెను. మహర్షి జగజ్జననికి, పరమేశ్వరునకు నమస్కరించెను. వారు కొంతకాలము అచట వుండి మహర్షి ద్వారా శ్రీహరి గుణగాధలు కొన్ని వినుచూ, వారికి కొన్ని వినిపించుచు గడిపిరి.

అటుపిమ్మట శివసతు లిరువురు తిరిగి కైలాసమునకు వెళ్లుటకు ప్రయాణమైరి. ఆ వెళ్లు త్రోవలో శ్రీరాముడు లక్ష్మణ సమేతుడై దండకారణ్యములో సంచరించుచూ కనుపించెను. ఆ సమయములోనే రావణుడు సీతాదేవిని అపహరించుట, సీతవియోగములో శ్రీరాముడు విలపించుచూ ఆ అరణ్యములో విహరించుచుండుట జరిగినది. ఆ దృశ్యమే శివుడు సతీదేవి చూచిరి.

ఏ దేవదేవునకు సంయోగ వియోగము లనునవి లేనేలేవో ఆ దేవుడు సీతాన్వేషణ చేయుచూ, విలపించుచూ కనుపించెను. భగవంతుని చరిత్ర విచిత్రమైనది !

శ్రీరఘుకులమందు జన్మించిన రామచంద్రుని దర్శించవలెనని పరమశివునకు కోరిక కలిగినది. జగత్తును పవిత్రమొనరించుటకు అవతరించిన సచ్చిదానందుని చూచి శివుడు జయము పలికెను. అదిచూచి సతీదేవికి ఆశ్చర్యము కలిగినది.

ఎందుచేతననగా శివుడు జగదీశ్వరుడు. దేవతలు, ఋషులు, మునులు నతమస్తకులై ఆయనకు ప్రణమిల్లుదురు అట్టి పరమశివుడు కేవలము ఒక రాజకుమారుని చూచి పరంధాముడనుచూ, జయము పలకడము, వారి శోభను తిలకించి ముగ్ధులవడమేమిటి? ఆమె తన సందేహము శివునకు తెలిపినది

ఆయన ఇట్లనెను. "అటువంటి సందేహము లెన్నడు మనస్సు లోనికి రానీయరాదు. అగస్త్య మహర్షి ఎవరి గుణగాధలు ఇంత కాలము మనకు వినిపించెనో ఆతడే ఈ శ్రీరఘునాథుడు. కరుణాంత రంగుడు. దేవతల కోరిక మన్నించి మానవ శరీరము ధరించిన దేవ దేవుడు. శ్రీహరి సర్వజ్ఞుడు, జ్ఞాననిధానుడు. సమస్త బ్రహ్మాండము నకు స్వామి. బ్రహ్మస్వరూపుడు ఈ శ్రీరామచంద్రుడే!"

ఈ విధముగా పరమశివుడు ఎన్నివిధముల కొనియాడిననూ, ఎంత చెప్పిననూ సతీదేవి మనస్సులోని సంకోచము నివృత్తికాలేదు. భగవంతుని మాయ ఆమె తెలుసుకొనలేకపోయెను. సీతావిరహ ములో దుఃఖించు శ్రీరాముడు భగవంతుడని ఆమె నమ్మలేక పోయినది.

అట్లయినచో ఆమెనే వెళ్ళి శ్రీరామచంద్రుని పరీక్షింపుమని పరమశివుడు ఆనతిచ్చెను.

## సీత వేషములో సతీదేవి

శ్రీరాముని పరీక్షించుటకు సతీదేవి సీత వేషము ధరించినది. రామభద్రుడు వెదకు త్రోవలో నడువసాగినది. ఇదిచూచి లక్ష్మణ స్వామి నివ్వెరపోయెను. శ్రీరాముడు సర్వజ్ఞుడు. ఆయన సతీదేవిని చూచి "అమ్మా! మీరు ఒంటరిగా ఈ అరణ్యములో విహరించుచుంటి రెందులకు? పరమశివుడెక్కడ?" అని పలుకరించిరి.

శ్రీరాముని మృదుమధుర వాక్కులు విని సతీదేవి సిగ్గుపడినది. సర్వాంతర్యామి జగదభిరాముని పరీక్షింపబోయి తన అజ్ఞానమునే నిరూపించుకొన్నందులకు సతీదేవికి పశ్చాత్తాపము కలిగినది.

ఆ సమయములో సతీదేవి అనుమానము పూర్తిగా నివృత్తి చేయుటకుగాను సర్వజ్ఞుడు తన విరాట్ రూపమును చూపించెను. సీతాలక్ష్మణసమేతుడై యున్న సచ్చిదానందమూర్తిని సతీదేవి చూచెను. అంతేకాదు. అనేకమంది శివులు, విష్ణువులు, బ్రహ్మలు, బ్రహ్మాదిదేవతలు, సకల చరాచరములు కనుపించెను. అందరూ పూజించు ఆ దేవదేవుడు ఆ శ్రీరాముడు ఒక్కడే! వారికి ఇన్ని రూపములు భేదములు లేవు?

ఆ దృశ్యము చూచిన సతీదేవి భయకంపితురాలయినది. శివుని వద్దకు వెళ్ళినతరువాత వారు శ్రీరాము నెట్లు పరీక్షించితివని యడిగిరి.

శ్రీరాముని అమిత ప్రభావము నెరిగిన సతీదేవి జరిగిన వృత్తాంతము భర్తతో చెప్పలేకపోయెను. పరమశివుడుకూడా శ్రీరాముని వలెనే సర్వజ్ఞుడు గనుక దివ్యదృష్టితో జరిగినదంతయూ తెలుసుకొనెను.

ఒకసారి సీత రూపు ధరించిన సతీదేవిని తిరిగి భార్యగా స్వీకరింపజాలనని మనస్సులో ఆమెను పరిత్యజించి రామనామము స్మరించుచూ సమాధిస్థితుడయ్యెను. శివునకు రామునియెడగల పరమభక్తికి మెచ్చి ఆకాశవాణి భవిష్యత్తు పలికినది.

సతీదేవి దక్షుడొనరించు యజ్ఞకుండమునందు ఆహుతి అయి తిరిగి హిమవంతునింట పుత్రికగా జన్మించి పార్వతిగా పరమశివుని కొరకు ఘోరతప మాచరించి ఆయనను భర్తగా పొందవలసి యున్నది.

ఇట్లు చాలకాలము గడచినది. పార్వతి తపస్సు ఫలించి పరమ శివుడు ఆమెను పరిణయమాడెను. కైలాసములో సుఖించుచున్న శివపార్వతులు ఎల్లప్పుడు శ్రీహరి కథలనే కొనియాడుచుండిరి. శ్రీహరి కథలు ఎన్ని విన్ననూ ఇంకనూ వినవలెనను కోరిక పార్వతికి కలుగుచుండెను. క్రిందటి జన్మలో సతీదేవిగా శ్రీరాముని విరాట్ రూపము దర్శించిన తరువాత భగవంతుడు జగద్వ్యాపకుడని వారి

గుణములు రూపములు అనుపమమైనవను విశ్వాసము పార్వతీదేవికి పూర్తిగా కలవు. ఇంకనూ అనేక వివరములు, కథలూ వినవలెననెడి కుతూహలము పార్వతికి కలిగెను.

నిర్గుణ పరబ్రహ్మము సగుణస్వరూపుడెందుకు కావలసి వచ్చెను? జానకీదేవి శ్రీరాముని నెట్లు వివాహమాడినది? శ్రీరాముడు రాజ్యపరిత్యాగ మెందుకు చేసెను? అరణ్యమునందు ఏమేమి చరిత్ర నడచినది? శ్రీరాముడు రావణుని ఎట్లు సంహరించెను? శ్రీరఘుకుల శిరోమణి ప్రజాహితము కోరి తిరిగి అయోధ్యకు ఎట్లు వెళ్ళెను? మొదలగు కథలన్నియూ తనకు వివరముగా తెలుపమని పార్వతీదేవి పరమశివుని కోరినది.

జిజ్ఞాసాయుతమైన పార్వతీదేవి కోరికలను విని పరమశివుడు సంతసించెను. ఆయన హృదయమందు శ్రీరాము డంకితమైయుం డెను గనుక నేత్రములలో ఆనందబాష్పములు నిండి హృదయము ద్రవించెను. శరీరము పులకించెను.

జగత్కల్యాణముకొరకు శివుడు శ్రీరాముని వివిధ గుణగాధలు పార్వతికి వినిపించెను.

# అయోధ్యలో అవతారమూర్తి

వేదములు, సరస్వతి, ఆదిశేషుడు కూడా వర్ణించలేని జ్ఞానాతీతుడు భగవంతుడు. పరిమాణరహితుడు, ఆదిమధ్యాంతములు లేనివాడు, ఇంద్రియాతీతుడు, ముకుందుడు, మోక్షప్రదాత. అటువంటి పరంధాముడు అతివ కౌసల్యాదేవి గర్భవాసమున ఇమిడి ఆమె తనయుడుగా అవతరించనున్నాడు! ఆ తల్లి ఏ తపస్సు చేసినదో! ఎన్ని నోముల పంటయో! ఏ పుణ్యఫలమో! కౌసల్యాదశరథులు శ్రీరాముని పుత్రవాత్సల్యముతో పెంచు అదృష్టమును ఎట్లు వర్ణించవలెను! ఏవిధముగా చెప్పవలెను!

శివుడు పార్వతీదేవితో శ్రీరామ జన్మవృత్తాంతమును ఈ విధముగా చెప్పెను.

రావణాసురుడు త్రికూట పర్వతమునందుగల లంకాధీశుడు. ఆతడు రాక్షసరాజు. అతులిత బలసంపన్నుడు. మొట్టమొదట లంకాపురిని కుబేరుడు పాలించుచుండెను. రావణాసురుడు సేనాసమేతుడై కుబేరుని దుర్గమును చుట్టుముట్టి యక్షులందరను వెడలగొట్టి ఆ దుర్గమును తనవశము చేసుకొనెను. అప్పుడే కుబేరుని పుష్పకవిమానము కూడ రావణాసురుని వశమైనది.

రావణుడు అమిత బలశాలి. ఒకసారి కైలాసపర్వతమునే అవలీలగా పైకెత్తెను. తన భుజబలము చూచుకొన్నపుడెల్ల రావణునికి ఎంతో గర్వముగా నుండెడిది. సుఖము, సంపద, సంతానము. సైన్యము, శౌర్యము వీటి అన్నిటివలన వాని గర్వము చెప్పనలవిగాకుండా పోయెను.

రావణుని సోదరుడు కుంభకర్ణుడు. ఆతడునూ అత్యంత బలోపేతుడు. ఆతడు మద్యమాంసములు సుష్టుగా సేవించి సంవత్సరము

నకు ఆరుమాసములు నిద్రించుచుండెను. ఆతడు నిద్ర లేచినచో ముల్లోకములు దద్దరిల్లును.

రావణుని పెద్దకొడుకు ఇంద్రజిత్తు. అతడు గొప్ప యోధుడు. యుద్ధమునందు వాని నెవ్వరు ఎదిరించలేరు. వాని శౌర్యమును జూచి స్వర్గధాములు కూడా గిలిల్లుచుండిరి. కాని వాడు మహాపాపి.

వీరుకాక దుర్ముఖుడు, అకంపనుడు, వజ్రదంతుడు, ధూమ్ర కేతువు, అతికాయుడు మొదలైన యోధులెందరో! ప్రతి ఒక్కరూ ప్రపంచమంతటినీ జయించగల మహావీరులు. అసురమాయలెన్నియో వీరందరికీ తెలుసును. దయాధర్మములనునవి వీరికి స్వప్నమునకూడా రావు.

ఇటువంటి వీరాధివీరులైన పుత్రమిత్రులను చూచి రావణుడు విజయగర్వముతో ఉప్పొంగుచుండెను. రావణుడు గర్జించినప్పుడెల్ల భూమి కంపించును. ఆ శబ్దమునకు దేవకాంతలకు గర్భస్రావము లగుచుండెడివి. దిక్పాలకుల నందరనూ హడలగొట్టి వారి లోకములను శూన్యము చేసెను. మాటిమాటికి సింహగర్జన చేసి దేవతలనందరను కయ్యానికి రమ్మని కాలు దువ్వుచుండెను. యుద్ధమదముతో ఉన్మత్తుడైన రావణుడు తనతో సమానమైన ధీరులు జగత్తులోనే లేరని ఎలుగెత్తి చెప్పుచుండెను. ఆతడు ప్రపంచమంతటనూ విజయగర్వముతో పరుగులెత్తుచుండెను.

వాని దుష్కార్యములవలన సూర్యచంద్రులు, వాయువు, వరుణుడు, కుబేరుడు, అగ్ని, యముడు ఇంకా కిన్నెర కింపురుషులు, సిద్ధులు, గంధర్వులు, దేవతలు, మనుష్యులు ఎవ్వరికినీ సుఖశాంతులు లేవు. బ్రహ్మసృష్టియందు శరీరధారణ చేసిన ప్రతి జీవియునూ రావణుని వశమైపోవలసివచ్చినది. ఉత్తమ కులస్త్రీల నందరను బలాత్కారముగా వివాహమాడుచుండెను.

గోవులను, బ్రాహ్మణులను చెప్పరానీ హింసలు పెట్టుచుండెను. శుభకర్మలు, యజ్ఞక్రతువులు చేసుకొనుటకు వీలు లేకనే పోయెను,

వీరి బాధలు పడలేక దేవతలు, గంధర్వులు మొదలైనవారం దరు బ్రహ్మలోకమునకు వెళ్ళి ఈ పాపకృత్యములు భరించలేమని మొరబెట్టుకొనిరి. భూదేవి గోరూపములో శ్రీ వైకుంఠ పురవాసుని దర్శించి పాపభూయిష్టమైన ఈ భారమును తాను మోయలేకుంటినని మొరబెట్టుకొనెను.

వీరందరు భగవంతుని అనేక విధముల స్తుతిచేసిరి. పరంధాముడు సచ్చిదానందమూర్తికి జయము పలికిరి. జన్మ మృత్యు జరా చక్ర భ్రమణమునుండి వేరుచేయగల దేవదేవుని శరణు జొచ్చిరి.

వీరి ప్రార్థనలు విని ఆకాశవాణి భగవానుడు భక్తులకొరకు భూలోకమున అవతరించనున్నాడని చెప్పినది. దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకు రఘుకులమందు శ్రీరాముడు పుట్ట బోవుచున్నాడని చెప్పినది.

అదితి కశ్యపుల తపస్సు చాలా గొప్పది. వారు భగవంతుని పుత్రునిగా బడయవలెనని, పుత్రవాత్సల్యములో పెంచుకొనవలెనని వరము పొందియుండిరి. వారలే అయోధ్యానగరము నేలుచుండిన దశరథ మహారాజునూ మహారాణి కౌసల్యా దేవియునూ. వారి గర్భ మున శ్రీమన్నారాయణుడుద్భవించును.

ఈవిధముగా పలికిన ఆకాశవాణి మాటలు వినినపిదప భూదేవి నిర్భయురాలయినది. శ్రీరాముడు రావణసంహారము చేయునప్పుడు ఆయనకు సహాయముగా నుండుటకు దేవతలందరునూ వానరురులుగా కిష్కింధయందు పుట్టెదరు. అందరునూ భగవంతుని ఆగవమునకు వేచియుందురు.

దశరథమహారాజుకు చాలాకాలము సంతానము లేకపోయెను. వారు చింతించుచూ గురువు వశిష్ఠ మహర్షిని పిలిపించిరి. అప్పుడు శృంగి యను ఋషిపుంగవునకు పత్రమానము పంపి వారిచేత దశరథ మహారాజునకు పుత్రకామేష్ఠి యాగము చేయించుట జరిగెను. భక్తి పూర్వకముగా యొనరించిన యజ్ఞఫలితముగా అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై హవిష్యాన్నము బంగారు గిన్నెలో అందించెను,

ఆ యజ్ఞప్రసాదమును రాజు-మహారాణులకు ముగ్గురకూ పంచియిచ్చెను ఆ ప్రసాదము భుజించిన ముగ్గురు రాణులు గర్భవతులైరి. శ్రీహరి తన అన్ని అంశములతో వారి గర్భములందు ప్రవేశించినంతనే పదునాలుగు భువనములు సుఖశాంతులతో నిండిపోయెను. తేజస్వరూపులుగా రాణులు ముగ్గురు రాజసౌధమునకే అందము నిచ్చుచుండిరి. సకల చరాచరములు ఆనందముతో సుఖించెను.

పవిత్ర చైత్రమాసము. మనోహ్లాదకరమైన వసంత ఋతువు. నవమి తిథి. శుక్లపక్షము. సుగంధములతో గూడిన మలయపవనములు వీచుచుండెను. ఉద్యానవనములన్నియూ పుష్పములతో కలకలలాడుచుండెను. నదులన్నిటియందునా అమృతధారలు ప్రవహించుచుండెను. బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారము దేవతలందరూ ఆకాశవీధులయందు విమానములలో విహరించుచుండిరి. గంధర్వులు, కిన్నెరలు హాయిగా పాడుచూ నగారాలు మ్రోగించుచుండిరి. మునులు, ఋషులు, దేవతలందరూ దేవదేవుని స్తుతించుచుండిరి. అట్టి శుభసమయమున సమస్త లోకాలకు శుభమునిచ్చు జగదోద్ధారకుడు కౌసల్య గర్భమున అవతరించెను. దేవతలు పూలవృష్టి కురిపించిరి.

# తల్లి వొడిలో నీలవర్ణుడు

విశ్వరూపుడైన పుత్రుని చూచుకొని కౌసల్యాదేవి, దశరథ మహారాజు ఆనందభరితులయిరి. భగవంతుడే సాకేతపురములో పుట్టినందులకు నగరవాసుల సంతోషమునకు మేరలేకపోయినది. నలుగురన్నదమ్ములకు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులని నామకరణములు చేసిరి. సర్వవ్యాపకుడు, నిరంజనుడు, నిర్లేపుడు, నిర్గుణ పరబ్రహ్మము కౌసల్యాదేవి వొడిలో ఆడుకొనుచుండెను.

శ్రీరాముని శరీరము నీలకమలమువలె నున్నది. కోటిమన్మథుల శోభతో నిండిపోయినది. ఆ చరణ కమలముల కాంతి తామరాకుల మీద మెరయు నీటిబిందువులవలె నవనవోన్మేష లొలుకుచున్నది. వజ్ర, ధ్వజ, అంకుశ చిహ్నములు ఆ పాదములమీద గలవు. శ్రీరాముడు తప్పటడుగులు వేయుచు నడచునప్పుడు ఆ నూపుర ధ్వనులు ఎంత మనోహ్లాదముగా నున్నవో! వక్షస్థలముమీద మణి హారము భృగుమహర్షి చరణ చిహ్నములు మనోజ్ఞముగా నున్నవి. కంఠము శంఖమువలె దివ్యమైన వెలుగుతో ప్రకాశించుచున్నది. అందమైన ముక్కు, చెవులు, నిగనిగలాడు బుగ్గలు, వచ్చీరాని మాటలు ముద్దులొలుకుచున్నవి. ఉంగరముల జుట్టుగల అంత అంద మైన బాలుని కలలోనైననూ ఎవ్వరునూ చూచియుండరు. అట్టి భవ్య రూపుని గురించి ఎంత చెప్పిననూ, ఎన్నినాళ్లు చెప్పిననూ, ఎన్ని గొంతుకలతో చెప్పిననూ, ఎన్ని కలములతో వ్రాసిననూ తీరదు, తరుగదు.

శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురునూ కొంచెము పెద్దవారయిరి. మనస్సు వాక్కు ఇంద్రియముల కగోచరమగు భగ వంతుడు దశరథుని ప్రాంగణములో బాలుడుగా ఆడుకొనుచుండెను. వారి ఆటపాటలు చూచిన జనులందరునూ ముగ్ధులగుచుండిరి.

ఇంక కొంచెము పెద్దవారయిన తరువాత నలుగురు బాలురు గురుకులమునకు వెళ్ళి విద్యార్థియనను చేయుచుండిరి. నాలుగు వేదములు శ్రీరాముని శ్వాసలోనే గలవు. అట్టి లీలామానుష రూపుడు రాముడు విద్యా వినయ సంపన్నుడుగా పెరుగుచుండెను.

ధనుర్విద్యా నభ్యసించిన తరువాత రాముడు అడవికి పోయి వేటాడుచుండెను. శ్రీరాముని బాణమునకు గురియయిన ప్రతిజీవి సరాసరి దేవలోకమునకే పోవుచుండెను.

## మునివెంట వెన్నెల జంట

విశ్వామిత్రుడు మహర్షి, జ్ఞాని. ఆయన జపము యజ్ఞములు క్రతువులు చేయుచుండును. ఆ చేయుసమయమున రాక్షసులు అనేక విఘ్నములు కలిగించుచుండిరి. ఆపాపులు భగవంతుని చేతిలోతప్ప మరణించరని మహర్షికి తెలియును భూభారము తగ్గించుటకు భగవంతుడు దశరధసుతుడుగా అవతరించెనని విశ్వామిత్రునకు తెలియును.

భగవంతుని కనులార గాంచి తనవెంట తీసుకొనివచ్చి ఈ రాక్షస చెర వదలించుకొన వలెనని మహర్షి అయోధ్యా నగరమునకు పయనమై వెళ్లెను.

దశరధ మహారాజు మహర్షిని ఆదరించి సత్కరించి సకలోపచారములు చేసి ఆహ్వానించెను. అటువంటి మహర్షి ఆగమమునకు రాజుగారెంతయో సంతోషించి తమ జన్మ ధన్యమైనట్లు భావించిరి. తన కుమారులు నలుగురనూ ఋషిపుంగవునకు పరిచయముచేసిరి.

శ్రీరాముని చూడగనే విశ్వామిత్రుడు అలౌకికానందమగ్నుడయ్యెను. సర్వమునూ మరచి అ దివ్యరూపునిచూచి తన్మయుడయెను. ఆ పిమ్మట అసలు విషయము రాజునకు నివేదించెను. శ్రీరామ లక్ష్మణులను తనతో తీసుకొనిపోవుటకు వచ్చితినని రామ లక్ష్మణులు వినా వేరెవ్వరూ తమ యజ్ఞమును కాపాడగలవారు లేరనీ ఆ దుష్టరాక్షసులను సంహారించగల వీరులు వీరేనని చెప్పెను.

విశ్వామిత్రుని పలుకులువిని మహారాజు అత్యంత వ్యాకులు డయ్యెను. శ్రీరాముడు ఇంకనూ చిన్నవాడు. ఆ ఘోరతాటకను లను వధింప శక్యమా? ఈ బాలకిశోరు లెక్కడా, ఆ దుష్టరాక్షసు లెక్కడ? అదిగాక శ్రీరాముని విడిచి తాను ఒక్క నిముసముకూడా బ్రతుకలేనని మహర్షికి సవినయముగా చెప్పెను. ఎన్నో తపస్సులు చేసి చివరకు పుత్రకామేష్టి జరిపిన తరువాత కలిగిన వరప్రసాదులు ఈ బాలురు. వీరు ఎల్లవేళలా తనకళ్ళ ఎదుటనే వుండవలెనని తాను వాంఛించుచుంటినని వారిని విడిచి వుండజాలననీ మహారాజు తన వ్యాకులతను మహర్షికి విన్నవించెను.

కాని మహర్షి అనేకవిధముల మహారాజును సమాధాన పరచెను. వొప్పుకొననిచో ఋషి శపించుదురేమోయను భయముతో మహారాజు రామలక్ష్మణులను విశ్వామిత్రులవెంట పంపుటకు సమ్మతించెను.

శ్రీరామ లక్ష్మణులను యజ్ఞ రక్షకులగా నియమించి విశ్వామిత్రుడు నిర్భయముగా క్రతువు కార్యక్రమములు నెరవేర్చుకొనెను. ఎప్పటివలెనే మారీచ సుబాహువులు విఘ్నములు సలుపుటకు వచ్చిరి. శ్రీరాముని అగ్ని బాణమునకు సుబాహుడు ఆహుతి యయ్యెను. మారీచుడు వంద యోజనముల దూరమునకుపోయి పడెను. తాటకిని ఒకే ఒక్క బాణముతో శ్రీరాముడు సంహరించెను.

## అదిగో మిథిల

మిథిలా నగరమున జనక మహారాజు ధనుర్యజ్ఞము తలపెట్టె నని విశ్వామిత్రునకు తెలిసినది. ఆ యజ్ఞమునందు పాల్గొనుటకు శ్రీరామ లక్ష్మణులను వెంటబెట్టుకొని విశ్వామిత్రుడు బయలు దేరెను. త్రోవలో వారికి ఒక పెద్ద శిల కనుపించినది అది గౌతమ ముని భార్య అహల్య. శాపవశమున అట్లున్నదని విశ్వామిత్రుడు శ్రీరామచంద్రునకు తెలిపెను. శ్రీరాముని పాదధూళి తాకగనే శాపవిమోచన మయినది. ఆ చరణ రజము సోకిన తపోమూర్తి అహల్య శ్రీరాముని అనేకవిధముల స్తుతించినది శాపగ్రస్తురాలై

ఇన్నాళ్ళూ పడివున్నను చివరకు భగవంతుని దర్శనభాగ్యము కలిగి నందుకు ఆమెజన్మ ధన్యమైనట్లు భావించుకొనెను.

మిథిలకు చేరుత్రోవలో గంగానదిని గురించి మహర్షి శ్రీరామ లక్ష్మణులకు తెలిపెను. వారు దేవనది గంగలో స్నానము చేసి బ్రాహ్మణులకు దానధర్మములు చేసిరి.

విశ్వామిత్రుడు శ్రీరామ లక్ష్మణు సమేతముగా జనక పురము చేరెను ఆ నగరముయొక్క అందచందములు మాటలలో చెప్ప తరముగాదు. అచటి నదులలో సరస్సులలో అమృతధారలే ప్రవహించుచున్నవి. చెట్లు ఫలసంపదలతో రమణీయముగా నున్నవి. అన్ని ఋతువులలోను సుగంధ మలయపవనములు వీచుచుండెను. పక్షులు మనోజ్ఞమైన కలరవము చేయుచుండెను. మకరందము గ్రోలిన తుమ్మెదల ఝుంకారము ఎంత కర్ణపేయముగా నున్నదో చెప్పలేము.

సకలైశ్వర్యములతో తులతూగు జనకమహారాజు సౌధమును చూచి దేవతలుకూడ చకితులగుచుందురు. సీతాదేవి నివసించుసౌధము నెట్లు వర్ణించవలెను? ఆ సౌధ ద్వారములన్నియు వజ్రవైఢూర్యము లతో తాపితము చేయబడి యుండెను.

మిథిలా నగరాధీశునకు విశ్వామిత్ర మహర్షి ఆగమనవార్త తెలిసినది. వారు తమ మంత్రులను గురువులను బ్రాహ్మణులను వెంటబెట్టుకొని మహర్షి వద్దకు వచ్చిరి. అచట శ్రీరామ లక్ష్మణులను చూడగానే మహారాజు ముగ్ధుడయ్యెను. ఆశోభ అలౌకికమైనది. వేద ములు నేతి-నేతి యనుచూ కీర్తించిన పరబ్రహ్మ యుగళమా యని పించుచుండెను. వీరెవరో తెలుపమని మహారాజు మహర్షిని యడిగిరి.

జనక మహారాజు తలచిన దెన్నడునూ మిథ్యకాదు. జగత్తు లోని సకల జీవరాశులకు సుఖమునిచ్చు శ్రీరఘుకులభూషణులు వీరని మహర్షి మహారాజునకుచెప్పెను. శ్రీరామలక్ష్మణ సమేతముగా విశ్వామిత్ర మహర్షికి ఒక సౌధములో విడిది యేర్పాటు చేసిరి.

ఉత్కృష్ట దర్శన భాగ్యముచేత సకల జీవులను తరింపచేయ గల శ్రీరఘునాథుడు లక్ష్మణ సమేతుడై మిథిలానగరము దర్శించుటకు బయలుదేరెను. వారి అందముచూచి పురజనులు చుట్టునూ మూగిరి. నీలమేఘ శరీరుడు, చందన లేపనము, పీతవస్త్రములు ధరించెను. వక్షస్థలముపై గజముక్తాభరణము. అతిలోక సౌందర్యము, నుదుటిపై ఎర్రని కస్తూరి తిలకము. కోటిమన్మధుల నొక్కదరి ప్రోగుచేసినను వీరి శోభకు సరితూగలేరు. ఇంతటి సుందరమూర్తులు ఎన్ని జన్మల తపఃఫలము వలననో కనుపించిరనుకొని వారిభాగ్యమునకు వారే ఉప్పొంగిపోయిరి.

ఆ మరునాడు మహర్షికి పూజాద్రవ్యములు సమకూర్చుటకు పూవులు పత్రములు తెచ్చుటకు రామ లక్ష్మణులు బయలుదేరిరి. మహారాజు ఉద్యానవనమునకు వెళ్ళిరి. మనోజ్ఞమైన వసంతఋతువు ఆ వనములో స్థిరముగా వుండిపోయినదా అనిపించు చుండెను. రామ లక్ష్మణులు అచటనున్న తోటమాలి నడిగి పువ్వులు పత్రములు కోనుకొనిరి,

అదే సమయమున సీతాదేవి జగజ్జనని గౌరీదేవి పూజలొనరించుటకు ఉద్యానవనమందు సరోవర సమీపముననున్న పూజాగృహమునకు వచ్చెను. ఆమె చెలికత్తెలు హాయిగా పాటలు పాడుచూ సీతతో వచ్చిరి. వారందరునూ తలవనితలంపుగా శ్రీరాముని చూచిరి. ఆ సౌందర్యమునుచూచి ముగ్ధులై పులకించిపోయిరి.

## చూపుల పందిళ్ళు

సీతాదేవి కంకణ నిక్వణములు విని శ్రీరాముడు మన్మధుని విజయ ధనుష్టంకార మనుకొనెను. సీతవైపు చూచెను. వారిరువురి కన్నులు అనిమిషములైనవి. శ్రీరాముడు సీతాదేవి అద్భుత సౌందర్యమును చూచి దానికి అవధులు లేవనుకొనెను. ఒకమాటలో చెప్పవలెనన్నచో బ్రహ్మదేవుడు తన నిపుణత నంతనూ ప్రోగుచేసి ప్రపంచమునకు చూపుటకుగాను సీతను సృష్టించెనా యనునట్లుండెను. అందమను గృహమునకు ఆమె దీపశిఖ. ఆ అందాలరాశిని ఎవరితో

వధూవరులుగా చేసిన ఎంత బాగుండు'నని యూహించుకొనుచుండిరి. జానకికి తగిన వరుడు రాముడేనని మురిసిపోయిరి.

జనకమహారాజు ప్రతిజ్ఞ మరొకమారు సభాస్థలమున ప్రకటించబడెను. ముల్లోకములందలి వీరులు యోధులు రాజులు రారాజు లెవరైననూసరే కఠోరమైన శివధనస్సును విరచి సీతను చేపట్టమని ప్రకటించిరి.

ఈ ప్రతిజ్ఞ విని ఎందరో రాజులు ముందుకు వచ్చిరి. తమ బాహుబలమును చూచుకొని తామే గర్వితులగుచూ శివధనస్సు పైకెత్తుటకు ప్రయత్నించిరి. శక్తి నంతను అనేకవిధముల ప్రయోగించి చూచిరి. ఇష్టదేవతను ప్రార్థించిరి. కాని విఫలురైరి. మూర్ఖులు కొందరు దురాశతో ధనస్సును ఎత్తచూచి ఎత్తలేక భయభ్రాంతులై పెద్దగా అరచుచూ చతికిలబడిరి. వెయ్యిమంది ఒక్కసారి పట్టుకొని పైకెత్తుటకు ప్రయత్నించిననూ ప్రయోజనము లేకపోయినది. ఆ ధనుస్సు అంతకంతకు బరువు ఎక్కువగుచున్నదా యనిపించుచుండెను.

అందరునూ ఆవిధముగా వోడిపోవుట చూచి జనకమహారాజు చింతించెను. తనప్రతిజ్ఞ చాటగనే ద్వీప ద్వీపాంతరముల నుండి ఎందరో రాజులు ఈ యజ్ఞమునందు పాల్గొనుటకు వచ్చిరి. దేవతలు దైత్యులు మానవ శరీరములు ధరించి వచ్చిరి. వీరులు రణధీరులు ఈ ధనుస్సును వీసమంతయూ కదుపలేకపోయిరి. "ఈపృథ్వి వీరవిహీనమై పోయినదా? సీతను చేపట్టగల ధీరుడొక్కడునూ లేడా ? బ్రహ్మ దేవుడు సీత నుదుట వివాహగీత గీసినట్లు లేదు! ఆమె అవివాహిత గానే వుండిపోవలసి యున్నది కాబోలు! ఈ సంగతి ముందే యెరిగి నచో ఇటువంటి ప్రతిజ్ఞ చేసియుండెడి వాడనుకాను" అని రాజుగారు అనేకవిధముల చింతింపసాగిరి.

శ్రీ రఘువంశీయు లున్నచోట ఇట్టి అనుచితమైన వాక్కులు రాకూడదని లక్ష్మణస్వామి వుగ్రుడయ్యెను. అపుడు తగిన సమయము చూచి విశ్వామిత్రుడు శ్రీరామునకు శివధనుస్సును విరచి

సీతను చేకొనుమని అనుజ్ఞ ఇచ్చెను. జనకుని పరితాపము తీర్చుమని పలికెను.

వేదికయనెడి ఉదయాచల శిఖరమున శ్రీరాముడు బాల భాస్కరునివలె ప్రకాశించెను. వారినిచూసి మునివర్యుల నయన కమలములు వికసించినవి. శ్రీరాముడు శివధనుస్సును సమీపించగనే మునులు దేవతలు హర్ష ప్రఫుల్లితులయిరి. రాముని చూచిన నగర వాసులు రోమాంచితులయిరి.

వీరాధివీరులు రావణాసురుడు, బాణాసురుడు, ఎందరో రాజులు శివధనుస్సును నువ్వుగింజంత మేరకూడ కదుపలేకపోయిరి. కొందరసలు ఆ సమీపమునకే రాజాలకపోయిరి. అంతటి కఠోరమైన శివధనస్సును ఈ పిన్నవాడు విరచగలడా? హంస ఎక్కడైన మంధరపర్వత మెత్తగలదా? జనకమహారాజునకు ఏమియూ తెలియని స్థితి అయినది.

ఆ సమయమున సీతాదేవి అనేకవిధముల దేవతలను స్తుతి చేయుచున్నది. ఈ శివధనుస్సు తేలిక అయి శ్రీరాముడు విరవగలిగి నంత సున్నితమైనది కావలెనని ఆమె భవానీ శంకరులను ప్రార్థించి నది. ఈరోజు కొరకే తానిన్ని పూజలు చేసినది. ఆ పూజలు ఫలించి దేవత లనుకూలించి శివధనుస్సు శ్రీరాముడు విరుచునట్లు చేయుమని వరదాయకుడు వినాయకుని పదేపదే వేడుకొన్నది. ఆమె కన్నులలో ప్రేమాశ్రువులు నిండినవి. శరీరము పులకించుచున్నది. శ్రీరాముని మరొకమారు మనసారా చూచినది. తండ్రి ప్రతిజ్ఞను తలచుకొని ఎంతో క్షోభపడినది. శిరీష కుసుమముల పుప్పొడితో వజ్రమునకు సాన బెట్టవలెననుకొనుటే- ఈ రామచంద్రుడు ధనుస్సును విరచవలె నను ఆశ అనుకొన్నది.

ఈవిధముగా సీతాదేవి పడిన పరితాపము యూహించుకొన గలమేమో గాని వర్ణింప నలవిగాదు ప్రతిక్షణము అనేక యుగముల వలె గడుచుచున్నది. ప్రభువు శ్రీరామచంద్రుని వైపు ప్రేమమగ్ను రాలయి ఒకసారి చూచుచూ తిరిగి విచారముతో నేలకు చూచు

చుండెను. ఆమె కన్నీరు కనుకొలకుల యందే ఇంకిపోవుచున్నది తన మనోవ్యాకులత పైకి పొక్కునేమోయని భయపడుచూ సిగ్గు పడుచున్నది. తన ప్రేమ సత్యమైనచో శ్రీరాముడు తప్పక ధనుస్సు విరుచునని నమ్మి పదేపదే దేవతలను ప్రార్థించసాగినది. సర్వాంత ర్యామి శ్రీరాము డన్నియూ ఎరుగును. ఎవరికి ఎవరియందు నిజ మైన ప్రేమగలదో వారు వారిని తప్పక పొందుదురని సీతాదేవి ధైర్యము తెచ్చుకొనెను.

కరుణాంతరంగుడైన శ్రీరాముడు సీత భావములన్నియూ గ్రహించెను. కృపానిధానుడు సీతను- శివధనుస్సును మార్చిమార్చి చూచెను.

అప్పుడు లక్ష్మణస్వామి లేచి దిగ్గజములకు వరాహ కశ్యప ఆదిశేషువులకు భూభారమును జాగ్రత్తగా వహించమని ఆదేశించెను. శ్రీరాముడు శివధనుస్సు విరచనున్నాడని చాటెను. బ్రహ్మాండ మంతయు దద్దరిల్లి పోకుండునట్లు తన పాదములక్రింద అణచి పెట్టెను.

శ్రీరాముడు శివధనుస్సును తాకునప్పుడు సభికులందరు చిత్తరువులోని బొమ్మలవలె నిశ్చేష్టులైరి. సీతవైపు మరొకమారు చూచి ఆమెప్రేమానురక్తికిపులకితుడై దివ్యస్ఫూర్తితో శ్రీరాముడు శివధనుస్సును పైకెత్తెను. వారి చేతిలో ఆ ధనుస్సు విద్యుల్లతవలె మెరసినది. క్షణకాలమైన వ్యవధిలేకుండనే శ్రీరాముడు ఆ ధనుస్సును మండలాకారముగా చుట్టి విరిచి రెండు ముక్కలుచేసి క్రింద పడ వేసెను.

శివధనుస్సు విరిగిన కఠోర శబ్దమునకు సూర్యుని గుర్రములు గతులు తప్పినవి. లోకములు భీతిచెందినవి. దిగ్గజములు ఘీంక రించినవి. దేవతల, మనుష్యుల సంగతి చెప్పనవుసరములేదు. శ్రీరాముడు శివునివిల్లు విరిచెనని చెప్పకమునుపే ముల్లోకములకు తెలిసినది. ఆకాశమునందు నగారాలు మ్రోగినవి. బ్రహ్మాది దేవతలు సిద్ధులు ప్రభువును ప్రశంసించిరి. దేవాంగనలు, కిన్నెరలు మంగళ

గీతిక లాలపించిరి. విశ్వామిత్రుని ఆనందమునకు అంతులేదు. బ్రహ్మాండమంతయూ జయ జయ ధ్వానములతో నిండిపోయినది.

శతానందుడు చెప్పినపిదప సీతాదేవి వరమాల చేతపుచ్చుకొని శ్రీరామునిచెంతకు వచ్చినది. చెలికత్తెలు మంగళహారతులు పాడిరి. సిగ్గుపడుచూ అంచకన్నెవలె వచ్చుచున్న సీతాదేవి ఠీవి విశ్వ విజయమునే సూచించెను.

సీత రెండుచేతులతో వరమాల పట్టుకొని శ్రీరాముని మెడలో వేసెను. సీతకు తనయందుగల అలౌకిక అనురాగమునకు శ్రీరాముడు ముసిముసి నవ్వులు నవ్వుకొనెను.

దేవతలు పుష్పవృష్టి కురిపించిరి.

# అయోధ్యకు శుభవార్త

శ్రీరాముని చరితము అపారమైనది. ఏ కవియునూ ఈ అపార పారావారమును దాటలేరు. సీతారాముల కల్యాణగాథను ఎవరు వర్ణించగలరు?

శివధనుర్భంగమవగానే జనకమహారాజు విశ్వామిత్రమహర్షితో ఈ శుభవార్త వెంటనే దశరథమహారాజునకు తెలుపమని వేడిరి. వారందరునూ తరలివస్తే సీతాకల్యాణమును వేడుకగా జరిపించవలసి యున్నదని మనవిచేసిరి.

దూతలను పిలిపించి శుభలేఖ వ్రాసి వారిని అయోధ్యానగరమునకు వెళ్ళమని జనకమహారాజు ఆదేశించెను. వారు వెంటనే వెళ్ళిరి.

సీతాదేవి వివాహము అత్యంత వైభవముగా జరుపుటకు సన్నాహములు చేయుచుండిరి. బ్రహ్మదేవుని పిలిపించిరి అరటి స్థంభము నాటించి పెండ్లి పనులు ప్రారంభించిరి. పెండ్లిపందిరంతటా మణులు మాణిక్యములు పొదిగిరి. బంగార తీగతో నాగబేలి తయారు చేయించి వాసాలకు చుట్టిరి. అవి సహజమైన లతలల్లుకొనినట్లున్నవి. తుమ్మెదలు, పక్షులు నిజమైన తీగల కొని గాలిలో తేలియాడుచూ వచ్చి వాలుచుండెను అంత అందమైన మంటపములో సీతాదేవి పెండ్లికూతురు. శ్రీరాముడు పెండ్లికొడుకు! ఆ శోభ ముల్లోకములలోనూ ప్రసిద్ధిగాంచినదయి యుండవలెను. రాజసౌధ మెంత అందముగా నున్నదో, ఆ నగరములోని పతి ఇల్లు అంత అందముగానే యున్నది. ఆ నాటి జనకపురి అందము పదునాల్గుగు భువన

ములు వెదికిననూ ఇంకెక్కడా కానరాదు. ఆ శోభ తిలకించిన ఇంద్రాది దేవతలు చకితులగుచుండిరి. సరస్వతీదేవికూడ వర్ణించ నలవి కానిరీతిగా వెలుగొందుచున్నది.

రాజదూతలు ఈ శుభవార్త తీసుకొని అయోధ్యానగరమును చేరిరి. వారు దశరథమహారాజును దర్శించి ప్రణామముచేసి ఈ శుభ లేఖను వారి కందించిరి. ఆ లేఖ చదువుచున్నపుడు వారి కనుల యందు వాత్సల్యపూరితమైన కన్నీరు నిండినది. శరీరము పులకించి నది. వారి హృదయమున శ్రీరామ లక్ష్మణులు, చేతియందు శుభ లేఖ! ఆ నాడు విశ్వామిత్రునితో కలసి వెళ్లినతరువాత వారినిగురిం చిన సమాచారమేమియూ రాజుగారి కందలేదు. అందుచేత దశరథ మహారాజు తమ పిల్లల క్షేమ సమాచారములు పదేపదే ఆ దూతల నడిగిరి.

విశ్వ విభూషణులైన రామ లక్ష్మణుల వంటి పుత్రులనుకన్న దశరథుని అదృష్టము రాజదూతలు వేనోళ్ల కీర్తించిరి. అచట జరిగిన ధనుర్యజ్ఞ విశేషములు ఈవిధముగా తెలిపిరి. "సీతాదేవి స్వయంవర మునకు అనేకమంది యోధులు రారాజులు హాజరయిరి. కాని శివుని విల్లు పీసమంతయు కదుపలేకపోయిరి- మేరు పర్వతము నెత్తిన బాణాసురుడు, కైలాస పర్వతమునే అనాయాసముగా పైకెత్తిన రావణాసురుడు కూడ పరాజితులై వెళ్ళిపోయిరి, అటువంటి శక్తి గల శివధనుస్సును శ్రీరాముడు ఏమాత్రము ప్రయాసలేకుండ తామరతూడువలె త్రుంచి అవతల పారవేసెను. అపుడు పరశు రాముడు క్రోధావేశముతో అచటకువచ్చి శ్రీరామ లక్ష్మణులను ఎన్నో విధముల కవ్వించిరి. చివరకు రాముడు శ్రీమన్నారాయణు డని తెలుసుకొని తనవద్దనున్న విష్ణుచాపము వారికిచ్చి స్తుతిచేసి వెళ్లెను"

పై చెప్పిన వివరములు విని దశరథ మహారాజు, వారి సభ యందున్న పెద్దలు ఎంతో సంతసించిరి వశిష్ట మహర్షికి రాణివాస రమణులకు ఈవార్త తెలిపిరి. అయోధ్యానగర ప్రజలందరూ ఈవర్త మానము విని ఎంతో ఆనందించి నగరమంతయు అలంకరించిరి.

## పెళ్లివారి ప్రయాణం

దశరథ మహారాజు భరత శత్రుఘ్నులను పిలిచి శ్రీరాముని వివాహమునకు తరలివెళ్లు సన్నాహములు చేయమని ఆదేశించిరి. గుర్రములు ఏనుగులు ఏనుగంబారీలు పల్లకీలు తక్షణమే వారు సిద్ధముచేసిరి. రథములను జీనులను మణిమాణిక్యములతో అలంకరించిరి. అందమైన చామరములు గంటలు కట్టించిరి. ఆ రథములు సూర్యుని రథములను వోడించగలవిగా నుండెను.

వశిష్ట మహర్షియు వారి చెంతన దశరథ మహారాజును బృహస్పతి ప్రక్కన ఇంద్రునివలె రథములపై కూర్చొనిరి. గురువు గారి అనుజ్ఞ తీసుకొని మహారాజు శంఖము పూరించెను. దశరథ మహారాజు రథము కదలగనే ఆవెనుక పెండ్లి వారందరి వాహనములు కదలినవి.

ప్రయాణము అతి కోలాహలముగా నున్నది. దేవాంగనలు మంగళ హారతులు పాడిరి. మనోహరమైన రాగములతో సన్నాయి మ్రోగుచుండెను. పరబ్రహ్మ స్వయముగా దశరథ తనయుడై అవతరించినపుడు ఆ పెండ్లి ప్రయాణము నేమని వర్ణించవలెను!

సూర్యవంశ రాజైన దశరథ మహారాజు కుమారుని వివాహ మునకు మిథిలానగరమునకు తరలివచ్చుచున్నారను వార్త తెలియ గనే జనకమహారాజు మార్గమధ్య మందుగల సెలఏరులు, వాగులు నదులన్నింటి మీదను వంతెనలు కట్టించెను. మధ్య మధ్యన మజిలీలు

చేయుటకు విశ్రాంతి భవనములు, గుడారములు సమస్త సౌకర్యములతోను ఏర్పాట్లు చేయించిరి.

పెండ్లివారు మిథిలానగరమును సమీపించగనే జనకమహారాజు బంధుమిత్ర సపరివార సమేతముగా ఎదురేగి వారిని ఆహ్వానించెను. అపరిమిత సంతోషముతో రెండువైపుల పెండ్లివారు కలుసుకొనిరి. దశరధుడు జనకుడు వంటి ప్రతిష్టాపరులైన వియ్యాంకులు జగత్తులో మరెక్కడా వుండబోరు.

అందముగా అలంకరించిన విడిదిని ఏర్పాటుచేసిరి. పెండ్లివారి కందరికి అమృతతుల్యమైన పక్వాన్నములు ఫలహారములు బంగారు పాత్రలతో అందించిరి. సీతాదేవి ఎందరో సేవకులను నియమించి పెండ్లివారికి సకల సౌకర్యములు చేయుమని అదేశించినది. అందుచేత అతిధి మర్యాదలకు ఏమాత్రము లోటులేకుండా జరుగుచున్నవి.

విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణు లిరువురిని వెంటనిడుకొని దశరథ మహారాజును కలుసుకొనిరి. రాజు విశ్వామిత్ర మహర్షికి దండప్రణామములుచేసి రామ లక్ష్మణుల నిరువురిని హృదయమునకు హత్తుకొనెను. తండ్రిని చూడగనే వీరికి ప్రాణము లేచి వచ్చినట్లయినది. గురువుగారికి బ్రాహ్మణులకు నమస్కరించి వారి ఆశీస్సులు పొంది భరత శత్రుఘ్నులను కలుసుకొనిరి, ఆతరువాత అయోధ్యా నగరవాసుల నందరనూ కలుసుకొనిరి. రాముని చూడగనే అయోధ్యావాసుల మనస్సులలో వేయి పున్నములు విరిసినట్లయినది.

సీతారాముల కల్యాణమునకు ముహూర్తను నిశ్చయమైనది. హేమంతఋతువు, ఫాల్గుణమాసము, తిధివార నక్షత్రములు జాతకరీత్యా సరిపోవునట్లు నిర్ణయించిరి. వశిష్ఠ విశ్వామిత్ర సమేతముగా దశరథమహారాజుగారి పరివారము పెండ్లివారింటికి వచ్చిరి.

శంఖములు నగారాలు అన్నియు మ్రోగినవి. పెరుగు అక్షతలు పసుపు కుంకుమ మొదలైన శుభద్రవ్యములు ఎదురుగా ఆడపెళ్ళి వారు పట్టుకొని వచ్చిరి. సువాసినీస్త్రీలు మంగళహారతులు పాడిరి.

## కల్యాణ కింకిణులు

బ్రహ్మాది దేవతలు సీతారాముల కల్యాణ వైభవము చూచుటకు విమానములలో ఆకాశవీధులలో తిరుగుచుండిరి. వివాహ వేదిక యొక్క అలౌకిక నిర్మాణముచూచి వారు దిగ్భ్రాంతులైరి. అఖిల బ్రహ్మాండమునకు నాయకుడైన శ్రీమన్నారాయణుని వివాహ వైభవము సకలలోకములకూ ఆనందదాయకమైనదేగదా! శ్రీరఘు కులమందు బుట్టిన భగవంతునకు దేవతలందరూ జయము పలికిరి. పువ్వులు జల్లిరి. శచీదేవి, లక్ష్మి సరస్వతులు మనుష్యరూపములు ధరించి రాణివాస పుణ్యస్త్రీలందరితోనూ కలసిపోయిరి. కోకిల స్వనముతో మంగళహారతులు పాడిరి. ఆ కోలాహలమున ఎవరు ఎవరిని గుర్తుపట్టెడిస్థితిలోలేరు. శ్రీరామునిచూచి దేవతలు నరులు సర్వమును మరచిపోయిరి.

దశవిధ నాదములు, పంచనాదములతో మంగళవాయిద్యములు మ్రోగుచున్నవి. ఆకాశమున జయజయధ్వానములు! మహారాణి శ్రీరామునకు అర్ఘ్యపాద్యములిచ్చి ఎర్రనీళ్లు దిగదుడిచి దిష్టి తీసినది.

శ్రీరాముడు వివాహవేదికమీదకు రాగానే దేవతలు పువ్వులు జల్లిరి. పెండ్లిపీటమీద కూర్చొనెను. జనకమహారాజు స్వయముగా ఆసనములుతెచ్చి మునులను, పెద్దలను సుఖాసీనులను గావించిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, దిక్పాలకులు, సూర్య చంద్రులు మొదలగు ఘార్గంధరునూ మనుష్యరూపములు ధరించి వచ్చి కూర్చొనిరి,

వా రెవరో శ్రీరాము డొక్కనికే తెలియును. జనకమహారాజుగారికి వా రెవరో తెలియకపోయిననూ దేవతాసమానులుగా భావించి వున్నతాసనములమీద కూర్చొనబెట్టిరి.

సమయము చూసి వశిష్ట మహర్షి శతానందునితో సీతాదేవిని తీసుకొని రమ్మని కబురు పంపించెను. మహర్షి ఆదేశానుసారము సీతాదేవిని తల్లి, మరికొందరు పుణ్యస్త్రీలు వెంటబెట్టుకొని వచ్చిరి. దేవాంగనలు కూడా వీరితో నుండిరి.

సీతాదేవి అందము వర్ణింప శక్యముగాదు. మాటలు చాలవు. రూపరాసియయిన సీతాదేవి వేదిక దగ్గరకు రాగానే అందరునూ మనస్సులో నమస్కరించిరి. వేదోక్త ప్రకారము గౌరీపూజ, విఘ్నేశ్వరపూజ బ్రాహ్మణపూజ వధూవరులచేత చేయించిరి. దేవతలు ప్రత్యక్షమై వీరి పూజల నందుకొనిరి. హోమముచేయు సమయమున స్వయముగా అగ్నిహోత్రుడు ఆహుతుల నందుకొనెను. నాలుగు వేదములు బ్రాహ్మణ రూపములో వివాహ విధులను తెలిపెను. సూర్యుడు స్వయముగా తమ కులాచారమును విన్నవించెను.

ఈ విధమున దేవతాపూజలయిన తరువాత సీతాదేవిని శ్రీరాముని చెంత కూర్చొనబెట్టిరి. సీతా రాములకు ఒకరి ఎడల ఒకరికిగల ప్రేమ అపురూపమైనది. భావమునకు భాషకు అతీతమైనట్టిది. అట్టి అలౌకిక ప్రేమను వర్ణించుట సాధ్యముకాదు.

## ముత్యాల తలంబ్రాలు

భార్యా సమేతుడై జనకమహారాజు శ్రీరాముని పాదములు కడిగిరి. ఏ చరణ కమలములు స్మరించినంత మాత్రముననే సమస్త భవ బంధములు తొలగిపోవునో, మనోవాంఛలు సిద్ధించునో, ఏచరణ కమల రజము సోకగనే అహల్యాదేవి శాపవిముక్తు రాలయినదో,

అట్టి శ్రీరాముని చరణ కమలములు పట్టుకొని జనకమహారాజుగారు కడిగెను!!

వధూవరుల అరచేతులు రెండూ కలిపి పురోహితులు మంత్రములు చదివిరి. పాణిగ్రహణ మవగానే బ్రహ్మాదిదేవతలు సంతసించి పువ్వుల వృష్టి కురిపించిరి. ముత్యాల తలంబ్రాలు సీతారాములు పోసుకొనునపుడు ఆ అలౌకికశోభ నెట్లు వర్ణించవలెను? నవరాగ మణులు వారితలపైనుండి రాలునపుడు మెరయు తళుకులనూహించు కొనవచ్చునేమో! వ్రాయలేము. నవ వికసిత కమలములవంటి దోసిళ్ళతో ముత్యాల తలంబ్రాలు ముచ్చటగ పోసుకొనిరి. వేదోక్త ప్రకారము జనకమహారాజు సీతను రామునకర్పించిరి. కన్యాదానము చేసిరి. ఆ వధూవరులనుచూచి పధ్నాలుగు భువనములు ఆనందముతో వెల్లివిరిసి పోయినవి.

ఆ తరువాత వశిష్టులవారి ఆదేశము ప్రకారము మాండవి, సృతకీర్తి, ఊర్మిళ అను ముగ్గురు రాజకుమార్తెలను భరత లక్ష్మణ శత్రుఘ్నుల కిచ్చి యధావిధిగా వివాహములు జరిపించిరి.

పెద్దముత్తైదువలు పెండ్లి కుమారులను పెండ్లి కుమార్తెలనూ కులదేవతారాధన కొరకు తీసుకొని వెళ్ళిరి. పార్వతీదేవి ప్రేమ పూర్వకముగా వధూవరుల చేతులు కలిపి ఆశీర్వదించినది. నవవధూ వరులు దీర్ఘాయుష్మంతులు గావలెనని దేవతలు, యోగులు, సిద్ధులు దీవించిరి. వివాహ వేడుకలు ఎంత చెప్పిననూ తీరవు.

జనకమహారాజు పెండ్లి వారిని అడుగులకు మడుగులవత్తుచూ విందుభోజనమునకు తీసుకొని వెళ్లెను. ఆవునేతితో తయారుచేయ బడిన పిండివంటలు, షడ్రసోపేతమైన విందు, వియ్యాలవారి వరస పాటలు. బూజంబంతి పాటలు వినుచూ, నవ్వుకొనుచూ అందరూ

విందు లారగించుచుండిరి. ఆ తరువాత కర్పూరపీడెము లందుకొని తిరిగి విడిదికి చేరుచుండిరి. ఈవిధముగా చాలాదినములు గడచినవి.

జనకమహారాజు సౌజన్యమునూ ఐశ్వర్యమునూ ఎన్నోవిధముల కొనియాడి దశరథ మహారాజు తిరిగి అయోధ్యకు వెళ్ళవలెనను అభిలాష సూచించెను. ప్రతిదినమూ వేయివిధముల మర్యాదలు జరుపుచున్న జనకులు వీరు అప్పుడే తిరిగి వెళ్ళుటకు వప్పుకొనలేదు.

ఎట్లో బలవంతముగా చివరకు దశరథ మహారాజు బయలు దేరిరి. నలుగురు రాజకుమారులు అత్తగారలవద్ద శెలవు తీసుకొనుటకు వచ్చిరి. వారి నలుగురికి తలంటి స్నానము చేయించి ఆప్యాయముగా భోజనము వడ్డించిరి. అయోధ్యకు తిరిగి వెళ్లుటకు అనుమతీయవలసినదిగా శ్రీరాముడు మహారాణిని కోరెను.

సీతాదేవిని శ్రీరామునకు వప్పచెప్పుచూ తల్లి కళ్ళనీళ్లు పెట్టుకొనెను. మైథిలి పురజను లందరకు ప్రాణముకంటెను ఎక్కువ. ఆమె వీడ్కోలు ఎవ్వరునూ భరించలేరు. రాచిలుకలు, గోరువంకలు పశు పక్షు లన్నియుచూ సీతాదేవికొరకు విలపించుచున్నవి. ఇక మనుష్యులస్థితి ఎట్లు చెప్పవలెను !

నలుగురు వధువులనూ భర్తలకు వప్పచెప్పినపుడు జనకమహారాజుకు కన్నీరు ఆగలేదు. ఎంతటి విరాగులైననూ, జ్ఞానులైననూ ఆడపిల్లను అత్తవారింటికి పంపునపుడు హృదయము ద్రవించక మానదు. అట్లు కరిగిపోవుట మానవ సహజము ! జనకమహారాజు స్థితే దీనికి నిదర్శనము !

అందమైన పల్లకీలలో పెండ్లికుమార్తెలను కూర్చొనబెట్టిరి. ఇష్టదేవతలను మనస్సునందు ప్రార్థించిరి. పెండ్లివారందరుదూ

బయలుదేరగనే దశరథమహారాజు శంఖము పూరించెను. దేవతలు పువ్వులు జల్లిరి. అప్సరసలు మంగళహారతులు పాడిరి. అందరునూ ముందుకు సాగిరి. తమను సాగనంపుటకు వచ్చిన జనకుని దశరథుడు ఎంతగనో వోదార్చి తిరిగి వెనుకకు వెళ్ళమని వేడిరి. జనకుని నేత్రములు ప్రేమాశ్రువులతో నిండిపోయెను.

అల్లుడగు శ్రీరామచంద్రుని ఆయన పదేపదే ప్రశంసించిరి. సర్వవ్యాపక బ్రహ్మ, అవినాశి, సచ్చిదానందమూర్తి, సద్గుణరూపుడు ఆత్మస్వరూపుడు శ్రీరాముని పాదములయందు సదా ఎల్లపుడు తనకు ప్రీతికలిగి యుండునట్లు చూచుదురుగాక యని వేడిరి.

పెండ్లివారు ముందుకు సాగిరి. సాగనంపుటకు వెళ్ళిన జనకరాజు, వారి సోదరులు వెనుకకుతిరిగి వచ్చిరి.

# అయోధ్య కాండ



# భారతీయ ధర్మ ప్రతిష్ఠ

ఆచార్య రాయప్రోలు సుబ్బారావు

ఇతి, ఆర్షే, ఆదికావ్యే,-అని ప్రతి కాండా, ప్రతి అధ్యాయము ముగింపులో ఉన్నది. ఈ గద్య చిరంతనంగా అక్షరరమ్యంగా సంస్కృత సారస్వతములో పాదుకొనిపోయింది. దీనిని సందేహించిన వారు ఇంతవఱకును కానరారు.

వాల్మీకి మహర్షి ఆదికవి. ఈ మహాతపస్విని భూతభావనుడనీ, పురాణబ్రహ్మవాది అనీ స్మరిస్తాడు మహాకవి భవభూతి.

స్నానానికి ఏటికి వెళ్ళాడు మహర్షి. ఒడ్డున పెద్ద చెట్టున్నది. దానిమీద రెండు క్రౌంచపక్షులు కామమోహితములై పెనబడి ఉండెను. తటాలున ఒక పక్షి బోయవాని ములికి తాకి నేలమీదబడి మరణించెను. ఆ సన్నివేశము మహర్షి కంటబడ్డది. భూతభావనుడైన వాల్మీకి కరుణరసనిమగ్నుడై కరిగిపోయినాడు. తక్షణమే ఆ శోకము శ్లోకముగా అవతరించింది.

రామాయణము ప్రధానంగా మానవ సమాజమును విశిష్ట ధర్మబద్ధము చేస్తేనేకాని సమాజము సాంగ సమగ్ర, సుప్రతిజీవితముగా ప్రకాశించదని తన తపోదీక్షలో దర్శించాడు. దానికి పునాది స్త్రీ పురుష సాహచర్య సమారాధనమని విలోకించి రెండు ధర్మాలు లోకానికి వాచ్యంకాకుండా అందించినాడు. ఒక్క పురుషుడు ఒక్క స్త్రీ. ఒక్క స్త్రీ ఒక్క పురుషుడు అనే భారతీయ ధర్మమును లోకములో ప్రతిష్ఠించినాడు. అది శాశ్వత బ్రహ్మకల్పంగా నిలిచింది.

మహర్షి వాల్మీకి రామాయణము రాకముందు మానవ సమాజమునందు స్త్రీపురుష ప్రవృత్తికి నియత ధర్మం లేదు. ఉపనిషత్తుల లోని జబాలి కథ ఇందుకు తార్కాణము.

# అయోధ్యా కాండ

## శ్రీరామునకు పట్టాభిషేక ప్రయత్నములు

శ్రీరాముడు వివాహము చేసుకొని అయోధ్యకు తిరిగివచ్చిన నాటినుండి ఆ నగరము నిత్యకల్యాణము పచ్చతోరణముగా నుండెను. ప్రజలు సకలైశ్వర్యములతో తులతూగుచుండిరి. శ్రీరాముని రూపము గుణము శీలము చూచి దశరథమహారాజు ఉప్పొంగిపోవు చుండెను. రాముని యువరాజుగా చేయవలెనను కోరిక రాజుగారికి కలిగినది. తమకు వృద్ధాప్యము వచ్చినది. శ్రీరామునకు రాజ్యాభిషేకము చేసిన బాగుండునను అభిలాష నిండుసభలో వెల్లడించిరి.

శ్రీరాముడు సమస్తలోకములకూ మహేశ్వరుడు. అతడు అందరిప్రేమకు పాత్రుడు. కనుక ఆలస్యముచేయక వెంటనే తగిన ఏర్పాట్లు చేయవలసినదిగా గురువు వశిష్ఠమహర్షి ఆదేశించిరి.

రాజ్యాభిషేకమునకు కావలసిన వస్తువులను సేకరించుట మొదలుపెట్టిరి. అన్ని పుణ్యతీర్థములలోని జలము, ఓషధులు. ఫల పుష్పములు, చామరములు, మృగచర్మములు, వస్త్రములు, ఉన్ని దుస్తులు, పట్టుపీతాంబరములు, మణి మాణిక్యములు, వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగములు, వేదములలో ఉల్లేఖించబడిన సమస్త వస్తువులు సమకూర్చిరి. నగరములలోని అన్ని మంటపములు అలంకరించిరి. పండ్లతోవున్న మామిడి కొమ్మలను, పోకచెట్లను, అరటి స్తంభములను నగరములోని అన్నివీధులలోను అలంకరించిరి. ధ్వజ పతాక తోరణమాలలు కట్టిరి. గుర్రములు ఏనుగులు సిద్ధముచేసిరి.

శ్రీరామునికి రాజ్యాభిషేకము జరుగనున్నదను వార్త తృటికాలములో రాణివాసమంతటా ప్రాకిపోయినది. వారందరూ

హర్ష ప్రపుల్లితులైరి. ఈ సమాచార మందచేసిన వారందరికీ అనేక పారితోషికము లిచ్చిరి. కౌసల్యాదేవి గ్రామదేవతలకు, నాగులకు, విఘ్నేశ్వరునికి పూజలుచేసి ముడుపు కట్టినది. సర్వమంగళ దేవతలనూ ప్రార్థించినది.

వశిష్ఠమహర్షి శ్రీరామునివద్దకు వచ్చి ఈ వార్త తెలిపి ఆ రోజు ఉపవాసము వుండమనీ, సంయమ నియమములు పాటించమనీ ఆదేశించిరి. ఉపదేశముకూడా చేసిరి. శ్రీరాముడు సూర్యకుల భూషణుడు. ఆనంద విషాదరహితుడు. నలుగురన్నదమ్ములుండగా తనకొక్కనికి పట్టాభిషేక మెందులకని ఆయన అనెను.

అయోధ్యానగరమునగల స్త్రీ పురుషు లందరి ఆనందము అతిశయముగా నున్నది. ఇంటింటా అనేక మంగళవాయిద్యములు ప్రయోగించు చుండిరి. మేనమామల వూరు వెళ్ళిన భరత శత్రుఘ్నులు వెంటనే తిరిగివచ్చి ఈ వేడుకలు చూచిన ఎంత బాగుండుననని బంధు జనులనుకొనసాగిరి. వీధులందునా ఇళ్ళలోనూ ఎక్కడ విన్ననూ ఇదేమాట —"రేపే శ్రీరాముని పట్టాభిషేకము రేపే పట్టాభిషేకము!"

మనుష్యుల కోరిక లీరీతిగా వుండగా దేవతల కోరిక లింకొక విధముగా నున్నవి. దేవతలు ఈ కార్యమునకు విఘ్నములు తలబెట్టబోవుచుండిరి. వారందరునూ సరస్వతీదేవిని ప్రార్థించిరి. శ్రీరాముడు రాజ్యమును వదలి అరణ్యములకు వెళ్ళినగాని రామావతారము యొక్క లక్ష్యసిద్ధి జరుగదని వేడిరి. వాగ్దేవి ఈపనిని నెరవేర్చుటకు కొంచెము సంకోచించినది కాని రాముడరణ్యములకు వెళ్ళనిదే ఋషులు మునుల కోరికలు తీరవు. దుష్టశిక్షణ శిష్టరక్షణ జరుగదు, దేవతల కోరికలు సిద్ధించవు.

ఇట్లు తలపోయుచూ సరస్వతీదేవి దుస్సహ దుఃఖమును కలుగ జేయు గ్రామదేవతవలె అయోధ్యానగరములో ప్రవేశించినది. మందర యను గూని దాసి కైకమ్మదగ్గర వున్నది. అది మందబుద్ధి

గల కురూపి. అట్టి మంథర బుద్ధిని సరస్వతీదేవి తల్లక్రిందులుగా మార్చి వెడలిపోయినది.

నగరమందలి ఆనందోత్సాహములు చూచి మంథర ఈర్ష్య పడుట మొదలు పెట్టినది. మండిపోయినది. శ్రీరాముని అభిషేకం దించు మంగళ వాయిద్యములు విని ఆమెకు పచ్చెక్కిపోయినది. రామునకు రాజతిలకం పెట్టనీయరాదను దుర్బుద్ధి ఆమెకు పుట్టినది.

## మంథర దుర్బోధ

మంథరను చూచి కైకేయి ఏమట్లున్నావని యడిగినది. ఉదాసీనతకు కారణ మేమని మరీమరీ ప్రశ్నించినది. మంథర జవాబు చెప్పక నిట్టూరుస్తూ గట్టిగా ఏడ్చుట మొదలుపెట్టినది. రాణి నవ్వుతూ "మంథర నోరు మంచిదికాదు. బడబడ ఏదో వాగియుండ నోపు. లక్ష్మణుడు బాగా బుద్ధిచెప్పి వుంటాడు" అనుకొన్నది. మంథర కాల నాగమువలె బుసలుకొట్టుచూ దీర్ఘనిశ్వాసము విడుచుట ప్రారంభించినది.

ఆమె తీరునుచూసి కైకేయి భయపడి రాజుగారు క్షేమముగా నున్నారా యని ప్రశ్నించెను. నలుగురు పుత్రులును క్షేమమేనా అనికూడా అడిగినది ఇదివిన్న మంథర హృదయంలోని మంట మరింత భగ్గు మన్నది. "శ్రీరాముని క్షేమము తప్పించి ఇంకెవరి క్షేమము కావాలీవేళ" అందరూ అతనిని పొగిడేవారే! విధాత కౌసల్యకు అనుకూలుడై వున్నాడు. రేపు రాముడు యువరాజు కాబోవుచున్నాడు. నీ కొడుకు పరాయి వూళ్లోవున్నాడు. నీ కా ఆలోచనేలేదు. రాజుగారు నీవాడని నీకు ధీమా! అంతేగాని వారు పన్నే వ్యూహం నీకు తెలియదు. భోజనం చేయడం, నిద్రపోవడం మాత్రమే నీకు తెలుసును" అన్నది మంథర.

"ఇక అపు. పచ్చని సంసారంలో చిచ్చుపెట్టేట్లున్నావు. ఇంకెప్పుడైనా ఇట్లా వాగావంటే నీ నాలుక పీకించేస్తాను. చెవులు వినిపించవు, గూనిదానివి, కుంటిదానివి నీ గుండెల్లో కుటిలము, కప

టము తప్పితే మరొకటిలేదు" అంటూ రాణి కసురుకున్నది. ఇంకా ఇట్లా అన్నది: "శ్రీరామునకు మేమందరము తల్లులము. కౌసల్యతో సమానమైన వారము. అతడు పెద్దకుమారుడు. సహజముగా రామునకే గదా పట్టాభిషేకమవవలసినది అంతకన్న ఎన్నదగిన దేమున్నది. ఇది రఘుకులరీతి. రాముడు నాకు భరతునికంటెనూ ప్రియమైన వాడు. నీ కెందుకింత విషాదము, క్షోభ కలుగుచున్నవో నాకర్థము కావడములేదు" అన్నది కైక.

మంధర—"నా ఆశలన్నీ నీ ఒక్క మాటతోనే ఛేదించుకు పోయినవి. విధాత నన్ను కురూపినిచేసి నీదగ్గర పడవేశాడు. రాత్రింబవళ్లు నోరు నొక్కుకుని కూచుంటాను. ఎవరు రాజయితేమాత్రం నాకు వొరిగేదేమున్నది. నేనెలాగూ దాసీనేగదా! నాకేమన్నా మహారాణి పదవినిస్తారా? కానీ నీకన్యాయం జరగడం సహించలేక అట్లా బాధపడ్డాను క్షమించు" అన్నది.

దేవతల మాయకు మంధర వశమైనది. మంధర మాయకు కైకమ్మ లోబడ పడవలసి వున్నది! విధివిధాన మనుసరించి బుద్ధి పనిచేస్తుంది. బోయవాని పాటకు లోనయిన లేడిపిల్లవలె కైకకు మంధర పలుకులు రుచింప నారంభించినవి.

మంధర—"మహారాజుగారు భరతుని తాతగారింటికి పంపి శ్రీరామునకు రాజ్యాభిషేకము తలబెట్టిరి. ఇదంతా కౌసల్య ఆదేశము. నీ సవతి కౌసల్య నిన్ను కూకటివేళ్ళతో సహా పెకలించిపార వేయవలెనని చూచుచున్నది. రాజుగారికి నీవంటే అపరిమితమైన ప్రేమ. అది కౌసల్య సహించలేక భరతుడు లేని సమయము చూచి రామునికి పట్టాభిషేక ముహూర్తము పెట్టించినది. రాముడు యువరాజవడము అందరికీ యిష్టమే. కానీ నీ భవిష్యత్తు నీవాలోచించుకో!" ఇట్లు వేయి విధముల కైక మనస్సు చెడగొట్టినది.

## మంధర మతిఏరుపు మాటలు

మంధర ఇంకా..."పశుపక్షులకుకూడా వాటి క్షేమములు తెలుస్తవి. నీకు తెలియదు. రామునకు రాజ్యాభిషేకమయితే నీ

జీవితంలో ఆపదలకు నారు పోసినట్లే! నీకు బాధలు తప్పవు. నీవు నీ కొడుకూ కౌసల్యకు ఊడిగము చేయవలసివస్తుంది. కద్రువ వినతను దుఃఖపెట్టలేదా !"

ఈ పలుకులు మంథరనోట వినుచుండగనే కైకేయికి ముచ్చెమటలు పోసినవి వణికిపోయినది. కైక ఈస్థితికి దిగజారగానే మరొకవేయిమంది సవతుల కథలల్లి నూరిపోసినది మంథర.

మంథర పలుకులు పరమ సత్యములవలె గోచరించినవి కైకకు. తన కంఠమందు ప్రాణమున్నంతవరకు సవతికి బానిస కాకూడదని శపథం చేసుకున్నది. శత్రువుల వశమై బ్రతుకడంకంటే చావడమే మేలనుకున్నది. మంథరను మించిన శ్రేయోభిలాషి తన కింకెవరూ లేరని నమ్మినది కైక. మంథర తేనెలో ముంచి త్రాగించిన విషం కైకకు అప్పట్లో బోధపడలేదు.

మంథర కైకను వూరడించి ఈ ఊబినుంచి కైకను దాటించుటకు తానిదివరకే ఉపాయం ఒకటి వుంచానని చెప్పినది. భరతుడు రాజవవలసివున్నదని జోతిష్కులు చెప్పిరని, రేఖాగణితము కూడా చూపించాననీ చెప్పినది. కైకకు ఆదుర్దా మరీ ఎక్కువయినది. ఏమి చేయవలెనో వెంటనే ఉపాయం చెప్పమని వేడినది.

అప్పుడు మంథర రాజుగారు కైకమ్మకు ఎప్పుడో ఇస్తానన్న వరముల సంగతి గుర్తుచేసినది ఆ వరము లడిగి యిప్పుడు ఈ గుండె మంటను చల్లార్చుకోమని చెప్పినది. భరతునకు రాజ్యాభిషేకము, శ్రీరామునకు వనవాసము, ఈ రెండు కోరకలనూ కోరి సవతి పొందబోవు సుఖాన్నంతనూ ఈమెనే అనుభవించమని మరీమరీ చెప్పినది.

ఈ సలహా ఎంతో సముచితంగా, నూటికి నూరుపాళ్లు సబబుగా తోచినది కైకకు. శ్రీరామునిమీద వొట్టు వేయించుకుని రాజుగారు వరము లిస్తానని మాట యిచ్చిన తరువాతగాని ఈ విషయాలు బైట పెట్టవద్దనీ, రాజుగారు మాట తప్పిపోకుండా బిగించిగాని చెప్పవద్దనికూడా హెచ్చరించింది మంథర.

# కోపగృహంలో కైక

మంథర బుద్ధికుశలతకు రాణి పదేపదే ప్రశంసించుకున్నది. ఈ విశాల విశ్వంలో మంథరను మించిన శ్రేయోభిలాషి తన కింకెవ్వరున్నారనుకొన్నది. ఈవిధంగా మంథరను కొనియాడుతూ కైక కోపగృహంలోకి ప్రవేశించినది అన్ని అలంకరణలూ, నగలూ తీసి పారవేసి పాత ముతకచీర కట్టుకొన్నది. హృదయం ఈర్ష్యతో దగ్ధమవుతున్నది. చెడుపలుకులు విని ప్రపంచమున చెడిపోనివారెవరున్నారు ? నీచుల ననుసరించువారు నీచగతినే పొందుదురుగదా !

దశరథ మహారాజు ఆనందముతో పొంగిపోతూ కైకదగ్గిరకు వచ్చారు. కైకమ్మ కోపగృహంలో వున్నదని విని నిర్వీర్యులయినారు. భయముతో అడుగు ముందుకు పడలేదు ఇంద్రునికంటే శక్తిశాలి, బలోపేతుడైన దశరథమహారాజు నిలువునా నీరయి పాలిపోయినారు.

రాజు భయపడుచునే కైక వున్న కోపగృహంలోనికి అడుగు పెట్టెను. ఆమె స్థితిచూసి వారికి దుఃఖము వచ్చినది. కటిక నేలమీద పడుకొనివున్నది. ఆ వేషము ఆమెకు రాబోవు వైధవ్యమునే సూచించనట్లుండెను.

రాజు సానునయముగా ఆమెను పలుకరిస్తూ ఆమె చేయి తన చేతిలోనికి తీసుకొనెను. ఆమె ఒక్క విసురు విసిరినది. ప్రణయకలహమనుకొన్నారేగాని ఇది ప్రళయ కలహమని వారూహించలేదు. ఎన్నో విధముల ఆమె కోపకారణమేమని బ్రతిమాలినారు. చివరకు శ్రీరామునిమీద వొట్టు వేసుకొని ఆమె కోరిక లేమయినా వుంటే తీరుస్తానని మాట యిచ్చిరి. ఆ వాగ్దానము తీసుకొని అప్పుడు కైక లేచి కూర్చుని తన నగలన్నియూ అలంకరించుకొన్నది. ఆమె సహృదయత చూచి రాజు ముగ్ధులయిరి. అ మరునాడే శ్రీరామునకు పట్టాభిషేకమనీ, నగరజనులందరూ ఆనందోత్సాహములతో బాజాలు ప్రమోగించుచున్నారనీ సంతోషముతో వేడుకగా ఆమెతో చెప్పిరి.

ఈ పలుకులు వినగానే కైక మండిపడినది. తన కోపమును మనస్సులోనే అణచిపెట్టుకుని చిరునవ్వు నవ్వినది.

కైక-"మహారాజా! మీరెప్పుడూ వరమడుగుము అని అందురేగాని ఇచ్చినది ఒక్కటిలేదు. నాకు రెండు వరము లిస్తానని ఎప్పుడో మాట యిచ్చినారు. గుర్తున్నదా? అవిగూడా యిచ్చినట్లు కనబడలేదు" అన్నది.

రాజు-"ఇప్పుడర్థమయినది. నీ కభిమాన మెక్కువ. అడగలేవు. నేనూ యివ్వలేదు ఇప్పుడు కోరుకో! నీకేమి కావలెనో యిస్తాను. రఘుకులరీతి నీకు తెలుసునుగదా! ప్రాణము పోయిననూ ఆడిన మాట తప్పరు. అసత్యము లాడుట అన్నిటలో మహా చెడ్డపాపము" అనెను.

## కైకేయి వరభిక్ష

ఈ విధముగా పలికిన తరువాత ఇక ఆడినమాట తప్పరు అని నమ్మిన కైక నెమ్మదిగా తన కోరికలు బయటపెట్టినది. "నాకు కావలసిన మొదటి కోరిక భరతునకు రాజ్యాభిషేకము చేయుట. రెండవది తాపస వేషములో వల్కలములు ధరించి పద్నాలుగేళ్లు శ్రీరాముని అరణ్యములకు పంపుట" అని నిశ్చయముగా చెప్పినది కైక.

కైక నెమ్మదిగా మాట్లాడిననూ రాజుగారి హృదయము వంద ముక్కలైనది. నూరుపలుకలేక కళావిహీనులైరి. నెత్తిమీద పిడుగులు పడినట్లయినది. శ్రీరామునకు పట్టాభిషేకము చేయవలె నను తన చిరకాలవాంఛను యిట్లు త్రెంపివేసి కుటుంబమందు విపత్తు లకు బీజమునాటి అయోధ్యనే ధ్వంసం చేయునట్టి యీ కోరికను భరించలేకపోయిరి.

రాజుగారిట్లు విచారమగ్నులై వుండుటచూచి— "ఏమి, భరతుడు మీ పుత్రుడు కాడా? నేను మీ భార్యనుకానా? అట్లు బాణములు గ్రుచ్చుకున్నట్లు బాధపడిపోతున్నారే! ముందే ఆలో చించుకొని వరములు ప్రసాదించవలసినది. ఇప్పుడు మాట నిలబెట్టు కుందురా లేక అపకీర్తిపాలవుదురా? శిబిచక్రవర్తి, దధీచి, బలి

చక్రవర్తి ప్రాణములను పోగొట్టుకొనియయినా మాట నిలబెట్టు కొంటిరని మీ రెరుగుదురుగదా ?" అని కటువుగా పలికినది కైక.

మూర్తీభవించిన క్రోధ దేవతాకృతిలోనున్న కైకనుచూచి రాజు భయపడిపోయెను. "నాకు భరతుడు శ్రీరాముడు ఒక్కటే! భగవంతుని సాక్షిగా వారియెడల నాకే భేదమూలేదు. దూతలనుపంపి ఇప్పుడే భరతుని పిలిపించెదను. నీ కోరిక ప్రకారం భరతునకే పట్టాభి షేకం చేసెదను రామునకు రాజ్యకాంక్షలేదు. రాముని తల్లి ఒక్క సారికూడా ఈ ప్రస్తావన నాదగ్గరతేలేదు. నలుగురిలోనూ పెద్దవాడని నేనే రామునకు పట్టాభిషేకం తలబెట్టితిని. రాముని అరణ్యములకు పంపుమని నీ వెందుకు కోరితివో నా కర్థంకావడంలేదు. రాము డేమి అపరాధం చేశాడని నీవట్లు కోరితివి ? అతడు పొరపాటెన్నడునూ చేయడు ధర్మనిరతుడు, సాధుస్వభావుడు. నీ కోపమునూ, ఆవేశ మునూ వదలి ఆ రెండోవరమును వివేకముతో అడుగుము. నీటిలో నుండి తీసి పారవేసిన చేపయినా బ్రతుకునేమోగాని నేనుమాత్రం రామునివదలి బ్రతుకలేను. ఈ విషయమున నీవు మరొకసారి ఆలో చించుకో" మని దశరథ మహారాజు కైకను హెచ్చరించెను.

రాజునకు రాముని యందుగల ప్రీతికి ఆమెకు అగ్నిలో ఆజ్యము పోసినట్లయినది. "వెయ్యి మాటలెందుకు. వరములిస్తే ఇస్తానని చెప్పండి లేదా ఇవ్వనని చెప్పండి ఆడినమాట తప్పుటకు మాత్రం ప్రయత్నించవద్దు" అని ఖచ్చితంగా మరొకమాటు అన్నది కైక.

కైకేయి కటువచనములకూ, కుటిలబుద్ధికీ రాజు బాధపడి ఇది తన పూర్వజన్మమునకు దారితీయగల దుష్కృతమని తెలుసుకొనెను. సూర్యకుల వృక్షమును నరికిపారవేయవలదనీ, రామునివిడిచి బ్రతుక లేననీ, ఆ విరహములో తనను చంపవలదనీ మరొకమారు కోరు కొనెను. తన తల త్రుంచి యివ్వమని కోరినా సంతోషంగా యివ్వ గలనుగాని రామునిమాత్రం తననుంచి వేరుచేయవద్దని మరీమరీ కోరుకొనెను.

# దశరథ మహారాజు పరితాపము

"రామా! దశరథరామా! రాఘవా! శ్రీరామా" అనుచూ రెక్కలు విరిగిన పక్షివలె రాజు కొట్టుకొనిరి. ఈ చీకటి రాత్రికి ఉషస్సు రాకూడదు, సూర్యుడుదయించ కూడదని కోరుకొనిరి. ఇట్లు చింతించుచూ మూర్ఛితులయిరి.

తెల్లవారినా మహారాజులేచి రాకపోవుట చూచిన మంత్రులు వ్యాకులులైరి. అచటి నిశ్శబ్దమును చూచి భయపడిరి. నిద్రలేవుట సాంప్రదాయము కాకపోయిననూ అనూహ్యమైన కారణమేదో వుండి యుండవచ్చునని సుమంత్రుడు ధైర్యము తెచ్చుకొని లోనికివెళ్ళి చూచెను. నిలువెల్ల నిర్ఘాంతపోయెను. రాజుగారి ముఖమందు కళ లేదు. మూర్ఛితులై నేలమీద పడివుండిరి. శోభావిహీనురాలు కైక వారిప్రక్కన వున్నది.

సుమంత్రుడు ఎంత అడిగిననూ కారణము కైక చెప్పలేదు. వెంటనే శ్రీరాముని తీసుకొని రమ్మని మాత్రమే ఆమె ఆజ్ఞాపించినది. కైకేయి ఏదో కుట్రపన్ని యుండునని గ్రహించిన సుమంత్రుడు వెంటనే శ్రీరాముని తీసుకొని వచ్చెను. మహారాజు స్థితి చూచి ఎన్నడూ దుఃఖము నెరుగని రాముడు దుఃఖించెను. తల్లి కైకమ్మను కారణ మడిగెను.

అప్పుడు కైకేయి జరిగిన దంతయూ పూసగ్రుచ్చినట్లు రామునకు తెలిపినది. అంతేగాదు, మహారాజునకు శ్రీరాముడనిన ప్రాణమనీ, రామునివిడిచి బ్రతుకలేనని విలపించి మూర్ఛపోయిరనీ కూడా చెప్పినది. రాముని వనవాసమునకు వెళ్లుమని రాజు నోటితో చెప్పలేరనీ గనుక ఆతడే గ్రహించి వెళ్లుట మంచిదనీ ఆమె సలహా యిచ్చినది. అట్లాచరించినయెడల మహారాజు మనఃక్లేశము దూరమగు ననిచెప్పినది.

నిశ్చేష్టుడై శ్రీరాముడన్నియూ వినెను. ఆనందనిధానుడు, సూర్యకుల భూషణుడు శ్రీరాముడు సర్వాంతర్యామి. చిరునవ్వు

నవ్వుతూ ఆమె ఆదేశమును శిరసావహించి "తల్లిదండ్రుల మాటను జవదాటని పుత్రుడే సుపుత్రుడమ్మా! నా తమ్ముడు భరతుడు ఇక్కడ రాజ్యమేలును. నా వలన ఏదైనా అపరాధము జరిగినదా! నా తండ్రిగారు ఎందుకింత క్షోభపడిరి" అని కైకమ్మను మరల మరల అడిగెను.

రాముని మృదుభాషణములు కైకేయి కఠినహృదయమును ఏమాత్రమునూ కరిగించలేదు. ఆమె బుద్ధి వక్రముగానే యున్నది. "రామా! ఏ పూర్వపుణ్యఫలమువలనో నీవంటి పుత్రుని కనినారు. నీవు వారిని అపకీర్తిపాలు చేయకు. వారి దుఃఖమును పోగొట్టగల వాడవు నీ వొక్కడివే!" అన్నది కైక.

## కారుమబ్బులు - పన్నీటి జడివానలు

ఇంతలో మహారాజునకు తెలివి వచ్చినది. శ్రీరాముని దగ్గరకు తీసుకొని హృదయమునకు హత్తుకొనిరి. వారి నేత్రములనుండి కన్నీరు మున్నీరుగా వెల్లువలైనది. మాటాడలేకపోయిరి. తల్లి కైకేయివలన తా నన్నియూ తెలుసుకొంటిననీ, తండ్రిని చింతించవలదనీ, మౌనముగానున్ననూ వారి ఆవేశము తనకు తెలుసుననీ, శిరసావహించెదననీ రాముడు తండ్రిని వోదార్చెను. శోకవశుడైన మహారాజు ఏమియూ పలుకలేకపోయిరి. వారికి పాదాభివందన మాచరించి రాము డక్కడనుండి వెళ్ళిపోయెను.

ఒక్క నిముషములో ఈ పిడుగువంటి వార్త అయోధ్యానగర మంతయూ వ్యాపించిపోయినది. వినుటతోడనే దావానలమునను గురియయిన చెట్లు చేమలవలె వారందరి హృదయములునూ మాడి పోయినవి. కన్నులనుండి అశ్రుధారలు వెల్లుబికినవి. శోకము గుండెలలో దాగుటలేదు. ఆడినమాట తప్పని దశరథమహారాజును శిబి చక్రవర్తి, హరిశ్చంద్రులతో పోల్చుకొనిరి కైకమ్మను తిట్టిపోసిరి.

శ్రీరాముడు తల్లి కౌసల్యదగ్గరకు వెళ్ళెను. రఘుకుల భూషణుడు మాతమూర్తి కౌసల్యకు పాదాభివందనము చేసెను. ఆమె

ఆశీర్వదించినది. గుండెలు బరువుగావున్నను పుత్రవాత్సల్యముతో రాముని నుదుటిపై పదేపదే ముద్దుపెట్టుకొన్నది. ఆమె కన్నుల నుండి ప్రేమాశ్రువులు స్రవించినవి. రాముని వొడిలోకి తీసుకొనగానే తల్లి కౌసల్య స్తన్యములనుండి పాలు కారినవి. ఆ మాతృప్రేమ వర్ణింప తరముగాదు.

"రామా! నీవులేని అయోధ్య అనాథవంటిది. ఆ అరణ్యములే అదృష్టవంతములైనవి. రామా! మేము జీవించియుండగా నీవు మరల తిరిగి రాగలవా? అరణ్యములు భయంకరములైనవి. సీతకూడా నీతో ప్రయాణమగుచున్నది. జాగ్రత్తగా కంటికి రెప్పవలె ఆమెను కాపాడుము. వద్దని వారించిన వినుటలేదు. కనుక సుకుమారి సీతను నీవే చూసుకోవలెను.

ఇంతలో సీతాదేవి అత్తగారికి అభివందనములు చేసి శెలవు తీసుకొనుటకు వచ్చినది. సీతను అత్తగారు అఖండ సౌభాగ్యవతిగా ఆశీర్వదించినది. అందాల రాశి సీత ఈనాడు అధోముఖయై కూర్చున్నది. సీత దిగులు కనిపెట్టిన అత్తగారు, "కోతిబొమ్మను చూచి భయపడే సీత అమాయకురాలు, కనిపెట్టి జాగ్రత్తగా చూచుకో"మని కుమారునకు మరీమరీ బోధించినది.

లక్ష్మణస్వామి అన్న వదినెగారలతో అరణ్యములకు పయనమయ్యెను. సీతారామలక్ష్మణులు ప్రయాణమవగానే సుమంత్రుడు మహారాజును లేవదీసి కూర్చొనబెట్టెను. వారి ముగ్గురినీ చూచి మహారాజు మాటిమాటికీ పుత్రవాత్సల్యముతో కౌగలించుకొనిరి. శ్రీరఘుకులవీరుడు రాముడు తండ్రికి పాదాభివందనము చేసెను వనములకు పోవుట కనుజ్ఞ యీయమని వేడెను -"రామా! నీవు సకల చరాచరములకూ స్వామివి!" అని దశరథుడనెను. ఇంకేమియూ మాట్లాడలేక పోయెను

కైకేయి శ్రీరామలక్ష్మణులకు వల్కలములు, మునులు ధరించు దండ కమండలములు అందించినది-"రామా! నీ తండ్రి నిన్ను వెళ్ళమని ఆనతీయలేరు నీవే గ్రహించుకొని యథోచితముగా ప్రవర్తింపు"మని మరొకమారు గుర్తుచేసినది.

# అయోధ్యకు వీడ్కోలు

రాజుగారికి ఈ పలుకులు ములుకులవలె గ్రుచ్చుకొన్నవి. ఇట్టి మాటలు విన్నతరువాతకూడా తన ప్రాణములు కడగట్టిపోక యింకా ఏమాశించి మిగిలివున్నవి? అని విలపించిరి. రామలక్ష్మణులు, సీత తాపస వేషధారులై అరణ్యములకు బయలుదేరిరి. మరొకమారు తల్లి దండ్రులకు నమస్కరించిరి. రాజసౌధము దాటి ముందుకు ప్రయాణము సాగగనే అయోధ్య మొత్తమంతయూ రామునితో బయలు దేరినది. అయోధ్య అరణ్యములకు నడచుచున్నదా యనిపించెను. అందరునూ విషాదగ్రస్తులై రామునివెంట నడుపసాగిరి. రాముడు లేని అయోధ్య అరణ్యములకంటెనూ హీనము. రాము డెక్కడ వుండునో అచ్చటనే అయోధ్య వుండును. రామునియెడల నిజమైన భక్తి గలవారికి విషయవాంఛ లెన్నడూ బాధించవు. అందుచేతనే వారందరునూ వున్నపాళమున రాముని వెంటపడి పోసాగిరి.

మహారాజునకు స్పృహరాగానే సుమంత్రుని పిలచి రాముడు వెళ్ళినా ఇంకా ఈ ప్రాణములు మిగిలివున్నవి! నన్ను వీడుటలేదు. ఏమి సుఖపడవలెనని కోరుకొనుచున్నవి" యనుచు విలపించిరి. ఇంతకు మించిన దుఃఖ మీ జగత్తున ఇంకేమి యుండగలదు? రామలక్ష్మణులు తిరిగి రమ్మనిననూ రారు. సీతాదేవి అతి సుకుమారి. ఒక రథము తీసుకొని వారినందరి నందులో ఎక్కించుకొని అరణ్యములలో విడిచి రమ్మని ఆజ్ఞాపించిరి.

సీతారామలక్ష్మణులు ముగ్గురూ రథముమీద కూర్చొనిరి. అయోధ్యకు నమస్కరించి అందరునూ ముందుకు సాగిరి.

# గుహుడు - భక్తి తత్పరత

శ్రీరాముడు భగవంతుడు. సచ్చిదానంద స్వరూపుడు. సూర్య కుల ధ్వజుడు. పరబ్రహ్మము. పరమార్థ స్వరూపుడు, అవిగతుడు, అనంతుడు, అగోచరుడు, అనాది భేదరహితుడు, కృపానిధానుడు, భక్తుల కొరకు, దేవతల కొరకు, భూదేవి కొరకు సామాన్య మానవునివలె చరిత్ర నడుపుచుండెను. లౌకికములైన నరలీలలు చేయుచుండెను.

సీతారామ లక్ష్మణులు అయోధ్య వదలిననాటి రాత్రికి తమసా నదీతీరము చేరిరి. వారివెంట మొత్తము అయోధ్యయంతయూ కదలివచ్చినది ఎట్లయిననూ వారిని విడిచి కర్తవ్యోన్ముఖులై ముందుకు పోవలెనుగదా! శ్రీరాముడు అర్ధరాత్రివేళకు తాము ఎట్లు పోయినదీ తెలియనంతటి నిద్రలోనున్న ఆ ప్రజలను వదలి మెల్లగా రథను ముందుకు పోనీయమని అతి నిశ్శబ్దముగా కదలి వెళ్ళిపోయిరి.

శృంగవీర పురము చేరుకొనిరి. అచట గంగను చూచి శ్రీరాములు రథము దిగెను. సీతారామ లక్ష్మణులు ఆ గ్రామము వచ్చినారను వార్త తెలియగనే నిషిధరాజు గుహుడు తన పరివార సమేతముగా శ్రీరాముని దర్శించుకొనుటకు వచ్చెను. రాముని దర్శన భాగ్యముతో వారందరునూ కృతార్థులైనట్లు భావించుకొనిరి.

శ్రీరాముడు గంగాతీరమున సంధ్యావందనము చేసుకొనెను. గుహుడు సీతా రాములకు ఆకులు దర్భలతో చక్కని పానుపు అమర్చెను. తియ్యని పండ్లు, తేనె ఆరాత్రికి వారికి ఆహారము గావించెను. శ్రీరాముడు శయనించిన తరువాత లక్ష్మణస్వామి ఘాణమ్ము

ఎక్కు బెట్టి తెల్లవారులు వారికి కాపలా కాసెను. వానితోపాటు గుహుడునూ మేల్కొని జిజ్ఞాసాయుత్నమైన సంభాషణలు చేసెను.

ప్రభువు శ్రీరాముడు సార్వభౌముడు. కటిక నేలమీద పడుకొని వుండుట చూచి గుహునకు కన్నులలో నీరు నిండినది. పాల నురుగువంటి సున్నితమైన హంస తూలికలమీద శయనించవలసిన శ్రీరాముడు ఈ రీతిగా కటికనేలపై దర్భశయనుడగుట ఏమనుకొనవలెను ? విధాత వ్యతిరేకించని దెవరికి ? యని గుహుడు చిన్నపిల్లవానివలె ఏడ్చెను.

గుహుడు చింతాక్రాంతుడగుట చూచిన లక్ష్మణుడు— "సంయోగ వియోగములు, మంచి-చెడులు, సంతోష-విషాదములు అన్నియూ వట్టిభ్రమలు. సంపత్తి-విపత్తి కాలము, అన్నియు అజ్ఞాన జనితములు. స్వర్గము-నరకము, చూచుట-వినుట, ఆనందించుట వీటన్నిటికీ మూలము మోహము, పరమార్థతత్వప్రకారము అవన్నియు నిజముకావు. ఈ దృశ్యమాన ప్రపంచమును జ్ఞాననేత్రములతో చూడవలెను. కోపము, ద్వేషము, దుఃఖము పనికిరావు" అని జ్ఞానవైరాగ్య యుతమైన బోధచేసెను.

తెల్లవారిన తరువాత పాలు తెప్పించుకొని ఆ పాలతో శ్రీరామ లక్ష్మణులు జుట్టును జటలుగా చేసుకొనిరి. ఇది చూచిన సుమంత్రుడు ఉదాసీనుడయ్యెను. దుఃఖమాగలేదు. దశరథమహారాజు వారిని తిరిగి తీసుకొనిరమ్మని తనను పంపిరనీ, పితృవాక్య పరిపాలకులైన రామ లక్ష్మణులు అరణ్యవాసమునే ఎన్నుకొనిననూ సీతాదేవినయిననూ తనతో తీసుకొనివెళ్లుటకు అనుజ్ఞనిమ్మని సుమంత్రుడు రాములవారికి నివేదించెను.

ఆ పలుకులువిన్న సీతాదేవి, శరీరమువిడిచి నీడ వుండనట్లు సూర్యుని విడిచి ప్రకాశము వుండనట్లు, చంద్రుని విడిచి చంద్రిక లుండనట్లు తాను భర్తనువిడిచి వుండజాలనని చెప్పినది.

విధివిధానము లతికఠినములైనవి, జరుగవలసినదాని నెవ్వరూ తప్పించుకొనలేరు !

సమస్త మూలధనమునూ పోగొట్టుకొన్నవానివలె సుమంత్రుడు రథము సిద్ధముచేసుకొని వెనుకకు ప్రయాణమయ్యెను. రథమునకు కట్టిన గుర్రములు శ్రీరాముని విడువలేక వెనుకకు చూచుచూ అడుగు ముందుకు వేయలేక పోవుచుండెను. పశువులస్థితే ఇట్లున్న ఇక మనుషుల గతి నేమని వర్ణించవలెను ? శ్రీరాముడు బలవంతముగా సుమంత్రుని వెనుకకు పంపెను.

## పదములే చాలును రామా

శ్రీరాముడు గంగను దాటవలెను. నావకొరకు గుహుని యడిగెను. శ్రీరాముని చరణధూళి సోకగానే శిల స్త్రీగా మారినది. తన పడవ వట్టి కొయ్యగా ఏమగునో అనుచూ శ్రీరాముని మహిమను గుహుడు కొనియాడెను. ప్రభువు పాదములు కడుగవలెనను తన యభిలాషను వెల్లడించెను. తనకు యింకేకోరికా లేదని విన్నవించెను.

పల్లెవాని ప్రేమను, తత్తరపాటును ప్రభువగు కరుణామయుడు గ్రహించెను.

ఎవరి పేరును ఒక్కసారి స్మరించినంతనే మానవుడు ఈ సంసారమను అపార పారావారమును దాటునో అట్టి కృపాళువు చిన్న నదిని గుహుని సహాయముతో దాటెను! శ్రీరాముని పద నఖము స్పృశించిన గంగాదేవి హర్షించినది పదములే చాలును రామా! అనుకొని ధన్యురాలయినది.

శ్రీరాముని పదములు కడుగుటకు గుహుడు దొన్నెలతో నీళ్లు తెచ్చి అమిత అనందముతో కడిగెను. ఆ పల్లెవాని పోలిన పుణ్యాత్ము లెవరున్నారు ?

శ్రీరాముని చరణములు కడిగిన నీటిని కుటుంబసమేతుడై గుహుడు త్రాగెను. తన పితరుల నందరినీ తరింపచేసెను. నావ దిగి నంతనే శ్రీరాముడు గుహునికేదైనా బహుమాన మీయవలెనని తలచెను. అపుడు సీతాదేవి తన వ్రేలినున్న రత్నజటిత వుంగరము తీసియిచ్చెను.

గుహుడు వ్యాకులచిత్తుడయి-"శ్రీరామా! రామచంద్ర ప్రభో! ఈరోజు నేను పొందని దేమున్నది? ధన్యుడ నయితిని" అనుచూ స్తుతించెను.

అతని నిర్మల భక్తికి కరుణాంతరంగుడు కరిగిపోయెను. గుహుడుకూడ సీతారామ లక్ష్మణులతో అరణ్యములకు ప్రయాణ మయ్యెను వద్దని వారించిననూ వినలేదు. వారికి అరణ్యములలో పర్ణకుటీరమైనను వేసి ఏర్పాటు చేయవలెనను కోరికను శ్రీరాముడు కాదనలేకపోయెను.

సీతారామ లక్ష్మణులు గంగకు విఘ్నేశ్వరునికి శివునకు నమస్కరించి ముందుకు సాగిరి. సీతాదేవి తమప్రయాణము సుఖముగా గడిచి తిరిగి దేవవాహినిని దర్శించు భాగ్యము కలుగజేయుమని వేడినది. వీరందరునూ తీర్థరాజమైన ప్రయాగకు ప్రయాణమైరి.

# మునుల దీవెనలు

సీతా రామ లక్ష్మణులు తీర్థరాజము ప్రయాగ చేరిరి. వారి వెంట గుహుడు కూడా వెళ్ళాడు. త్రివేణిలో స్నానముచేసి భరద్వాజాశ్రమమునకు వెళ్ళిరి. భరద్వాజ మహర్షికి దండప్రణామము చేయగనే వారు శ్రీరాముని తన హృదయమునకు హత్తుకొనిరి. అంతులేని ఆనందమును పొందిరి. అమృత తుల్యమైన పండ్లు ఫలములు వారి కందించిరి. అవి సేవించిన సీతారామ లక్ష్మణులు ప్రయాణ బడలిక తీరి హాయి నొందిరి.

శ్రీరాముని దర్శన భాగ్యమువలన తమ తపస్సు ఫలించినట్లు చిరకాల వాంఛ నెరవేరినట్లు, ఋషీశ్వరులు శ్రీరాముని కీర్తించిరి. భగవంతుడు శ్రీరాముడు లీలామానుష రూపుడు, వారు భరద్వాజాశ్రమములో విడిది చేసిరను వార్త చుట్టుప్రక్కలనున్న తాపసులు, యోగులు మునులు సిద్ధులు అందరికీ తెలిసి వారు రాముని దర్శనము కోరి వచ్చిరి. శ్రీరాముని అలౌకిక సౌందర్యముచూసి ముగ్ధులయిరి.

ఆ మరునాడు వీరు నలుగురు ఋషీశ్వరునివద్ద శెలవుతీసుకొని బయలుదేరిరి. త్రోవలో సూర్య తనయ యమునానదిలో స్నానము చేసిరి. యమునానది శ్రీరామునివలెనే నీలముగా నున్నది. అనేక మంది యాత్రికులు వీరి ప్రయాణములో ఎదురైరి. శ్రీరామ లక్ష్మణులను చూచి రాజ చిహ్నములుగల ఈ బాలు రెవరా యనుకొనిరి. ఇంత సుకుమారు లీ యడవులలో సంచరించుటకుగల కారణ మేమయి యుండునో వారికి బోధపడలేదు. అరణ్యములు దుర్గమమైనవి. వీరివెంట స్త్రీ కూడ యున్నదని వారెంతో బాధపడిరి. సింహములు పులులు వంటి క్రూర మృగములు గలవని వారందరూ

వీరికి తోడుగా వీరివెంట నడువసాగిరి. కాని కృపాసముద్రుడు వినయపూర్వకముగా వారిని సమాధానపరచి వెనుకకు పంపివేసెను.

ఎచట శ్రీరాముడు బసచేయునో అచట ఇంద్రపురము కంటెనూ ఎక్కువ ఐశ్వర్యములు కలుగజొచ్చెను. వీరిని కనులారా చూచు ప్రజలు పుణ్యాత్ములని దేవతలు కొనియాడిరి. ఏఏ నదులలో శ్రీరాముడు స్నానమాడునో వాటిని తలచుకొని దేవనదులు సరస్సులు ఈర్ష్య చెందుచుండెను. ఏఏ వృక్ష చ్ఛాయలలో శ్రీరాముడు విశ్రమించునో వాటిని కల్పవృక్షముకంటెనూ అదృష్టవంతము లైనవని యనుకొనుచుండిరి. ఆకాశమెప్పుడు మేఘావృతమై శ్రీరామునకు ఎండ తగులకుండానుండెను. భూదేవి పువ్వులు పరచినట్లు మృదువుగా దారి యిచ్చుచుండెను. రాముడు నడచు త్రోవలో దేవతలు పుష్పములు జల్లుచుండిరి. మార్గమధ్యములో వీరికి ఎదురగు జనులు శ్రీరామునకు సకలోపచారములు చేయుచుండిరి. శరత్పూర్ణిమవంటి శ్రీరాముని ముఖబింబముపై గల స్వేదబిందువులుచూచి ప్రజలు దుఃఖించుచుండిరి. వారిని జనులు మనసారా కనులారా చూచుచుండిరి.

## వాల్మీకాశ్రమము

నదులు, వనములు, పర్వతములు దాటుచూ వారు వాల్మీకి ఆశ్రమము చేరిరి. ఆ ఆశ్రమము ఎంతో రమణీయముగా నున్నది. పర్వతములు నదులు రంగురంగు పువ్వులు ఆ దృశ్యము కన్నుల పండువుగానున్నది. శ్రీరఘుకులభూషణుడు, సాకేత సార్వభౌముడు తమ ఆశ్రమమునకు విచ్చేయుట ఎరిగి వాల్మీకి ఎదురేగి శ్రీరాముని తోడ్కొనివచ్చెను. రాముడు వాల్మీకికి దండప్రణామములు చేసెను. విప్రశ్రేష్ఠుడైన మహర్షి శ్రీరాముని ఆశీర్వదించి ఆతని అనుపమ శోభను, దివ్యమంగళమూర్తినిగాంచి ఆనందమునొందెను. ప్రాణప్రియులైన అతిథులకు మహర్షి కందమూలములు ఆహారమొసగెను.

శ్రీరాముడు తన వనవాస కారణములు మహర్షి కెరిగించెను. తాము అడవులలో నివసించుటకు తగినస్థానము చూపుమని అడిగెను.

అపుడు వాల్మీకి — "శ్రీరామా! మీరు జగదీశ్వరులు, జానకీదేవి మీ స్వరూప భూతియయిన మాయ. మీ సంకేత మాత్రముచేతనే జగత్తుయొక్క సృష్టి, స్థితి లయములు జరుగుచుండును. వేయితలల ఆదిశేషువు భూమిని మోయుచుండును. ఆతడే యీ లక్ష్మణస్వామి. రామా! మీ స్వరూపము వాణి కగోచరము, బుద్ధికి అతీతము, అవ్యక్తము, అకథనీయము, అపారము. శ్రీరామా! ఈ జగత్తు దృశ్యమానమైనది. మీరు దీనిని చూచుచుందురు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులే మీ మహిమ నెరుగజాలనపుడు ఇంకెవరికి తరము? మీ అనుగ్రహమున్నవారే మిమ్మెరుగగలరు. 

"శ్రీ రఘునందనా! మీ శరీరము చిదానందము, కర్మబంధనాయుతమైనది కాదు. వికార రహితము. ఈ రహస్యము జ్ఞానులకు మాత్రమే తెలియును. సత్పురుషులను, దేవతలను రక్షించుటకు మాత్రమే తమరీ దేహధారణ చేసియుంటిరి. దివ్యమంగళ మూర్తులైన మీవంటివారు నన్ను నివాసస్థాన మడుగుట ఎంత ఆశ్చర్యముగా నున్నది? రామా! మీరులేని చోటెక్కడనూ లేదుగద! ఈ తావు మీకు నివాస యోగ్యమని ఎట్లు చెప్పగలను.'

## వనవాసము - రామనివాసము

జ్ఞాని మహర్షి వాల్మీకి పలికిన ప్రేమరస భరితములైన ఈ వాక్కులు విని శ్రీరాముడు చిరునవ్వు నవ్వెను. వాల్మీకికినీ చిరుదరహాసము కలిగెను. వాల్మీకి—'శ్రీరామా! వినుము మీరుండుటకు చక్కని నివాసస్థానము చూపించెదను. సీతా లక్ష్మణ సమేతుడవై మీరచట వుండవచ్చును!

"శ్రీరామా! మీదివ్య చరితము విని ఎవరానందించుదురో, ఆ హృదయము అపార సముద్రము కంటెనూ లోతైనది. అట్టి హృదయము మీ నివాసమునకు యోగ్యమైనది.

"రాఘవా! మీ యశస్సనే నిర్మల సరస్సులో ఎవరు హంసలవలె విహరించుచూ మీ సుగుణములను ముత్యములను ఏరుకొందురో అట్టి హృదయము మీ నివాసమునకు యోగ్యమైనది.

"రఘునందనా! మీకు నివేదనచేసి ఆ ప్రసాదము నెవరు భుజించుదురో, సమస్తము మీకర్పించి వినమ్రులై యుందురో, అట్టి వారి మనో మందిరములో సీతా లక్ష్మణ సమేతులై మీ నివాస మేర్పరచుకొన వచ్చును.

"కోదండ రామా! ఎవరికి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లుండవో, రాగద్వేషముల కతీతులో అట్టి హృదయ ములో మీరు నివాస మేర్పరచుకొనుడు.

"సాకేతవాసా! ఎవరికి నిందాస్తుతులు సమానములో, ఎల్ల ప్పుడూ సత్యమే పలికెదరో, సర్వమూ నీవేయని నమ్ముదురో అట్టి హృదయములో మీరు గుడార మేర్పరచుకొని వుండుడు.

"రామా! ఎవరి హృదయము స్వాభావికమైన ప్రేమతోనిండి యుండునో అట్టి హృదయమే మీ గృహము." ఋషిశ్రేష్ఠుడైన వాల్మీకి ప్రేమపూర్వక వచనములు శ్రీరామున కెంతో నచ్చినవి. రామునకు అడవులలో నుండుటకు సుఖదాయకమైన ప్రదేశము చిత్రకూటమని, అచట అన్ని సౌకర్యములు గలవనీ, పవిత్రమైన మందాకినీ నది ప్రవహించు చుండుననీ అచట పర్ణకుటీర మేర్ప రచుకొని యుండుమనీ రామునకు వాల్మీకి చెప్పెను.

## చిత్రకూటములో చిన్మయ మూర్తులు

సీతారామలక్ష్మణులు చిత్రకూటమువైపు ప్రయాణము సాగిం చిరి. అచట నదీతీరమందు చక్కని స్నానఘట్టములున్నవి. నదికి ఉత్తరదిశన బాగున్నదని లక్ష్మణుడు నిర్ణయించెను. అది విని దేవత లందరూ భిల్లులు, కోయవారి రూపములలో వచ్చి ఆకులలములతో దివ్యమైన పర్ణకుటీరము సృష్టించిరి. అందులో సీతారామలక్ష్మణులు సుఖముగా నుండిరి.

దేవతలు, నాగులు, కిన్నెరలు, దిక్పాలకులు చిత్రకూటము వద్దకు వచ్చి శ్రీరాముని దర్శించుకొనిరి. రాముడు చిత్రకూటము

మీద నున్నాడని ఎరిగి ఎందరో ఋషులు, మునులు అచటకు వచ్చిరి. సీతారాములను కనులారా దర్శించుకొనిరి.

సతీసమేతుడై శ్రీరాముడు చిత్రకూట పర్వతముమీద నివసించుట మొదలుపెట్టిననాటినుండి ఆ ప్రదేశము మంగళప్రదమైనదిగా మారెను. గంగ, యమున, సింధు, కావేరి, కృష్ణ, గోదావరి వంటి జీవనదులు మందాకినీ నదియొక్క అదృష్టమును కొనియాడుచుండెను. ఉదయాచలము, హస్తాచలము, కైలాసము, మందరాచలము, మేరుపర్వతము, హిమవత్పర్వతము మొదలైన దేవతానివాస పర్వతములన్నియూ చిత్రకూటము నెంతో పొగడుచుండెను. ఆ చిన్న పర్వతముమీదగల జీవరాసులన్నియూ ధన్యమైనవని దేవతలు కొనియాడుచుండిరి.

సీతారాముల పాదములయందు దృష్టి నిలిపి లక్ష్మణస్వామి అయోధ్యను మరచిపోయెను. భర్త సన్నిధిలో లోకమాత సీత స్వజనుల నందరినీ మరచి సుఖించుచున్నది. అరణ్యమే ఆమెకు వేయి అయోధ్యలకన్న ఎక్కువగా నున్నది. రాముని పేరు స్మరించినంత మాత్రముననే జనులు సర్వసుఖములు పొందుదురు. దేవతల హితము కోరి అరణ్యావాసము చేయుచున్న రామునకు చిత్రకూట మెంతో రమణీయముగా నున్నది. పర్ణకుటీరమే ఇంద్రుని భవనముకంటె మిన్నగా నున్నది.

# మహారాజు మరణము

సుమంత్రుడు సీతా రామ లక్ష్మణులవద్ద సెలవు తీసుకొని వెళ్ళలేక వెళ్ళలేక ఎట్లో అయోధ్యకు ప్రయాణమయ్యెను. వెళ్ళి దశరథమహారాజు నెట్లు చూడగలనా యని అతని బాధ. అతని రథమునకు కట్టిన గుఱ్ఱములుకూడ తిరిగి వెళ్ళలేక పడిపోయినవి. అట్టి పరిస్థితిలో గుహుడు రామ లక్ష్మణులు చిత్రకూటమందున్న పర్ణకుటీరమున ప్రవేశించిన తరువాత వెనుకకు తిరిగి వచ్చెను. ఆ వచ్చుత్రోవలో సుమంత్రుడు స్పృహలేక పడియుండుట చూచి వానిని వోదార్చి తన ప్రజలను కొందరిని తోడిచ్చి అయోధ్యకు పంపించెను.

సుమంత్రుడు రాజుగారిని చూచుటకువెళ్ళి తా నొక్కడను తిరిగి వచ్చితినని చెప్పలేకపోయెను. అపుడు దశరథమహారాజే సీతా రామ లక్ష్మణుల క్షేమము అడిగెను. వ్యాకులచిత్తుడైన మహారాజు నకు ఆ రాత్రి గడచుట కష్టమయినది. వారికి శ్రవణకుమారుని తండ్రి శాపము గుర్తువచ్చినది. "రామా! రాఘవా! శ్రీరామా! రఘునందనా!" అనుచూ ప్రాణములు వదలిరి.

రాణులు, దాస దాసీజనులు, అయోధ్యానగర జనులెల్లరూ విలపించిరి. కైకేయిని నిందించిరి. వశిష్టమహర్షి రాణులను వోదా ర్చెను. భరత శత్రుఘ్నుల కొరకు వెంటనే కబురు పంపెను.

అయోధ్యలో అనర్థములు వాటిల్లినప్పటినుండి భరతునకు అపశకునములు కనుపించసాగినవి. వాయువేగముతో భరత శత్రు ఘ్నులు అయోధ్యకు తిరిగివచ్చిరి. కైకేయి భరతునకు ఎదురేగి లోపలకు తీసుకొనివచ్చినది. రాజసౌధములోని వారందరూ విచార

మగ్నులయి వుండుటచూచి భరతు డనుమానపడెను. తల్లి మాత్రము సంతోషముగా నున్నది. తండ్రిని గురిచి, సీతా రామ లక్ష్మణుల గురించి భరతుడు తల్లి నడిగెను.

భరతుని పలుకులు విని తల్లి మొసలి కన్నీరు కార్చినది. "నాయనా! అన్ని పనులు సక్రమముగా నెరవేర్చితిని. మంధ రెంతో సహాయము చేసినది. విధాత మధ్యలో విఘ్నములు తలబెట్టెను. మీ నాన్నగారు దేవలోకము చేరిరి". ఇది వినగానే భరతుడు నిశ్చేష్టు డయ్యెను. తండ్రి పోవునపుడు తాను దగ్గర లేకపోయినందుకు అతనికి అపరిమితమైన దుఃఖము వచ్చెను. ఇంత అకస్మాత్తు మరణ మునకు కారణమేమిటని తల్లి నడిగెను.

కైకేయి మొదటినుండి తాను పన్నిన పన్నాగమును పూస గ్రుచ్చినట్లు కుమారునకు వివరించెను. శ్రీరాముడు అడవులకు వెళ్ళెననువార్త వినగానే భరతుడు ఖిన్నుడయ్యెను. కృంగిపోయెను. తండ్రి చనిపోయిరను వార్తకూడా కొంచెంసేపు మరచి నిస్సృహతో స్తంభించిపోయెను. తనయుడు వ్యాకులచిత్తుడగుట గ్రహించిన కైక వోదార్చుటకు ప్రయత్నించినది. ఆమె వోదార్పుమాటలు వినిన భరతుని హృదయము క్షోభిల్లెను.

సూర్యవంశ నాశనమునకు తన తల్లి కారకురాలని గ్రహించిన భరతుని దుఃఖము వర్ణింప తరముకాదు. తనమూలముననే తల్లి ఇంత పాపిష్ఠితనమునకు వొడగట్టినదని తెలిసి తన జన్మ వ్యర్థమైనదని భరతుడు వాపోయెను. శత్రుఘ్నుడు కైక పలుకులు విని వుడికి పోయెను. గూని మంధరను క్రోధంతో తన్ని పడగొట్టెను. అది అరుస్తూ నేలమీద పడినది.

ఇద్దరన్నదమ్ములునూ కౌసల్యాదేవిదగ్గరకు వెళ్లిరి. విచార గ్రస్తురాలయిన కౌసల్య భరతుని చూడగనే దుఃఖము తట్టుకొనలేక పోయినది. మూర్ఛితురాలయినది. భరతుడు ఏడుస్తూ ఆమె పాద ములమీద పడెను. కైక యీ జగత్తులో ఎందుకు పుట్టినట్లు? తన నెందుకు కనెను? అని భరతుడు విలపించెను.

ఆ తరువాత వేదములలో చెప్పిన ప్రకారము మహారాజు మృత దేహమునకు అంత్యక్రియలు జరిపిరి. వశిష్టమహర్షి భరతుని దగ్గర కూర్చొనబెట్టుకొని దశరథమహారాజువంటి వ్యక్తి మరొక రుండ బోరని వారికీర్తి దశదిశలా వ్యాపించినదనీ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను కన్న మహారాజుగారి అదృష్టము చెప్పనలవి కానిదనీ అట్టివారి మరణమునకు విచారించరాదనీ చెప్పి వోదార్చెను.

వశిష్ట మహర్షి-"భరతా! నీవు రాజ్యముచేసి నీ ప్రజలను సుఖముగా పాలించుకొనుము. రాము డడవులనుండి తిరిగి వచ్చిన తరువాత వాని రాజ్యము వానికి యిచ్చివేయుదువుగాని!" అనెను.

రాము డరణ్యములలో నుండి తాను రాజ్యమేలుకొనవలసి వచ్చుట భరతున కేమాత్రము నచ్చలేదు. ఇష్టములేదు. వారి నరణ్యముల పాలుచేసిన అభాగ్యుడను తానని తనమీద తనకే అసహ్యము కలిగెను. శ్రీరాముని చూడనిదే తనకు శాంతి లేదని వశిష్టమహర్షితో భరతుడు చెప్పెను. ఇన్ని అనర్థములకు కారణభూతుడైన తనను అన్నగారు క్షమించునా యను శంక కలిగినది. ఎంతైననూ అన్నగారిని, వదినెగారిని బ్రతిమాలి తిరిగి అయోధ్యకు తీసుకొని రావలెనను కోరిక భరతునకు కలిగినది.

## అడవికి నడచిన అయోధ్య

భరతుని వచనములు మహర్షికి, ప్రజలకూ నచ్చినవి. ఆతని భ్రాతృప్రేమనూ, శీలమునూ అందరూ మెచ్చుకొనిరి. భరతునితో పాటు తల్లులు, స్వజనులు, పురజనులు అందరునూ అడవికి నడచిరి. వశిష్టమహర్షి, వారి ధర్మపత్ని అరుంధతి రథముపై కూర్చొనిరి. అందరునూ కలసి చిత్రకూటమువైపు తరలిరి. భరతునకు రాముని యందుగల ప్రేమను తలచుకొని పజలు పులకించిరి.

ఆ రాత్రి తమసానదితీరమున విడిది చేసిరి. నిషదరాజు గుహునకు ఈ సమాచారము తెలియగనే వ్యగ్రుడై భరతుని రాకకు గల కారణము ఏమయి యుండునా యని శంకించసాగెను. శ్రీరామ

లక్ష్మణులను హతమార్చి నిష్కంటకముగా రాజ్యమేలుకొనవలెనను దుర్బుద్ధి పుట్టెనేమోయని వాని భయము. ఆ తరువాత భరతుని సదుద్దేశమునూ, ఆతనికి అన్నగారిపై గల అపరిమితమైన భ్రాతృ ప్రేమనూ తెలుసుకొని ముగ్ధుడయ్యెను.

భరతుని పరివారమునూ, పురజనులనూ క్షేమముగా గంగా నదిని దాటించి గుహుడు తానుగూడ వారితో చిత్రకూటమువైపు దారితీసెను. వానివెంట అయోధ్య నడచినదా అనిపించెను. అట్లు కదలిన అయోధ్య దృశ్యము అవర్ణనీయము.

శ్రీరాముడంతటి మహనీయుడు పామరునివలె అడవులవెంట నడిచి వెళ్ళినప్పుడు తమ కెందులకు వాహనములని అందరునూ 'సీతా రామ' 'సీతా రామ' అనుచూ నడచుట మొదలుపెట్టిరి. మూడు ఝాములవేళకు ప్రయాగ చేరిరి. అచట త్రివేణి సంగమము దర్శించి భరద్వాజాశ్రమమునకు వెళ్ళిరి. భరద్వాజ మహర్షి త్రికాలజ్ఞుడు. వారికి భరతుని సదుద్దేశము తెలియును. వారు భరతు నాశీర్వదించిరి.

భరతుడు అపరాధివలె శిరస్సువంచి మౌనముగా నుండెను. వాని మనోగత భావములు గ్రహించి భరద్వాజ మహాముని "విధిలిఖితము. ఇందు నీ దోషమేమియు లేదు, నీతల్లి బుద్ధి దేవతలే అట్లు వక్రించిరి" అని చెప్పెను.—"అజ్ఞానులు ఏమయినా నిన్నందురేమో గాని జ్ఞానులు నిన్ను నిందించరు" అని పలికెను.

కొంతసేపచట నున్న పిదప భరతుడు మహర్షి అతిథి మర్యాదలకు వారి అనుగ్రహమునకు ధన్యవాదము లర్పించి చిత్రకూటము వైపు దారితీసెను. గుహునకు సీతారామ లక్ష్మణులు వెళ్ళిన త్రోవ లన్నియు తెలియును. గుహుడు ముందు నడచుచుండగా వారివెనుక అయోధ్య నడచినది.

భరతుడు అనితర రామ భక్తుడు, భక్త శిరోమణి. శ్రీరాముని చూచుటకు భరతుడు బయలుదేరుట తెలుసుకొని ఇంద్రాది దేవతలు భయపడిరి. శ్రీరాముడు ప్రేమవశుడు. భరతుడు ప్రేమసముద్రుడు. వారిరువురి కలయిక వలన దేవతా కార్యమునకు విఘ్నము వాటిల్లునేమోయని, రాక్షస సంహారమాగి పోవునేమోయని, భయము. ఈ దృశ్యమాన జగత్తు శ్రీరాముని జపించును. శ్రీరాముడు భరతుని ప్రేమవశుడై పోవునేమో! శ్రీరామునకు రాగద్వేషములు లేవు. కర్మకు మాత్రము ప్రాధాన్య మిచ్చును. రాముడు గుణ రహితుడు, మాయా రహితుడు, పరబ్రహ్మ. భక్తులయందు ప్రేమవశుడై యుండును.

ఆ రాత్రి భరతుడు యమునాతీరమున విడిదిచేసి మరునాడుదయమున రామనామము స్మరించుచూ శ్రీరాముని ఎప్పుడెప్పుడు చూచుదునా యని ఆతురతతో ప్రయాణము చేసెను. గుహుడు కొమదగిరి పర్వతము వారికి చూపించెను. అచట మందాకినీ నది యొడ్డునయున్న సీతారాముల పర్ణకుటీరము చూపించెను ఆదృశ్యము దూరముననుండే చూచి జనులానంద ప్రేమ మగ్నులయిరి.

భరతుడు ఆతనివెంట అయోధ్యానగర ప్రజలూ కదలివచ్చు దృశ్యము సీతాదేవి కలగనెను. ఆ సంగతి రామునకు తెలిపెను. సర్వాంతర్యామి శ్రీరాముడు వారి రాకకొరకు ఎదురు చూచుచుండెను. ఆకాశమున వారి అలికిడి తెలుపుచూ దుమ్ములేచుట లక్ష్మణునకు కనుపించినది. వానికి వీరావేశము కలిగినది. భరతుడు వచ్చుచున్నాడనీ, వానివెంట చాలా జనము ఉన్నదనీ భిల్లులు, కోయవారు పరుగెత్తుకొని వచ్చి చెప్పగనే ఆతని ఆవేశమింకనూ అధికమయ్యెను.

# భరతుడు సువ్రతుడు

లక్ష్మణుడు-"అన్నా! భరతుని వెనుకటి స్వభావము మన కందరకునూ తెలిసినదే. కాని ఇప్పుడు? ఏమో! మూర్ఖులు అధికారము పొందినతరువాత వారి అసలు రూపము బయటపడును! ఇప్పుడత డిచటకు వచ్చుటకు కారణ మేమైయుండును? రాజ్యము చేజిక్కించు కొన్న తరువాత దురుద్దేశము కలుగుటలో ఆశ్చర్యమేమియునూ లేదు. రాజ్యాధికారము పొంది పిచ్చి అహంకారము పొందనివా రెవరు ? పదవీవ్యామోహముతో భ్రష్టులు కానివారెవరు? దీని కెన్నో వుదాహరణ లున్నవి శత్రువులనుండి, ఋణమునుండి నిశ్శేషముగా విముక్తులగుట మంచిదందురు" అనెను.

అప్పుడు సరళహృదయుడు. సర్వజ్ఞుడు శ్రీరాముడు "లక్ష్మణా! ఈ జగత్తున అసంభవమైన దేదయిననూ సంభవింపవచ్చు నేమోగాని భరతుడు మాత్రము రాజ్యాహంకారము పొందడు. భరతునివంటి పవిత్ర హృదయుడు ప్రపంచములో మరొకడుండడు" అనెను.

భరతుడు పర్ణకుటీరము సమీపించగనే ఆతనికి దుఃఖము పొర్లి వచ్చెను. శ్రీరాముడు తమ్ముని హృదయమునకు హత్తుకొనెను. వారిద్దరు కలుసుకొను ఆపేక్ష దైన్యమును చూసి ప్రజలు తన్మయు లయిరి.

ఆ తరువాత శ్రీరాముడు శత్రుఘ్నుని, తల్లులను, స్వజను లను, పురజనులను, గురువుగారినీ అందరినీ కలుసుకొని ఆదరించెను.

వశిష్టమహర్షి శ్రీరామ లక్ష్మణులకు పరమార్థ తత్వములు బోధించుచూ చివరకెట్లో దశరథమహారాజుగారి మరణవార్త తెలి పెను. శ్రీరాముడామాట వినగనే దుస్సహ దుఃఖము ననుభ

వించెను. తన వియోగ కారణముగా తండ్రి మరణించిరను సంగతి తెలియగనే రాముడెంత చింతించెనో చెప్పలేము. శ్రీరాముడు నిర్జల ఉపవాసముండి తిలోదకములు అర్పించి తాను చేయగల పితృ క్రియలు గురువుగారు ఆజ్ఞాపించినట్లు జరిపెను.

అయోధ్య అంతయూ కదలి చిత్రకూట పర్వతముమీదకు వచ్చి వాలినదా అనిపించుచుండెను. ఆ ప్రజలు కామదగిరి పర్వతము శోభ తిలకించుచు, మందాకినీ నదిలోని అమృతధారలు గ్రోలుచూ, శీతల మంద పవనములువీచు వృక్ష చ్ఛాయలలో విహరించుచూ హాయిగా అయోధ్యను మరచి కాలము గడుపుచుండిరి. ముఖ్యముగా రాముని సన్నిధానమున వారు పొందలేని సుఖమేమి గలదు ?

కామదగిరి పర్వతముపై నివసించు అడవిజాతి ప్రజలు అయోధ్యావాసులకు దొన్నెలలో తేనె, పండ్లు ఫలములు కంద మూలములతో విందులు చేయుచుండిరి. వారి అతిథిమర్యాదలు చూచుచున్న శ్రీరామునకు కళ్లు చెమర్చేవి. ఇట్లు ఇంకెన్నాళ్లు వారందరూ కష్టపడగలరు ? కందమూలములు తిని ఎండ వానల కోర్చి వారందరు తనకొరకిచ్చట పడియుండుట రామునకు చాలా కష్టము గలిగించెను. క్షణమొక యుగముగా గడపసాగెను. వారిని తిరిగి అయోధ్యకువెళ్ళి సుఖముగా జీవనము గడుపమని కోరెను. గురువుగారిని గురుపత్నిని తమ్ములను తల్లులను తిరిగి వెళ్ళిపొమ్మని వేడెను.

ఈ మాటలు వినగనే భరతుడు చింతామగ్నుడయ్యెను. వానికి రాత్రులు నిదురరాదు. పగలు భోజనము సయించుటలేదు. శ్రీరాము నకు రాజ్యాభిషేకము చేయవలెనని అతని అభిలాష. గురువుగారి ద్వారా తన కోరిక రామునకు విన్నవించెను,

సూర్యకుల భూషణుడు శ్రీరాముడు ధర్మరక్షకుడు. భగవంతుడు. అతడు వేదమర్యాదల నెరిగినవాడు సత్యవ్రతుడు. దుష్టులను శిక్షించుటకు దేవతలను కాపాడుటకు అవతరించిన పురుషోత్తముడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, దిక్పాలకులు, కాలము సూర్య చంద్రులు, మాయ, జీవులు అన్నియూ శ్రీరాము నాజ్ఞానుసారము నడుచును. రాముడొక్కడే జగదీశ్వరుడు. జగదోద్ధారకుడు.

వశిష్టుడు : "శ్రీరామా ! నీవు సర్వజ్ఞుడవు, సుజనుడవు, ధర్మము, నీతి నీకు తెలిసినట్లింకెవ్వరికినీ తెలియవు. రామా ! ఎవరి హృదయములో ఏమున్నదో నీకే తెలియును. నీవు సర్వాంతర్యామివి. నేను వేరే చెప్పనవసరము లేదు. నీ తల్లులు, తమ్ములు స్వజనులు పురవాసుల అభీష్టమెరిగి, వారి హితముకోరి, నీ కెట్లు ఏది వుచితమని తోచునో ఆ విధముగా చేయుము. ఆర్తులు, దీనులు, దుఃఖితులు సరిగా ఆలోచించలేరు" అనెను.

శ్రీరాముడు గురువు వశిష్టులవారి ఆదేశానుసారమే ఆచరించుదు నని సవినయముగా సమాధాన మొసగెను.

వశిష్టుడు- "శ్రీరామా ! భరతుని భాతృప్రేమ నన్ను సరిగా ఆలోచించనీయుటలేదు. వానికి నీయందుగల భక్తి అనన్యమైనది. కనుక అతడేమిచెప్పనో, అతని అభిమతమేమిటో వినుము. ఆ తరువాత నీ వేమి చేయవలయునో ఆలోచించుకొనుము" అనెను.

భరతుడు ధర్మదురంధరుడు. మనోవాక్కాయ కర్మలా శ్రీరాముని సేవకుడు. అన్నగారికి తనయందు గల ప్రేమ నెరిగిన భరతుడు పులకిత శరీరుడై ఏమియూ మాట్లాడలేకపోయెను. ప్రేమాశ్రువులు అతని కన్నులలో నిండినవి. సీతా రాములు తన

దేవులు. వారికి తనయందు కృపవున్న చాలును. తన పాప పరిణామ మెరుగక కన్నతల్లిని నిందించితి ననుకొనెను.

శ్రీరాముడు "నాయనా! భరతా! నీవు అనవుసరముగా గ్లాని చెందుచుంటివి. సకల చరాచరములు ఈశ్వరుని అధీనములో నున్నవి. భూత భవిష్య ద్వర్తమానములలో పుణ్యాత్ములని చెప్పబడు వారందరూ నీకంటె తక్కువవారే! పొరపాటున కూడ నిన్నెవ్వరూ అపార్థము చేసికొనరు. మూర్ఖులు తల్లి కైకమ్మను నిందించుదురు గాని, జ్ఞానులెన్నడునూ దూషించరు. భరతా! ప్రేమ, వైరము అనునవి హృదయము యొక్క సహజ లక్షణములు. అవి దాచిన దాగవు. పశువులు పక్షులు కూడా హృదయ స్వభావము నెరిగి ప్రవర్తించును. అవి సాత్వికులు సాధుస్వభావులు, ఋషులు, మునుల వద్దకు నిర్భయముగా పోవును. బోయలు కిరాతకుల వద్దకు పోవు. అనగా వాటికికూడ మిత్రులెవరో శత్రువులెవరో తెలుసునన్నమాటే గదా! అట్టిచో మనుష్యుల కెందుకు తెలియదు. ఈ మానవ శరీరము జ్ఞానమునకు నిధి నాయనా! భరతా! నాకు నీమనస్సులో ఏమున్నదో బాగా తెలుసును. కాని తండ్రిగారికిచ్చిన వాగ్దానము ననుసరించి నే నడవులకు వచ్చితిని. నా వియోగములో వారు దేహమును విడిచిరి. నీవు నన్నిప్పుడేమి చేయమందువు? ఆలోచించుకొని చెప్పుము. నీవేది చెప్పిన అదే చేయుదును."

శ్రీరాముని ప్రియవచనములు విని అందరునూ ఆనందించిరి. దేవతలు భయ భీతులయిరి. దేవతాకార్యము నెరవేరదేమోనని శ్రీరాముని ప్రార్థించిరి. శ్రీరాముడు భక్తి పారవశ్యుడు. ప్రహ్లాదునకు నారసింహుడుగా దర్శనమిచ్చెను. ఇప్పుడు తమకార్యము నెరవేరుటనునది భరతుని ఆధీనములో నున్నదని వారు భావించిరి,

భరతుడు అన్నగారికి తనయందు అపరిమితమైన ప్రేమ వాత్సల్యములు గలవని గ్రహించి మారుమాటాడ లేకపోయెను. వాని మనోవేదన తీరినది. రాముని సేవచేయుటయే తన కర్తవ్యమను కొని "అన్నా! ఏదిచేసిన ప్రజలు సుఖించుదురో అట్లేచేయ ప్రార్థన! నేనూ లక్ష్మణుడు శత్రుఘ్నుడు ఈ అడవులలో వుందుము. తమరు తిరిగి అయోధ్యకు వెళ్ళి రాజ్యమేలుకొమ్మని నా కోరిక! విజ్ఞతతో ఆలోచించు శక్తి నాకిప్పుడులేదు. ఏది ఉచితమో! శ్రేయస్కరమో! మీరే తెలుపవలెను మీ ఆజ్ఞ సదా ఎల్లప్పుడు శిరసా వహించుదును."

ప్రభువు శ్రీరాముడు వెంటనే బదులు పలుకలేదు. అతడు సార్వభౌముడు. జరుగవలసిన కర్తవ్యమేమిటో అతనికి క్షుణ్ణముగా తెలుసును.

జనకమహారాజు, విశ్వామిత్ర మహర్షి, జాబాలి మరెందరో మహనీయులు వారివెంట చిత్రకూటమునకు వచ్చిరి. వారు దశరథ మహారాజు మరణమును గురించి సంతాపము వెలిబుచ్చి శ్రీరాముని వానిసోదరులను తల్లులను పలుకరించిరి. నాలుగురోజులుగా అందరునూ కలిసి చిత్రకూటముపై వుండిరి. సీతా రాములను తిరిగి తమవెంట తీసుకొని వెళ్ళవలెనను అభిలాష వారందరికీ కలిగినది. వారురానిచో తాముకూడ అడవులలోనే వారితోబాటు వుండిపోవలెనని తలచిరి. శ్రీరాముడున్నచోట కోటి అయోధ్యలు, వందకోట్ల మిథిలలూ వున్నట్లే! చిత్రకూటముమీద విడిదిచేసిన రెండు రాజసమూహములు తిరిగి వెళ్ళుటకు మనస్కరించక అట్లే వుండిపోవుటకు నిశ్చయించుకొనిరి.

## ప్రభువుకు బదులు పాదుకలు

భరతుడు "అన్నా! వేదశాస్త్రములలో సేవాధర్మము కర్తవ్యము గొప్పదని ఉల్లేఖించిరి. విరోధము, పగ, ప్రేమ, మనుష్యులను జ్ఞానహీనులను చేయును. పిచ్చివాళ్ళను చేయును. హృదయ లక్షణములైన ప్రేమ ద్వేషములలో ఏది ప్రకోపించిననూ నరుడు సత్యము ధర్మము అవలంబింపజాలడు. పొరబాటు చేయుట కెక్కువ అవకాశమున్నది. కనుక నన్ను సమస్యా పరిష్కారము చేయుమని అడుగవలదు. ఏది ఉత్తమమో! ఉచితమో! వశిష్ట విశ్వామిత్రుల నడిగి చేయుమని" వేడెను.

ఇంద్రాది దేవతలు సరస్వతిని స్మరించిరి. భరతుని బుద్ధి దేవతల కనుకూలముగా మార్చుమని వేడిరి.

సూర్యకులమునకే సూర్యుడైన భగవంతుడు శ్రీరాముడు ప్రజలమధ్యకు వచ్చి నిలచెను. భరతుని అభిప్రాయమును జనకుడు, వశిష్ఠుడు మరొకమారు శ్రీరామునకు విన్నవించిరి. శ్రీరాముని ఆదేశానుసారము అందరూ నడుచుకొనగలమని అదే శిరోధార్యమని మరల మరల పలికిరి.

జనకుడు, వశిష్టుడు, విశ్వామిత్రుడు వంటి పెద్దలు ఏది నిర్ణయించిన అదే ధర్మము, సత్యము గనుక వారినే సమస్యా పరిష్కారము చేయుమని శ్రీరాముడు వినమ్రభావముతో పలికెను.

రాముని వాక్కులు విని ఋషులు, మునులు స్తంభించి పోయిరి. అందరూ భరతునివైపు చూచిరి. భరతుడు సభవైపు చూచెను. భరతుడు పెద్దలకు, సభాసదులకు సమస్కరించి సరస్వతీ దేవిని స్మరించి-"అన్నా! శ్రీరామచంద్రప్రభో! మీరు శరణాగత రక్షకులు, ఆర్తత్రాణ పరాయణులు, సర్వజ్ఞులు. నేను మోహావేశు

డనై, శ్రాంతిచెంది ఈ విధముగా అయోధ్యనే తరలించుకొని మీ వద్దకు వచ్చితిని. అన్నా! మీ స్వభావము జగత్ప్రసిద్ధము. వేదశాస్త్రములు కీర్తించినవి. క్రూరులు, కుబుద్ధులు, కళంకులు, నీచులను కూడా క్షమించి మీ శరణు జొచ్చినవారిని కృతార్థులను చేయుదురు. నా ఆర్తభావము నెరిగి నన్ను క్షమించుదురుగాక! జాగ్ర స్వప్న సుషుప్త్యావస్థలలో కూడా నేను మీ దాసుడను. మీ అజ్ఞాపాలనము కన్న నే కోరదగిన దేమియూ లేద"ని విన్నవించెను.

ఇట్లు పలుకుచూ భరతుడు ప్రేమవివశుడయ్యెను. శ్రీరాముని పాదములపై పడెను. అతని వాత్సల్యము, ప్రేమ వివరింప శక్యము కాదు. శ్రీరాముడు భరతుని లేవదీసి తనచెంత కూర్చొనబెట్టుకొనెను. ఆ దృశ్యము చూచి ప్రజలు చిత్తరువులోని బొమ్మలవలె నుండిపోయిరి.

శ్రీరాముడు-"భరతా! మనసా, వాచా, కర్మణా నీకు నీవే సాటి. సూర్యకుల రీతిని, సత్యప్రతిజ్ఞను, తండ్రిగారి కీర్తిని ఎరిగిన వాడవు. కష్టసుఖము లెన్నైనన ఎదుర్కొని పధ్నాలుగు సంవత్సరములు నీవు రాజ్యము చేయుము. ఈ కార్యభారము నేనే నీపై మోపుచున్నాను" అనెను.

భరతుడు-"అన్నా! ఈ జగత్తున జన్మ ఎత్తినందులకు సార్థకత నొందించుకొందును. మీ ఆజ్ఞ శిరసావహించుదును. మీ ఆదేశమునకు చిహ్నముగా నాకేదయిన ప్రసాదింపుడు. ఆ ఆలంబనముతో ఎట్లో ఈ పదునాలుగేళ్ళు గడుపుదును" అనెను. రామునివద్దనుండి గుర్తుగా ఏదో పట్టుకొని వెళ్ళవలెనను కోరిక భరతునకు గలదు. అది గ్రహించిన శ్రీరాముడు తన పాముకోళ్ళుతీసి వానికిచ్చెను. భరతుడు భక్తిగౌరవములతో వాటిని తన శిరస్సుపై నుంచుకొనెను. ఆరెండు

పాదుకలు ప్రజలు తమకు రక్షగా వుండునని భావించుకొనిరి. సీతా రాములు వారితో నున్నట్లే యనుకొనిరి.

భరతుడు శ్రీరామునివద్ద శెలవు తీసుకొనెను. రాముడు అయోధ్యాప్రజలను అయోధ్యకు తిరిగి వెళ్ళమని ఆదేశించెనుగాని తల్లులు, తమ్ములు, స్వజనులు, పురజనులను విడుచునపుడు వారి కమలనయనములు అశ్రుపూరితములైనవి. జ్ఞాననిధానులు వశిష్ట విశ్వామిత్రులు, జనకమహారాజు ఆ దృశ్యము చూచి ఖిన్నులయిరి. శ్రీరాముడు తన తమ్ములను మరొకమారు ఆలింగనము చేసు కొనెను. సీతారామలక్ష్మణులవద్ద ప్రజలందరును శెలవు తీసుకొనిరి.

జనకమహారాజు. విశ్వామిత్రుడు, జాబాలి, వామదేవుడు వారివారి జనులందరూ రామునివద్ద వీడ్కోలు తీసుకొని ముందుకు సాగిరి. శ్రీరాముడు తల్లి కౌసల్యను వోదార్చి ధైర్యము చెప్పి పల్లకి ఎక్కించెను. సీతాదేవి పుట్టినింటివారికి, అత్తింటివారికి అందరికి నమస్కరించినది.

సీతారామలక్ష్మణులను వారి హృదయకమలములందు పదిల ముగా ముద్రించుకొని పాదుకలు పట్టుకొనీ అయోధ్యవాసులందరూ ప్రయాణము సాగించిరి.

# శ్రీమద్రామాయణ సందేశము

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

మళ్ళీ రామాయణమెందుకు ? మరొక వస్తువు స్వీకరించరాదా అనే ప్రశ్న అనాదిగా వినబడుతూనే ఉంది. మహాకవులు తమకు తమకు తోచినట్లు సమాధానం చెప్పుకుంటూనూ వచ్చారు. ఎవరి అభిరుచి వారిది. ఎవరి భక్తిభావన వారిది. కవికుల గురువు కాళిదాసుకు ఇటువంటి సందేహమే కలిగినట్లుంది. "అథవా కృతవాగ్ ద్వారే" అనే రఘువంశ శ్లోకంలో తనకికూడా ఏతద్వంశీయుల చరిత్ర వ్రాయడానికి పూర్వసూరులు బాట వేచినారని వినయోక్తిగా సూచించాడు. అనర్ఘ రాఘవ నాటకం వ్రాసిన మురారికవి ఇదే ప్రశ్న ఇంకా సూటిగా వేసుకొని "యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితమ్" అనే శ్లోకంలో కవి ప్రతిభకు సార్థక్యం కలిగించగల ఇంకొక మహాపురుష చరిత ఏది అని ధైర్యంగా సమాధానం చెప్పాడు.

అసలు వాల్మీకి మహర్షియే తన్నుతాను ప్రశ్నించుకుని సవివరంగా సమాధానం చెప్పుకొన్నాడు. "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ । ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః" ఇత్యాదిగా మనోహర ప్రశ్నోత్తరాలు సాగించాడు. వాల్మీకి చెప్పిన గుణమహోదధి యయిన పురుషుడు ఎక్కడైనా ఉంటాడా? ఉన్నాడా! అనేవన్నీ చొప్పదంటు ప్రశ్నలు. ఆదర్శ పురుషులు, ఆదర్శ స్త్రీలు, ఆదర్శ సందేశహారులు సంభావ్యులు.

శ్రీమద్రామాయణము ఆదర్శ వాదమును, మానవతావాదమును అద్భుతంగా సమ్మేళనం చేసిన సృష్టి గనుకనే ఎవరెంతగా ఈసడించినా సజ్జనులయొక్కయూ, శీలవతులైన నారీమతల్లుల యొక్కయూ సమాదరమును యుగయుగాలుగా పొందుతోంది.

(అరణ్య కాండ)

# మునులతో ఇనవంశోత్తముడు

శ్రీరాముడు భక్తవత్సలుడు. నితాంత సచ్చిదానందమూర్తి. ఆజానుబాహువు. అప్రమేయుడు. ముల్లోకములకు స్వామి. సుఖధాముడు. ఆదిశక్తి సీతాదేవి, లక్ష్మణునితో కలసి మునులకు భక్తులకు మోక్షమొసగుటకు చిత్రకూటము వదలి మరొక అడవికి బయలు దేరెను. అది దండకారణ్యము.

దండకారణ్యమునకు వెళ్లు త్రోవలో వారు అత్రిమహామునిని చూసిరి. వారు గొప్ప రామభక్తులు. రాముని ఆగమనవార్త తెలియగనే వారు ఎదురేగి వారిని ఆహ్వానించి తమ ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళిరి శ్రీరాముని అనేకవిధముల స్తుతిచేసిరి. అత్రి ధర్మపత్ని అనసూయాదేవి సీతమ్మకు కొన్ని స్త్రీ ధర్మములు బోధించినది.

సీతా రామ లక్ష్మణులు ఆ మునివర్యునివద్ద శెలవు తీసుకొని తిరిగి ప్రయాణము సాగించిరి. శ్రీరాముడు ముందు నడచుచుండెను. ఆయన వెనుక సీత, ఆమె వెనుక లక్ష్మణుడు. ఈ దృశ్యమును పరికింప బ్రహ్మ, జీవుడు, వీ రిరువురిమధ్య మాయ వ్యాపించి వున్నదా అనిపించునట్లున్నది.

### పుడమి పువ్వులపూసె - నభము నల్లబడె

దుర్గమమయిన అరణ్యమార్గమున సీతా రామ లక్ష్మణులు నడుస్తున్నపుడు భూదేవి సుకోమలంగా మారినది. వీ రెచటెచటికి పోవుదురో అచట ఆకాశముకూడా మేఘావృతమై చల్లగా హాయిని

గొలుపుచుండెను. శ్రీరాముడు త్రోవలో ఎదురైన అనేకమంది రాక్షసులను సంహారించెను. రామునిచేతిలో చనిపోయినవా రందరునూ పరంధామము చేరిరి.

సీతారామలక్ష్మణులు శరభంగ మహాముని వున్న ప్రదేశమునకు విచ్చేసిరి. ఆ మునివర్యుని జీవితము ధన్యమైనది. శరభంగుడు బ్రహ్మలోకమునకు ప్రయాణమై శ్రీరాముని ఆగమనవార్త నెరిగి వారి రాకకొరకు రాత్రింబవళ్ళు ఎదురుచూచుచుండెను. శ్రీరామ దర్శన మైనంతనే ఈ విధముగా స్తుతిజేసెను.-"శ్రీరామా! భక్త వత్సలా! ఈ భూలోకమున జీవించియున్నంతకాలము అనేక కష్టముల ననుభవించుచూ వుండవలసినదే! నన్ను మీలో కలుపుకొనుడు. మీ పరంధామము చేర్చుడు. జపము, యోగము, తపస్సు యేయే జన్మలలో ఏమేమిచేసితినో అవన్నియూ మీ కర్పించుచుంటిని. అందులకు ప్రతిఫలముగా శ్రీరామా! రామచంద్రా! మీరు సీతాలక్ష్మణ సమేతులుగా నా హృదయమందిరమున అధివసింప కోరుచున్నాను ప్రభూ" అని అర్థించెను.

ఇట్లు పలుకుచు శరభంగ మహాముని యోగాగ్ని ఏర్పరచుకొని, ఆ అగ్నిలో తనదేహమును దగ్ధమొనరించుకొనెను. శ్రీరాముని కృపవలన అతడు వైకుంఠపురము చేరెను. దుర్లభమైన పరమపదము పొందిన శరభంగునిచూచి ఋషులందరునూ సంతసించిరి. శ్రీరాముని స్తుతించిరి. జయము పలికిరి.

సీతారామలక్ష్మణులు అడవిదారిని ఇంకా ముందుకు సాగిరి. వారివెంట ఎందరో ఋషులు, మునిపుంగవులు నడుచుచుండిరి. వారికి ద్రోవలో ఒక బొమికెల గుట్ట కనబడెను. ఆ గుట్టను చూసి శ్రీరాముడు ఆశ్చర్యచకితుడయ్యెను. అపుడు మునులు చెప్పిరి.- "ప్రభూ! మీరు సర్వజ్ఞులు. సర్వాంతర్యాములు. అన్నియూ ఎరిగియు మీరిట్లడుగుచుండిరి. ఘోరరాక్షసులు మునులను చంపి తినుచుందురు. ఇవన్నియూ వారి అవశేషములు."

ఇది విని దయామయుడు శ్రీరాముని కన్నులలో నీరు నిండినది. కరుణాశ్రువులు స్రవించినవి. అపుడు శ్రీరాముడు చేతులెత్తి ప్రతిజ్ఞ చేసెను. ఈ పృథ్విని రాక్షసరహితము చేయుదునని పలికెను. అది విని మునులెంతయో ఆనందించిరి.

## ఎద రామాలయం

అగస్త్య మహర్షి వద్ద సుతీక్షుణుడను శిష్యుడు గలడు. అతడు గొప్ప భగవద్భక్తుడు. మనోవాక్కాయ కర్మలా శ్రీరాముని సేవించుచుండును. స్వప్నమునకూడా అతడు ఇతర దేవతలను తలచడు. ఏవిధముగా శ్రీరాముని కృపాపాత్రుడను కాగలుగుదునా యని వాని చింత. భవబంధ మోచనము చేయు శ్రీరాముని దర్శనము కానున్నదని ఎరిగి అపరిమితమైన ఆనందమును పొందెను ఆ ఆనందములో ఉన్మత్తుడయ్యెను. శ్రీరాముని గుణకీర్తనము చేయుచూ సమాధిస్థితుడయ్యెను.

శ్రీరాముడు స్వయముగా వచ్చి వానిని సమాధినుండి మేలుకొలుప ప్రయత్నించిననూ ప్రయోజనము లేకపోయెను. అపుడు శ్రీరాముడు చతుర్భుజములతో తన విరాట్ స్వరూపమున వానికి దర్శన మిచ్చెను. ఆ స్వరూపమును చూడగనే సుతీక్షుణుడు వ్యాకుల చిత్తుడై కళ్లు తెరచెను. సీతారామ లక్ష్మణులు అతని బాహ్య నేత్రముల యెదుట సాక్షాత్తు ప్రత్యక్షమయిరి. వెంటనే అతడు శ్రీరాముని పాదములపై వ్రాలెను రాముడు వానిని లేవదీసి హృదయమునకు హత్తుకొనెను.

సుతీక్షుణుడు సీతారామ లక్ష్మణులను తన ఆశ్రమమునకు తీసుకొనివెళ్ళి అనేక విధముల పూజించెను. శ్రీరాముడు వాని భక్తికి మెచ్చి ఏదైన వరమడుగు మనెను. భక్తి, జ్ఞాన, వైరాగ్య నిధానుడైన సుతీక్షుణునకు రాములవారి నేమడుగవలెనో తోచలేదు. సూర్య చంద్రులవలె సీతారాములు తన హృదయ ఫలకముపై ఎల్ల వేళలా ప్రకాశిస్తూ వుండిన అంతే చాలుననెను. అట్లే జరుగునని

శ్రీరాముడు వాగ్దానమిచ్చి ఆ సమీపములో నున్న అగస్త్యుని ఆశ్రమమునకు బయలుదేరెను.

శ్రీరాముని దివ్యసుందర మూర్తిని చూడగనే అగస్త్య మహర్షి కన్నులు ఆనందాశ్రువులతో నిండినవి. రామ లక్ష్మణులు ఋషికి పాదాభివందనము చేసిరి. అచట చేరిన మునులెందరో ఆ దృశ్యము చూసి చకితులయిరి. శ్రీరాముని కనులారా గాంచి వారందరునూ ఆనంద మగ్నులయిరి.

శ్రీరాముడు అగస్త్యునితో—"ఋషీశ్వరా! నేనే కార్యార్థమీ కాననంబులకు వచ్చితినో మీరెరుగుదురు. మునిద్రోహులైన రాక్షసుల నెట్లు సంహరించవలెనో నాకు సెలవీయగోరెదను." అనెను.

పాపమును శమింప చేయగల ప్రభువు, జగదానందకారకుడు, సమస్త లోకములను పాలించు జగదీశ్వరుడు, సకల చరాచరములకు ప్రాణాధారము, అట్టి భగవంతుడు, సాకేత సార్వభౌముడు, ఏమియూ నెరుగని వానివలె ఋషీశ్వరుని రాక్షస సంహారమెట్లు చేయవలెనని అడుగుట విని ఋషీశ్వరుడు చిరునవ్వు నవ్వెను. అటు పిమ్మట—"రామచంద్రా! ఈ నిఖిల బ్రహ్మాండమూ మీ నిర్గుణ రూపమేగదా! అయిననూ రామా! నేను మీ సగుణరూపమునే కోరి చెదను. రామా! మీరు నివసించుటకు రాక్షస సంహారము చేయుటకు అనువయిన స్థలము పంచవటి. అది దండకారణ్యములో నున్నది. శ్రీరఘుకుల తిలకా! ఋషుల, మునులయందు దయచూపుదురు గాక!" అని వేడెను.

అగస్త్య మహర్షి ఆదేశము నందుకొని శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై అచటనుండి బయలుదేరి పంచవటి సమీపించెను. అచట జటాయువు అను పక్షి వారికి కనుపించినది. దానిని చూడ గనే కృపాసముద్రుడు కరిగిపోయెను.

# దండకారణ్యమున కోదండపాణి

అది దండకారణ్యము. గోదావరీ తీరమందుగల పంచవటిలో ప్రభువు పర్ణకుటీర మేర్పరచుకొని నివసించుచుండెను. శ్రీరాము డచట నివసించు చున్నప్పటినుండి ఋషులు మునులు నిర్భయముగా నుండిరి. పర్వతములు, నదులు సుశోభితముగా నున్నవి. పశువులు పక్షులు ఎంతో ఆనందముగా నున్నవి. ప్రభువులే స్వయముగ నివ సించుచున్న దండకారణ్య శోభ నెవరు వర్ణించగలరు?

సాకేత సార్వభౌముడు సుఖముగా కూర్చున్న సమయమున ఒకసారి లక్ష్మణస్వామి—"ప్రభూ! దేవతలకు, మునులకు, సకల చరాచర జగత్తునకు మీరు అధిపతులు. భక్తి, జ్ఞానము, వైరాగ్యము మాయలను గురించి నాకు వివరించి తెలుప ప్రార్థన. ఎందువలన మీరు ఇంత దయామయులుగా నున్నారో తెలుసుకొన వలెనని వున్నది. ఈశ్వరునికి జీవునకు గల భేదమేమి? మీరు నాకు వివరించి తెలుపకోరుచున్నాను."

శ్రీరాముడు—"లక్ష్మణా! నీవు మనస్సునూ బుద్ధినీ నిలిపి శ్రద్ధగా వినుము. ఈ భావములు ప్రతి ఒక్కరూ తెలిసికొనవలసినట్టివి. జనహితము కోరి నీవు నన్నీ ప్రశ్నలడిగితి వనుకొనుంటిని. సంక్షిప్త ముగా తెలిపెదను వినుము...నేను-నాది, నీవు-నీది, అను భావముతే మాయ. విషయ వాసనలకు ఇంద్రియ భోగములకు ఈ మనస్సు వశమై యున్నంతకాలము మాయ వానిని ఆవరించియే యుండును. అసలు అట్టి మనస్సునే మాయ యనవచ్చును. అనగా మనస్సు మాయామయమై యున్నదన్నమాట.!

"లక్ష్మణా! విద్య-అవిద్య అనునవి కూడ తెలిసికొన వలసిన విషయములు. 'విద్య' వలననే ఈ జగత్తు నిర్మాణమయి యున్నది. పరబ్రహ్మము వలననే విద్య ప్రేరేపింపబడినది ఇక 'అవిద్య'-దుఃఖ

దోష భూయిష్టమయినది. దానికి వశులైన మానవులకు శాంతి సుఖములుండవు. సంసార కూపములోపడి కొట్టుకొనుచుందురు. దుఃఖదాయకమైన స్థితిలో నుందురు 'జ్ఞానము' అనునది చూచుటకు వినుటకు బోధపడినట్లే యుండును. కాని ఆస్థితి నందుకొనుట అంత సులభము కాదు. తన యందున అందరి యందున విద్యమానమై యుండు పరబ్రహ్మమును అహంభావ రహితముగా తెలుసుకొనవలెను. ఆత్మ వస్తువును అందరిలో చూచుట నేర్చుకొనవలెను. సమస్త సిద్ధులను, త్రిగుణములను త్యజించినగాని ఆత్మ పదార్థము యొక్క అంతు తెలియదు. అన్నియూ త్యజించి విరాగిగా నుండునదే జ్ఞానము. ఇదే జీవునకు అత్యంత కష్టసాధ్యమయిన విషయము.

మాయనుగాని, ఈశ్వరునిగాని ఉన్నదున్నట్లు తెలుసుకొనలేక పోవుటే జీవత్వ మనబడును. అదే జీవుడు.

కర్మాను బంధముల కతీతుడైనవాడే ఈశ్వరుడు. ధర్మాచరణమువలన వైరాగ్యము, యోగమువలన జ్ఞానము సిద్ధించును. జ్ఞానము మోక్షదాయకమైనది జీవుని ఈ జనన మరణముల నుండి దాటించునది. భగవంతుని చేరుటకు భక్తి సులభమైన మార్గము. భక్తివలన జ్ఞాన వైరాగ్యములు కూడా త్వరగా సిద్ధించును. భగవంతుని చేరుటకు అన్ని మార్గములందున అనన్యమైన భక్తిమార్గమే సులభమైనది. ఈ మార్గము సుఖదాయకమైనది, శుభప్రదమైనది.

వేదోక్త ప్రకారము జీవుడు తన కర్మాచరణము చేయుచునే యుండవలెను. ఆ చేయు కర్మ భక్తిభావనతో శరణాగత భావముతో చేసిన త్వరగా వైరాగ్యము కలుగును విరాగులకు నేనెప్పుడు అత్యంత సన్నిహితుడను. ఎవరు మనస్సులో నా లీలలయందు ప్రీతి, ఆసక్తియూ కలిగి నేనే సర్వస్వమని నమ్ముదురో, నా గుణములు కీర్తించినప్పు డెవ్వరి శరీరము పులకించునో కంఠము గద్గదమగునో కన్నులలో ప్రేమాశ్రువులు నిండునో అట్టివారికి నేను వశుడనై పోవు

డును. మనోవాక్కాయకర్మలా నాయందే మగ్నమయిన వారి హృదయకమలములందు నేను విశ్రాంతి తీసుకొందును. వారి హృదయఫలకములపై నా నిజరూపము ప్రతిఫలించును."

శ్రీరాముడు వివరించిన భక్తియోగము విని లక్ష్మణుడు ఎంతో ఆనందించి రామునికి పాదాభివందనము చేసెను. సర్వమానవుల శ్రేయస్సు కోరి భగవంతుడు తమ్మునికి భక్తిజ్ఞాన వైరాగ్యములు బోధించెను.

# హనుమంతాశనసంనిలో సీత

సీతారామలక్ష్మణులు పంచవటిలో నుండగా శూర్పణఖ అచటికి వచ్చినది. శ్రీరాముని దివ్య సుందర రూపము చూసి మోహించినది. ఏరీతిగానైనా రామలక్ష్మణులను వశమొనరించుకొనవలెనని విఫలప్రయత్నము చేసినది. అపుడు శ్రీరాముని అనుజ్ఞతో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులను కోసి ఆమెను అంగవిహీనురాలిని చేసెను. తన కురూపమునకు చింతించుచూ కోపావేశములను అణచుకొనలేక తన సోదరులైన ఖర, దూషణ, త్రిశిర లను ముగ్గురు రాక్షసులను పురికొల్పి రామలక్ష్మణులమీదికి యుద్ధమునకు పంపినది. శ్రీరాముని అతులిత బలపరాక్రమముముందు ఆరాక్షసులు వారి ఆసురీమాయలు నిర్వీర్యములయ్యెను. వారు ముగ్గురునూ శ్రీరాముని బాణములకు ఆహుతి అయిరి.

అపుడు శూర్పణఖ రావణాసురునివద్దకు పోయి తనకు జరిగిన పరాభవమును చిత్రవిచిత్రముగా వర్ణించి చెప్పినది. ఖర, దూషణ, త్రిశిరలు ముగ్గురునూ శ్రీరాముని బాణములకు గురియయిన సంగతి కూడా వివరించి తెలిపినది. ఖరదూషణాదులు సామాన్యులు కారు. వారు వధింపబడిరను వార్త వినగానే రావణుడు నిలువెల్ల నీరయ్యెను. ఆ వచ్చినది భగవంతుడేయయి యుండవలెను. లేనిచో వారు చచ్చి యుందురా? అని అతనికి సంశయము కలిగినది.

ఈ పృధ్వీభార మణచుటకు ఆ భగవంతుడే నిజముగా అవిగ్రహించి వున్నచో తాను తప్పక వానితో విరోధము పెట్టుకొని తీరుదునని తీర్మానించుకొనెను. పరాత్పరుని బాణములకు తన ప్రాణముల నర్పించుకొనవలెనని ఈ భవసాగరమునుండి తరించవలెనని కోరు

కొనెను. "ఈ తామస శరీరముతో భగవంతుని భజింపలేకపోవు చుంటిని. మనోవాక్కాయకర్మలా రామునితో యుద్ధముచేసి అతడు భగవంతుడే అయినచో వానిచేతిలో ఆనందముగా చనిపోవుదును. భగవంతుడు కానిచో ఆ రాజకుమారులను త్రుటికాలములో పరి మార్చుదును" అనుకొనెను. వారివద్ద అందమయిన స్త్రీ గలదని శూర్పణఖ చెప్పినది ఆ స్త్రీని అపహరించి వారితో యుద్ధమునకు తలబడుదునని నిశ్చయించుకొనెను.

అపుడు రావణుడు ఒక్కడునూ బయలుదేరి సముద్రతీరమున వున్న మారీచునివద్దకు వెళ్లెను.

* * *

జరుగనున్న కథయంతయూ శ్రీరామునకు తెలియును. అందుచేత ఒకయుక్తి పన్నెను. లక్ష్మణుడు కందమూలములు సేక రించుటకు అడవికివెళ్లిన సమయమునుజూచి శ్రీరాముడు సీతతో- "ప్రియా! నీవు పతివ్రతాధర్మము పాటించు సుశీలవు. నేను చెప్పినది శ్రద్ధగా వినుము. నేను రాక్షస సంహారము చేయవలసియున్నది. మనోహరమగు నరలీలలు సలుపవలసియున్నది. అప్పటివరకు నీవు అగ్నిలో దాగియుండుము" అని చెప్పెను.

శ్రీరాముని పలుకులు వినగనే సీతాదేవి వారితో సహకరించి శ్రీరాముని పవిత్రచరణారవిందములు మనస్సునదాచుకొని అగ్నిలో ప్రవేశించినది. ఆమె ఛాయామూర్తి మాత్రము అందరి బాహ్యా నేత్రములకు మామూలు సీతవలె అగుపడుచుండెను.

భగవంతుడు రచించిన ఈ లీల లక్ష్మణస్వామికికూడ తెలి యదు.

* * *

స్వార్థముతో రావణుడు మారీచునివద్దకు వెళ్లెను. అతని ముందు తలవంచెను. నీచుని వినమ్రభావము చాల భయంకరమైనది. దుష్టుల మధురవాక్కులు నమ్మరాదు. మారీచుడు రావణుని రాకకూ పాని విషయమునకు ఆశ్చర్యపడి కారణమడిగెను.

రావణుడు శూర్పణఖ చెప్పిన వృత్తాంతమంతయూ సవిన యముగా మారీచునికి చెప్పెను. మారీచుని ఒక చక్కని లేడిరూపు ధరించి రాజవధువు సీతను భ్రమింపచేయమనీ, ఆ ఉపాయముతో తాను ఆమెను అపహరించి ఎత్తుకొని పోవుదునని చెప్పెను.

రావణాసురునికి శ్రీరామునితో విరోధము, పగ తగదని మారీచుడు విన్నవించెను శ్రీరాముడు మనుష్యశరీరము ధరించి ననూ, అతడు జగదీశ్వరుడు. సకలచరాచర జగత్తునకు స్వామి. అట్టివానితో విరోధము తగదని పలువిధముల మారీచుడు రావణునకు బోధించెను.

"ఆ రాజకుమారులే విశ్వామిత్రుని యజ్ఞమును రక్షించిరి. నా మీద బాణము వేసినంతనే ఒక్క క్షణములో నూరుయోజనములు యివతలకువచ్చి పడితిని. అమిత పరాక్రమశాలితో విరోధము పెట్టు కొనుట నీకు క్షేమముకాదు. శ్రీరాముడు తాటకిని సుబాహువును వధించెను. శివధనుస్సు విరిచెను. ఖరదూషణ త్రిశిరలను చంపెను. అటువంటి ప్రచండవీరులు మామూలు మానవులనియే మీరనుకొను చున్నారా ? ఈ జగత్తులో జీవించియున్న జీవరాసులన్నియూ వారు జీవింపచేసిన కారణముననే జీవించుచున్నవి. చంపిన చచ్చుచున్నవి. అందరి జీవన్మరణములు వారిచేతిలో నున్నవి" అనెను.

మారీచుని హితవచనములు రుచింవక రావణాసురుడు మండి పడెను. ఎన్నియో దుర్భాషలాడెను. అప్రస్తుత జ్ఞానబోధకు విసుగు కొనెను. ఈ ప్రపంచములో తనను మించిన వీరుడెవ్వడూ లేడని విర్రవీగెను.

రావణుని పలుకులు వినగనే తనకు వానిచేతిలో చావు తప్ప నట్లు మారీచునకు తోచినది. అట్లయిన శ్రీరామునిచేతిలో చచ్చుటే మేలని ఆతడు భావించెను. అందుచేత రావణుడు చెప్పినట్లు విని వాని ననుసరించెను.

శ్రీరాముని చరణముల యందు ఆతనికి అఖండమైన విశ్వా సము ప్రేమ కలవు. ప్రభువు దర్శనభాగ్యము కలుగనున్నదని ఎర్రిగి

అతనికెంతో సంతోషము కలిగినది. శ్రీరాముని క్రోధమునకు గురి యగుటకూడ తనకు మోక్షప్రదమే! రాముడు కోదండముతో తనను వధించును. అంతకన్న తనకు కావలసిన దేమున్నది? రాముని కనులార చూచి ఆతని బాణమునకు గురియయి ప్రాణములు విడుచుట కన్న అదృష్ట మింకేమి కలదు? తనజీవితము ధన్యమయినట్లే!

## మాయలేడి వెంట మాయాతీతుడు

రావణుడు మారీచుడు పంచవటి సమీపించిరి. మారీచుడు చక్కని లేడిగా మారెను ఆ లేడి రూపము అత్యంత విచిత్రముగా నున్నది. ఆ సౌందర్యము వర్ణనాతీతము. బంగారు శరీరముమీద మణులు రత్నములు పొదగబడి యున్నవి.

సీతాదేవి ఆ లేడిని చూచినది. అది తనకు కావలెనని ఆ లేడి చర్మమును తెచ్చి యివ్వమని భర్తను కోరినది. శ్రీరామునకు మారీచుని మాయారూపము తెలుసును. దేవతా కార్యమును నెర వేర్చుటకు గాను ఏమియూ ఎరుగనట్లు మామూలు మనిషివలె లేచెను. నడుమునకు తూణీరము కట్టుకొని లేడివైపు బాణము నెక్కుపెట్టెను. లేడిని వేటాడుటకు పోవునపుడు అరణ్యమున రాక్షసులుందురని సీతా దేవిని జాగ్రత్తగా కాపాడుమని తమ్మునికి ఆజ్ఞాపించి వెళ్లెను.

ప్రభువు వెంబడించగనే లేడి పారిపోయినది. చాలదూరము దానిని వెంబడించుచూ శ్రీరాముడు వెళ్లెను.

వేదములు సహితము భగవంతుని దివ్య తత్వము నిరూపణ చేయలేకపోయినవి. అటువంటి పరాత్పరుడు మనుష్య రూపము ధరించి నేడు మాయలేడిని వేటాడుటకు పరుగెత్తు చుండెను. ఆలేడి దగ్గరకు వచ్చినట్లే వచ్చి తిరిగి కనుపించనంత దూరమగుచుండెను. కనుపించుచూ మాయమగుచూ అనేక కపటనాటకము లాడుచున్నది. అట్లు ఎంతోదూరము పారిపోయినది. చివరకు శ్రీరాముడు గురిచూసి బాణమువేసెను. పెద్ద శబ్దము చేయుచూ అ లేడి నేలకు వొరిగినది. మొదట —"హా లక్ష్మణా!" అని అరిచి ఆ తరువాత

శ్రీరాముని స్మరించుచూ ప్రాణములు వదలినది. ప్రాణము పోయి నంతనే వానికి రాక్షస రూపము వచ్చినది.

మారీచునకు తనయందుగల భక్తికి ప్రేమకు మెచ్చి శ్రీరాముడు ఋషులకు మునులకు కూడా దుర్లభమగు సద్గతి నొసగెను.

దీనబంధువు శ్రీరాముని గుణములను దేవతలు కీర్తించిరి. మారీచుని వధించిన పిదప శ్రీరాముడు పర్ణకుటీరమునకు తిరిగి వెళ్లెను.

మారీచుడు చనిపోవునపుడు చేసిన శబ్దము విని సీత అత్యంత భయ భీతురాలయి లక్ష్మణునితో—"నీ అన్నగారు ఆపదలో నున్నారు. దుఃఖపూరిత నాదము నాకు వినిపించినది. నీవు వెంటనే వెళ్ళి వారిని చూడు"మని ఆజ్ఞాపించినది.

లక్ష్మణుడు—"తల్లీ! ఎవరి కనుసన్నలతో, భృకుటీ విలాసముతో ఈసమస్తబ్రహ్మాండము సృష్టి స్థితి, లయము నందుచున్నవో అట్టి ప్రభువు శ్రీరాముడు స్వప్నమునందు కూడ కష్టము నొందజాలడు." అని ధైర్యము చెప్పెను.

ఇది విని సీతాదేవి లక్ష్మణుని మనస్సు నొచ్చునటుల పలికినది. భగవంతుని ప్రేరణము వలన ఆమె మనస్సు విచలిత మయినది. ధైర్యము కోల్పోయినది. లక్ష్మణుడు సీతను వనదేవతలకువొప్పగించి అన్నగారి వద్దకు వెళ్లెను. కుటీర ద్వారమువద్ద ఒక గీత గీసి ఆ రేఖ దాటవద్దని ఆమెతో చెప్పి మరీ వెళ్లెను.

# ఛాయామూర్తి అపహరణ

సీత వొంటరిగా వున్నది. ఆ సమయమున రావణాసురుడు సన్యాసివలె వచ్చి సీతను సమీపించెను. పది తలలుగల రావణుడు దొంగవలె అటూఇటూ చూచెను. చెడుమార్గమున నడచువారి తేజస్సు నశించును. బుద్ధిబలము క్షీణించును.

సాధువేషమున నున్న రావణుడు సాధుపుంగవునివలె అనేకములైన ప్రియ సంభాషణములు చేసెను. కథలు చెప్పెను. రాజనీతి, ప్రేమ, భయమును గురించి వివరించెను. అపుడు సీతాదేవి వానితో "ఓ యతీ! నీవు దుష్టునివలె నుంటి"వనెను.

రావణుడు వెంటనే తన అసలు రూపము సీతకు చూపించెను. వానిని చూచి ఆ పేరు విని సీతాదేవి భయకంపితురాలయినది. ఎట్లో ధైర్యము తెచ్చుకొని-"దుష్టుడా! ఆగుము. ప్రభువు యిప్పుడే వచ్చును."

ఈ పలుకులు వినగనే రావణుడు వుగ్రుడై మండిపడెను. సీతను రథముమీద కూర్చొనబెట్టుకొని అమిత వేగముతో ఆకాశ మార్గమున వెడలిపోయెను.

సీతాదేవి-"రామచంద్రా! రఘువీరా! లోకమున తమరు అద్వితీయులు. నే నేమపరాధము చేసితినని మీరు నన్ను దయచూడ లేదు? దీనదయాళూ! దయామయా! శరణాగత వత్సలా! ఆపద్బాంధవా! నాయందు దయలేదా! లక్ష్మణా! ఇందులో నీ దోష మేమియూ లేదు. నేనే నిన్ను పంపి తగిన ఫలమనుభవించుచుంటిని?" అని సీతాదేవి ఇట్లు ఎన్నో విధముల విలపించసాగినది

సీతాదేవి విలాపము విన్న జడచేతన జీవులన్నియూ దుఃఖించి నవి. జటాయువు సీత శోకము విని ఆమె ఎవరో గుర్తుపట్టినది. నీచ

రాక్షసుడు జగన్మాత సీతను మోసగించి తీసుకొనిపోవుచుండెనని తెలుసుకొన్నది. జటాయువు సీతతో-"తల్లీ! సీతామాతా! భయపడకుము. నేను ఈ రాక్షసుని నాశమొందించుదును." ఇట్లు పలుకుచూ జటాయువు రావణునిపైకి వెళ్ళినది-"దుష్టుడా! నిర్భయుడవై ఎట్లు పోవుచుంటివి? నేనెవరో ఎరుగుదువా?" అనెను.

యమరాజువలె తనపైకి వచ్చుచున్న జటాయువును చూచి రావణుడు ఇట్లు తలపోయసాగెను. "ఇది గరుడుడయియుండవలెను. లేదా ఈ ముసలి పక్షిని పరిమార్చుటకు ఎంతోసేపు పట్టదు" అనుకొనెను.

జటాయువు "రావణా! సీతను వదిలి నీవు క్షేమముగా ఇంటికి తిరిగి వెళ్ళుము. లేనిచో శ్రీరాముని క్రోధాగ్నికి నీ వంశ నాశనమగును."

రావణుడు బదులు పలుకలేదు. జటాయువు రావణుని జుట్టు పట్టుకొని రథముమీదనుంచి క్రిందికి లాగెను. రావణుడు క్రింద పడెను. జటాయువు ముక్కుతో పొడిచి రావణుని గాయపర్చెను. ఒక్కక్షణము రావణుడు మూర్ఛపోయెను.

అపుడు రావణుడు అత్యంత క్రోధపూరితుడై జటాయువు రెండురెక్కలు కత్తితో కోసెను. ఆ పక్షి శ్రీరాముని అద్భుత లీలలు కీర్తించుచూ నేలమీద పడెను.

సీతను రథముమీద కూర్చొనబెట్టుకొని రావణుడు అమిత వేగముతో దక్షిణ దిక్కుగా వెళ్ళిపోయెను.

సీతాదేవి విలపించుచూ హరినామ స్మరణము చేయుచూ తన నగలు, భూషణములు ఒక్కటొక్కటే వొలిచి పర్వతములమీదనున్న కోతులకు విసరినది.

రావణాసురుడు సీతను తీసుకొని లంకకు చేరెను.

# పక్షికి మోక్షప్రాప్తి

మాయలేడిని వధించి రామలక్ష్మణులు తిరిగి వచ్చిరి. అచట జానకి లేదు. ఆమె కనుపించకపోవుట రామలక్ష్మణుల కెంతో ఆందోళన కలిగించినది. శ్రీరాముడు సామాన్య మానవునివలె దీనుడై వ్యాకులపడెను. విలపించెను. రాముడు సీతను వెదకుచూ లతలను, వృక్షములను, పశువులను అడుగుచుండెను. వాటితో తన వ్యధను చెప్పుకొనుచూ సీతాన్వేషణము చేయుచుండెను.

తుమ్మెదలు కోకిలలు ఖంజనములు, రామచిలుకలు, పావురములు, పాలపిట్టలు, చేపలు, కలువమొగ్గలు, దానిమ్మపూవులు, శరత్‌చంద్రుడు, నాగినివరణులు, సింహములు, ఏనుగులు మొదలయిన సకల చరాచరములు శ్రీరాముని విలాపములో భాగము పంచుకొన్నవి. సీతావియోగముతో శ్రీరాముడు పడుచున్న వ్యధకు బాధపడినవి. రాముడు పూర్ణకాముడు. ఆనందరాశి, అజన్ముడు, అవినాశి. అటువంటి రామచంద్రప్రభువు మామూలు మనుష్యునివలె చరిత్ర నడుపుచుండెను.

ఈవిధముగా చెట్లు చేమల నడుగుచు శ్రీరాముడు అరణ్యములో యింకా యింకా ముందుకు పోయెను. అచట జటాయువు నేలమీద పడి కొట్టుకొనుచు వారికి కనుపించెను. అది రామనామము స్మరించుచున్నది. కృపాసాగరుడైన శ్రీరఘువీరుడు తన కరకమలములతో దాని తల నిమిరెను. రాముని చూచుటతోడనే దాని శరీర బాధలన్నియూ మాయమయినవి. జటాయువు శ్రీరాముని ఇట్లు స్తుతిచేసినది-"శ్రీరామా! భవభయ వినాశకా! శ్రీరఘునాథా! రావణుడు సీత నెత్తుకొనిపోయెను. ఆ దుష్టుడే నాకీ దుర్గతి కలిగించెను.

సీత దారుణముగా విలపించినది. కాని ఆతడు ఆమెను అపహరించి దక్షిణదిక్కుకు ఎత్తుకొనిపోయెను. ప్రభూ! సాకేత సార్వభౌమా! మీ దర్శన భాగ్యముకొరకే నా ప్రాణములు ఇంకా మిగిలివున్నవి. కృపానిధానా! ఇక నేను బ్రతుకను రామా! చనిపోవునపుడు మీ శుభనామము జపించుచూ స్మరించుచూ పోయినయెడల ఎంతటి పాపాత్ములకైననూ ఉత్తమగతులు దొరుకునందురు! ముక్తి కలుగు నని వేదములు ఉద్ఘోషించుచున్నవి. ప్రభూ! శ్రీరామచంద్రా!" అనెను.

శ్రీరాముడు జటాయువుతో—"నీవు నీ శ్రేష్టమైన కర్మల ద్వారా దుర్లభమగు పరమపదము పొందుదువు. ఎవరిహృదయములో ఇతరుల శ్రేయస్సు నిండియుండునో వారికి ఈ జగత్తులో ఎందునూ కొదువ వుండదు. ఏదియూ దుర్లభము కాదు. నీవు ఈ శరీరము విడుచుటతోడనే నాపరంధామము చేరుకొందువు" అనెను. జటా యువు స్థితిచూచి రామునకు కన్నులలో నీరు నిండినది.

జటాయువు—"శ్రీరామా! మీకు జయము! జయము! మీ రూపము అనుపమైనది. నిర్గుణ సగుణ రూపులు. అపరిమిత బలవం తులు. అవ్యక్తరూపులు, అగోచరులు, ఇంద్రియాతీతులు, నిరంజ నులు, నిర్వికారులు. మునులు ధ్యానము, జ్ఞానము, వైరాగ్యము, యోగము మొదలగు సాధనముల ద్వారా మిమ్ము చేరుకొందురు. భగవంతుడైన మీరు సకల చరాచర రూపులు. శ్రీరామచంద్రా! మీరు నా హృదయ పీఠముపైద శాశ్వతముగా నివాస మేర్పరచు కొన గోరుదును."

ఇట్లు శ్రీరాముని జపించుచూ, స్మరించుచూ వృద్ధరాజు జటాయువు ప్రాణములు విడచినది. శ్రీవారి సన్నిధానము చేరినది. గ్రద్ధ పక్షులన్నింటనూ అధమమయినదందురు. అటువంటి పక్షికి దీన దయాళువు శ్రీరామచంద్రప్రభువు పరమగతిని ప్రసాదించెను.

*

# "రావయ్యా రామా"!

శ్రీరాముడు సీతాన్వేషణము చేయుచూ త్రోవలో ఎదురైన కబంధుడను రాక్షసునకు శాపవిమోచనము గావించెను. ఆతడొక గంధర్వుడు. వానికి రాముని వలన తిరిగి నిజస్వరూపము వచ్చినది. శాపవిమోచన మవగానే కబంధుడు సంతోషాంతరంగుడై ఆకాశమార్గాన ఎగిరి తన లోకమునకు వెళ్ళిపోయెను.

ఇట్లు దండకవనములో సంచరించుచూ సీతకొరకు వెదకుచూ శ్రీరాముడు శబరి ఆశ్రమమునకు చేరుకొనెను. రాముని రాకకై వేచి 'రావయ్యా రామా' అని ఎదురుచూచు శబరి తపస్సు ఫలించినది. మతంగ మహాముని ఒకసారి తనతో అన్న పలుకులు శబరి జ్ఞప్తికి తెచ్చుకొన్నది. రాముని చూడగానే ఆమె అత్యంత ఆనంద మగ్నురాలయినది. రామ లక్ష్మణుల పాదములకు పదేపదే నమస్కరించి ఆనందాశ్రువులు రాల్చినది. శ్రీరఘువీరుల నెట్లు పలుకరించవలెనో ఆమెకు తోచలేదు. నోటమాట పెగలలేదు. మాటి మాటికీ రాముని పాదముల మీదపడి ప్రణామము లొనర్చి భక్తి పారవశ్యమున మునిగి ముచ్చటలు పడినది.

తుదకు తేరుకొని దోసెడు నీళ్లు తెచ్చి వారి పాదములు కడిగినది. ఉచిత ఆసన మమర్చి వారిని కూర్చోబెట్టినది. అందిన మధుర ఫలములు కోసి తెచ్చి, తియ్యగా వున్నవో లేవో నని ప్రతి ఒక్క పండూ రుచిచూసి శ్రీరామునకు అందించినది. శ్రీరాముడు పరాత్పరుడు. ఆమె అనన్య భక్తికి మెచ్చి ఆపండ్ల నారగించెను.

ప్రభువు రాముని దర్శన మవగానే ఆమె భక్తి పారవశ్యమొందెను. ఆమె నేత్రములలో ప్రేమాశ్రువులు నిండినవి-"రామా! రఘువీరా! మిమ్ముల నెట్లు స్తుతించవలెను? నేను తక్కువ జాతి

దానను. బుద్ధిహీనురాలను. అధమురాలను, స్త్రీని! పాపవినాశకా! రామచంద్రా! నన్ను కృతార్ధురాలను చేయుము!"

శ్రీరాముడు—"శబరీ! నీలోనూ, ఎల్లరిలోనూ నిండి నిబిడీకృతమగు భక్తిని మాత్రమే నేను చూచెదను! నిష్కళంక మగు భక్తికి నేను వశుడను. జాతి, పంక్తి, కులము, ధర్మము, ధనము, బలము, చతురత, మున్నగు సంపదలెన్నియున్ననూ భక్తిహీనులగు మనుష్యులు నీరులేని మేఘములవలె శుష్కజీవనులుగా నుందురు. నీలో భక్తి భావన పొంగి పొరలుచున్నది కాని యోగులకు దుర్లభ మగు సద్గతిని నీ ప్రసాదించుదును." అనెను.

శ్రీరాముడు జానకి జాడ ఏమయిన తెలియునేమోనని శబరి నడిగెను. శబరి ఇట్లు చెప్పినది—"శ్రీరఘునాధా! పంపాసరోవర మునకు వెళ్ళి అచట సుగ్రీవుని కలియుము. అతడు మీకు తప్పక ఉపయోగపడునుదేవా! తమరన్నియూ ఎరిగియున్ననూ నన్నిట్లడుగు చుంటిరి."

శబరి మాటి మాటికీ చేతులు జోడించి శ్రీరామునకు నమస్క రించి శిరస్సువంచి ప్రేమ పారవశ్యురాలయినది. భగవంతుని దర్శించుకొని ఆ దివ్య మంగళ రూపము తన హృదయములో ముద్రించు కొని శబరి ఈ శరీరము వదలి పరమపదము చేరినది. ఆమెకు పునరావృత్తిలేదు. జన్మ రహితురాలయి భగవంతునిలో ఐక్యమైనది.

# శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము

ఆచార్య దివాకర్ల వెంకటావధాని

శ్రీమద్రామాయణ మాదికావ్యము. ఒక్క సంస్కృత వాఙ్మయమునకేకాక ప్రపంచ వాఙ్మయములకెల్ల నది ఆదికావ్యము. రామాయణమునకు పూర్వము విలసిల్లిన వేదోపనిషాదులలో కవితామయములైన భాగములు లేకపోలేదు. కాని అవి అన్నియు ప్రాచీన సంస్కృతభాషలో నున్నవి. పెద్దపెద్ద పండితులకు గూడ ఆ భాష నర్థము చేసికొనుట కష్టము. భారతీయ సంస్కృతి బీజములన్నియు వేదములందుండుటచే మహర్షులు వేదప్రోక్తములైన నీతిధర్మతత్త్వాదులను సామాన్యులకుగూడ నందుబాటులోనికి తెచ్చుటకై కథోపాఖ్యానములద్వారా వానిని వెల్లడించుచు లౌకిక సంస్కృతభాషలో కావ్యపురాణేతిహాసములు రచించిరి. అట్టివానిలో శ్రీమద్రామాయణము మొదటిది. అందుచేతనే దాని కాదికావ్యమను పేరుకల్గినది.

శ్రీమద్రామాయణమున వర్ణింపఁబడినట్లు మరెచ్చటను భారతీయ గృహజీవిత మంత సమగ్రసుందరముగా వర్ణింపఁబడియుండలేదు. అది భారతీయ గృహ జీవితమునకు రత్నముకురము. గృహజీవిత మనగనే తల్లి, తండ్రి, కుమారుడు, కుమార్తె అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, భార్యాభర్తలు, మిత్రశత్రువులు, సేవ్యసేవకులు. భక్తభగవంతులు జ్ఞాపకమునకు వత్తురు. వీరి పరస్పర సంబంధ మెట్లుండవలయునో శ్రీమద్రామాయణమున చక్కగా వర్ణింపఁబడినది దానిని జాగరూకతతో పఠించువారు సంఘమున నెవరెవరితో నెట్లు వర్తింపవలెనో గ్రహింపఁజాలుదురు. మానవు లెట్టి స్థితిలో ఎవరితో ఎట్లువర్తింపవలయునో అది సోదాహరణముగా నిరూపించును.

## (కిష్కింధాకాండ)

# ప్రభుదర్శనం

శ్రీరామ లక్ష్మణులు సీతాన్వేషణము చేయుచూ ఋష్యమూక పర్వతమువరకూ వెళ్ళిరి. ఆ పర్వతముమీద సుగ్రీవుడు వాని మిత్ర బృందము నివసించుచున్నారు. అతులిత బలసంపన్నులు తేజోమూర్తులగు శ్రీరామ లక్ష్మణులు అచటకు వచ్చుట సుగ్రీవుడు చూచెను. అతనికి వారిని చూడగనే భయము వేసినది.

సుగ్రీవుడు హనుమంతునితో—"ఆ ఇరువురు పురుషులు తేజోమూర్తులు నీవు బ్రహ్మచారివలె వెళ్ళి వారెవరో తెలిసికొని రావలెను. వారి రాకకు కారణమేమిటో? ఒకవేళ వాలి వారినిపంపియుండవచ్చును. వారినిగురించి వివరముగా తెలిసికొనవలసివున్నది."

హనుమంతుడు బ్రాహ్మణవేషములో రామలక్ష్మణులవద్దకు వచ్చెను. "వీరులారా! మీరెవరు? క్షత్రియులవలె కనుపించుచున్నారు. మీరీవిధముగా అరణ్యములలో తిరుగుటకు కారణములేవి? మనస్సును హరింపచేయు సుందరమూర్తులగు మీరు ఎండలకు వానలకు వోర్చి ఎందుకిట్లు తిరుగుచున్నారు? మిమ్ములను చూచిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులో! నరనారాయణులో! భవసాగరమునుండి తరింపచేయుటకు అవతరించిన దివ్యపురుషులో! లేక ఈ జగత్తును, సమస్త బ్రహ్మాండమును ఏలు భగవంతుడేనా! అనిపించుచున్నది!" అని దిగ్భ్రమతో పలికెను.

శ్రీరాముడు-"మేము దశరథ సుతులము. మా తండ్రిగారి అనుజ్ఞ ప్రకారము ఈ అరణ్యములలో నివాసము చేయుచుంటిమి.

మా పేరులు రామలక్ష్మణులు. మా వెంట ఒక చక్కని స్త్రీ వుండెను. ఆమె అమిత సుకుమారి. రాక్షసులు ఆమెను అపహరించుకొని ఎత్తుకు పోయిరి. ఆమెకొరకు వెదకుచూ తిరుగుచున్నాము. ఇపుడు నీ వెవరవో తెలుసుకొనవలెనని వున్నది" అనెను.

ప్రభువు శ్రీరామచంద్రుని గుర్తించిన హనుమంతుడు వారి చరణకమలములమీద పడి సాష్టాంగ ప్రణామము చేసెను. ఆ భక్తి పారవశ్యకతతో తన్మయుడైన వాని స్థితిని వర్ణింప తరము కాదు. వాని శరీరము పులకించినది. నోట మాట పెగులలేదు. ప్రభువు యొక్క సుందరరూపము చూసి ముగ్ధుడై అట్లే వుండిపోయెను. కొంతసేపైన పిదప శ్రీరాముని ట్లు స్తుతిచేసెను.-"ప్రభో! తెలియక మీరెవరు అని అడిగితిని. నా అపరాధము క్షమింపుడు. మీరు సర్వజ్ఞులు. సామాన్యునివలె నేనెవరివో తెలుపమని యడిగిరి. నేను మీ మాయకు వశుడనై తిరుగుచున్న ఒక సామాన్య జీవిని. అందుచేతనే నేను మిమ్ములను వెంటనే గుర్తింపజాలక పోతిని. అజ్ఞానిని. దీనబంధూ! మీరే నన్ను ఈవిధముగా పొరబడునట్లు చేసిరి. మిమ్ములను గుర్తింపలేనంత మాయ నన్నావరించినది. ప్రభూ! దేవా! దేవాధిదేవా! నాలో అనేక అవగుణములు స్వాభావికముగా నున్నవి. కాని, సదా మీ పాదసేవకుడను. ఈ జీవుడు మాయవలన మోహితుడగుచున్నాడు. చివరకు మీ కృపవలననే మాయ తొలగిపోవుచున్నది!"

ఇట్లు పలుకుచూ హనుమంతుడు శ్రీరాముని పాదములపై బడెను. తన అసలు రూపము ప్రకటించెను. వాని హృదయము ప్రేమమగ్నమయినది. అపుడు శ్రీరాముడు వానిని లేవదీసి తన హృదయమునకు హత్తుకొనెను. రాముని అశ్రుబిందువులు హనుమంతుని శాంతింపచేసెను.

శ్రీరాముడు-"కపీ! నీవు మనస్సులో ఏమాత్రము గ్లాని చెందకుము. నీవు నాకు లక్ష్మణునికంటెనూ ప్రియమైనవాడవు. నిజమునకు నాకెవరునూ ప్రియులు అప్రియులు అంటూ వుండరు. కాని నన్ను సేవించువారు నాకు ప్రియులు. వారికి నేను అనన్యగతిని

ప్రాప్తింపచేయుదును. 'అనన్యగతి' యనగా భగవంతుని భక్తి, ఎవరి హృదయమునందు అచంచలముగా నుండునో, ఈ సకల చరాచర జగత్తు భగవంతుని రూపమై ఎవరికి భాసించునో వారు అనన్యగతిని పొందుదురు".

శ్రీరాముని అనుకూల వచనములు విని పవనకుమారుని హృదయముఉప్పొంగిపోయినది.-"ప్రభూ! ఈ పర్వతముమీద వానర రాజు సుగ్రీవుడు నివసించుచున్నాడు. ఆతడునూ మీ దాసుడు. వానిని భయరహితుని చేయుము. ఆతడు మీకు సీతాన్వేషణములో తోడ్పడగలడు".

ఈవిధముగా సుగ్రీవుని గురించి పరిచయము చేసి హనుమంతుడు శ్రీరామలక్ష్మణుల నిరువురినీ తన భుజస్కంధములపై కూర్చొనపెట్టుకొని సుగ్రీవునివద్దకు తీసుకొనివెళ్ళెను.

# సుగ్రీవునిపై అనుగ్రహము

శ్రీరామలక్ష్మణులను చూడగనే సుగ్రీవుడు ఆనందభరితుడై తన జన్మ ధన్యమైనట్లు సంతసించెను. రాముని పాదములపై పడి ప్రణామము చేసెను. రామలక్ష్మణు లిరువురు సుగ్రీవుని తమ హృదయములకు హత్తుకొనిరి. వారిమధ్య స్నేహ సౌహార్ద్ర భావనలుప్పొంగినవి.

సీతను వెదకు ప్రయత్నము చేయుమని రామలక్ష్మణులు సుగ్రీవునితో చెప్పిరి. సుగ్రీవుడు -"శ్రీరామా! ఒకసారి నేనునూ మంత్రులును సభదీర్చి కూర్చొన్న సమయమున సీతాదేవి శత్రువశమై విలపించుచూ ఆకాశమార్గమున పోవుట మాకు కనుపించినది. రామా! రామా! అని పడుచూ ఒకవస్త్రమును క్రిందపడవేసినది".

ఆ వస్త్రమును వెంటనే తెచ్చి సుగ్రీవుడు రామున కిచ్చెను. అది చూచి రాము డెంతో చింతాక్రాంతు డయ్యెను.

సుగ్రీవుడు-"శ్రీరఘువీరా! చింతింపవలదు. నేను అన్నివిధముల మీకు సేవచేయుదును. జానకీదేవి తిరిగి మీ చెంతకు చేరువరకునూ నేను మీతోనే వుందును". కృపాసాగరుడైన శ్రీరాముడు సుగ్రీవుని పలుకులకు సేవాభావమునకు సంతసించెను.

అపుడు సుగ్రీవుడు తన గాధనంతయూ శ్రీరామునకు విన్నవించెను-శ్రీరామా! నాకొక సోదరుడు గలడు. అతని పేరు వాలి. మా యిద్దరిమధ్య నసోదరభావము అపేక్షలు అపరిమితముగా వుండేవి అదిచూచి మయుడను రాక్షసుడు ఓర్వలేక మమ్ములను యుద్ధమునకు రమ్మని కాలుదువ్వెను. యుద్ధమున మా బలమును చూచి వానికి భయమువేసి ఒక పర్వతగుహలో దూరెను. వాలి మహా పట్టు

దల గల రణధీరుడు. ఏమయిననూ సరే ఆ రాక్షసుని చంపిగాని తిరిగి రానని నన్ను తిరిగి యింటికివెళ్ళి పరివారమును రాజ్యమును చూచుచుండుమని పంపించెను. పదిహేను రోజులలో తాను తిరిగి రానిచో చనిపోయితిననికూడా భావించుకొనమని చెప్పెను.

నెల రోజులవరకునూ వాలి జాడ తెలియలేదు. కాగా ఆ పర్వత గుహనుండి రక్తధార ఒకటి బయటకు వచ్చినది. ఆ దుష్ట రాక్షసుడే వాలిని చంపెనేమోనని భయం వేసినది. ఆ రాక్షసుడు తిరిగి బయటకు వచ్చుటకు వీలులేకుండునట్లు గుహ ద్వారమునకు బండరాయి అడ్డమువేసి వెనుదిరిగితిని.

వాలి లేని సమయమందు తమ రాజ్య మరాచకమగునని మంత్రు లందరనూ నన్ను రాజునుచేసిరి. కొన్నిరోజుల తరువాత మయుని చంపి వాలి క్షేమముగా తిరిగివచ్చుట జరిగినది. అపుడు నేను రాజుగా వుండుటచూచి వాలికి ఈర్ష్య కలిగినది. నేనే దుర్బుద్ధితో ఆ పర్వతగుహకు బండరాయి అడ్డువేసితిననికూడా అపోహ పడినాడు. అప్పటినుండి మా యిరువురమధ్య భేదాభిప్రాయములు కలిగినవి. వాలి తన భుజబలముతో నన్ను బెదిరించి రాజ్యమునూ చివరకు నా భార్యనుకూడా వశము చేసుకొన్నాడు" అని తన కథను క్లుప్తముగా శ్రీరామునకు చెప్పెను.

సుగ్రీవుని నిస్సహాయ పరిస్థితిచూచి శ్రీరాముడు అభయ మిచ్చెను. బ్రహ్మరుద్రాదు లడ్డము వచ్చిననూ వాలిని రక్షించలేరని చెప్పెను. తన ఒక్క బాణముతో వాలి నేల కూలునని చెప్పెను.

సుగ్రీవుడు-"ప్రభూ! వాలి మహాబలశాలి. దుందుభి అను రాక్షసుని చంపెను. తాళవృక్షములు అమాంతముగా పీకి వాటితో శత్రువులను మోదును. రామా! నా సోదరుడంటే నా కెంతో యిష్టము. కర్మవశాత్తు యిపుడు మే మిట్లు అయినాము. వానితో విరోధమనేదే నిజానికి నా కిష్టములేదు" అని చెప్పెను.

శ్రీరాముడు కోదండమును తీసుకొని బయలుదేరెను. సుగ్రీవుడు రామునివెంట తరలెను. రాముని అండ చూచుకొని సుగ్రీ

పుడు ధైర్యము కూడగట్టుకొనెను. వాలి సుగ్రీవుని చూడగనే మండిపడెను. తార వాలి భార్య. ఆమె భయపడి, రామ లక్ష్మణులు అమిత తేజోమూర్తులని వారిజోలికి పోరాదని, రాముడు యుద్ధము చేయునపుడు కాలకూట యముడని భర్తను హెచ్చరించినది.

వాలి తారతో- "పోసి! పిచ్చిదానా! శ్రీరఘురాముడు సమ దర్శి. నన్ను చంపడు, ఒకవేళ నేను రామునిచేతిలో చచ్చిననూ పుణ్యమే! అంతకన్న అదృష్టమింకేముండగలదు?" అనెను.

## వాలి సంహారము

వాలి సుగ్రీవుని చూడగనే వానిపై కురికెను. ఇరువురన్న దమ్ములు కలియబడిరి వాలి సుగ్రీవుని క్రుమ్మి గ్రుద్ది నానాహింసలు పెట్టెను. కొంతసేపయిన తరువాత సుగ్రీవుడు శ్రీరాముని వద్దకు వచ్చి—"రామా! నాకు ముందే తెలుసును. వాలి నాసోదరుడు కాడు. నాపాలిట యముడు" అని మొరపెట్టుకొనెను.

శ్రీరాముడు సుగ్రీవునిట్లు వోదార్చెను—"సుగ్రీవా భయ పడకుము. మీ ఇరువురి రూపము ఒకటే! ఎవరెవరరో తెలిసికొనుట కష్టమైనది అందుచేత నేను వాలిమీద బాణమువేయలేదు" అనుచూ శ్రీరాముడు వాని శరీరము నిమిరెను. శ్రీరాముని స్పర్శతో సుగ్రీ వుని గాయములన్నియూ క్షణములో మానిపోయినవి వాని శరీరము వజ్రమువలె కఠోరముగా అయినది. అపుడు గుర్తు కొరకు శ్రీరాముడు సుగ్రీవుని మెడలో పూలమాల వేసెను. ఎంతోధైర్యము చెప్పెను.

## చెట్టు చాటున దాగి

ఈసారి సుగ్రీవుడు మరింత ధైర్యముతో వాలిమీద కలియ బడెను. వాలి-సుగ్రీవు లిరువురికి హోరాహోరి పోరాటము జరిగినది. శ్రీరాముడు చెట్టు చాటునుండి వాలిమీద బాణము వేసెను. ఆ బాణము వాలి గుండెలో గ్రుచ్చుకొన్నది. వెంటనే వాలి నేలమీద

పడెను. రాముడకు మనస్సులోనే నమస్కరించుకొనెను. ప్రభువు శ్రీరాముని కనులారా చూచినందుకు అపరిమిత ఆనందభరితు డయ్యెను. వాని హృదయము రామునియందు ప్రీతితో నిండిపోయి నది. కాని రాముడిట్లు చేసినందులకు కష్టమువేసి వాలి—"శ్రీరఘు నందనా! నన్నెందుకిట్లు చెట్టు చాటునుండి కొట్టిరి? వ్యాఘ్రముమీద వేసినట్లు బాణము వేసిరి! మీరు సమదర్శి యందురుగదా! సుగ్రీవుడు హితుడునూ నేను అహితుడనా మీకు" అనెను.

శ్రీరాముడు—"మూర్ఖుడా! తమ్ముని భార్య, సోదరి, కోడలు, కూతురు, వీరు నలుగురునూ సమానులు. వీరిని కుదృష్టితో చూచిన వారిని చంపిననూ పాపములేదు. నీవు అహంకారివి! నేను సుగ్రీవు నకు అండగా నిలిచితినని ఎరిగికూడా నీవు వానిమీద కలియబడితివి!"

వాలి—శ్రీరఘునందనా! అంత్యకాలములో మీశరణుపొందిన నేను యింకనూ పాపినేనా? కృపానిధానా! రామా! జన్మంతయు సాధనచేసిన మునులుకూడా అంత్యదశలో 'శ్రీరామా' అను వాక్కు రాక చింతించుదురు. అటువంటిది. పరమపదము నిచ్చు శ్రీ వైకుంఠ పురవాసుడు నా ఎదురుగా వున్నపుడు నా ప్రాణములు పోవుట యనునది నా భాగ్యమేగదా! మనస్సును జయించి, విషయ వాసన లను అదుపులో పెట్టుకొను ఋషులకు కూడా ఒక్క క్షణకాలము మీదర్శనము దుర్లభము, దుస్తరము. అంతటి ప్రభువు సాక్షాత్కరించి నా ఎదుట నిలచెను!"

ఇట్లు పలుకుచున్న వాలి కన్నులలో నీరు నిండినది. దయ నీయమైన వాలి పలుకులు విని శ్రీరాముని హృదయము కరిగిపోయి నది. శ్రీరాముడు వాలి తల, వళ్లు నిమిరెను.—"వాలీ! నీ యీ శరీరము నశించిపోకుండ శాశ్వతముగా నుంచుకొనవలెనని కోరిక గలదా?" యని అడిగెను.

వాలి—"శ్రీరామా! శాశ్వతమగు మీధామము వదలుకొని పాపభూయిష్టమగు ఈ శరీరమును నేను కోరుకొనను. ఆ కోరిక నా కెన్నడునూ లేదు. ప్రభూ! నాయందు కృపగలవారై నాకోరిక

ఒకక్కటి మాత్రము మన్నించుడు. కర్మవశాత్తు నేను మరల జన్మ ఎత్తవలసి వచ్చినచో మీయందు అనన్య భక్తి ప్రేమా నాకు కలుగు నట్లు దయచూడ కోరెదను. నాపుత్రుడు అంగదుడు-వానిని మీ దాసునిగా చేర్చుకొనుడు"అనుచూ శ్రీరాముని చరణముల యందు దృష్టినిలిపి వాలి ప్రాణములు వదలెను.

శ్రీరాముడు వాలిని తన పరంధామమునకు చేర్చెను. వాలి మరణమునకు తార ఎంతో విలపించినది. ఆమెకు శ్రీరాముడు జ్ఞాన బోధ చేసెను. పృథ్వి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము ఈ పంచ భూతములతో నిర్మితమైన దేహము కాలము పూర్తికాగానే నశించక తప్పదు. కాని జీవుడు నిత్యుడు. నిత్యము అనిత్యమైన వస్తువుల వివేకమెరిగిన వారలకు దుఃఖము వుండదు.

జ్ఞానోదయ మవగానే తారకు అజ్ఞానము, మాయతెర తొలగి శ్రీరాముని చరణ కమలములకు ప్రణమిల్లి తనకు పరమ భక్తిని ప్రసాదింపుమని వేడుకొన్నది.

# ఎచ్చట సీతమ్మ తల్లి?

శ్రీరామ లక్ష్మణులిరువురు సుగ్రీవుని వానర రాజుగా చేసిరి. అంగదుని యువరాజుగా నియమించిరి. రామలక్ష్మణులిరువురు తమ వనవాస గడువు పూర్తియగువరకు అచటనే ఒక పర్వతముమీద నివసించుటకు నిశ్చయించుకొనిరి. సుగ్రీవునితో సీతాన్వేషణ విషయము అశ్రద్ధ చేయవలదని చెప్పిరి.

సుగ్రీవుడు సుఖముగా రాజ్యమేలుకొనుచుండెను. ఋతుచక్రము గిర్రున తిరిగినది. అన్ని ఋతువులలోను శ్రీరాముడు సీతకొరకు ఆలోచించుచూ, చింతించుచూ గడిపెను. కాని సుగ్రీవుని దగ్గరనుంచి సీత జాడ తెలిసినట్లు కబురు రాలేదు. సుగ్రీవుడు సురక్షితమగు రాజ్యము, స్త్రీ అన్నియు పొందెనుగనుక తనను గురించి విస్మరించి వుండవచ్చునని రాముడనుకొనెను. విచారమగ్నమగు రాముని చూచి లక్ష్మణుడు ఉగ్రుడై సుగ్రీవుని వెంటనే పరిమార్చెదనని బయలుదేరెను. దయాసముద్రుడగు శ్రీరాముడు లక్ష్మణుని సమాధానపరచెను.

హనుమంతుడు సామ దాన భేద దండోపాయములన్నియూ ఉపయోగించి సుగ్రీవుని రామకార్యమునకు పురికొలిపెను. సుగ్రీవుడపుడు భయపడి విషయవాసనలు తనను జ్ఞానహీనుని చేసినవనీ, రామకార్యమశ్రద్ధ చేసితిననీ వాపోయెను. వానరయూథమునంతనూ ఒకచోట సంఘటితపరచమని హనుమంతునితో చెప్పెను.

సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, వానరయూథమంతయూ కలిసి శ్రీరాముడున్నచోటుకు వెళ్ళిరి. సుగ్రీవుడు శ్రీరా

ముని పాదములమీద పడి-"ప్రభూ! మీరు రచించిన మాయ నన్నావరించినది. అది అత్యంత ప్రబలమయినది. మీ దయలేనిదే మాయ తొలగదు. నేనొక విషయ జీవుడను. విషయవాసన అంత ముదమును యింకేవియూ నాకు కలిగించలేవు. ప్రభూ! నేను పామరుడను! కోతిని!"

ప్రభువు రామచంద్రుడు సుగ్రీవుని సమాధానపరచి వెంటనే సీతాన్వేషణము చేయుమని చెప్పెను. వానరులందరునూ రాముని చుట్టూ మూగి రామదర్శనము చేసుకొని చరితార్థులయిరి.

సుగ్రీవుడు వానర యోధుల నందరిని నలుదిశలకూ వెళ్ళి సీత జాడ తెలిసికొని రమ్మని పురమాయించెను. ఒక నెల గడువులోపల వెదకనిచో మరణదండన విధించుదునని ఆజ్ఞాపించెను.

హనుమంతునీ, అంగదునీ, జాంబవంతునీ రామకార్యార్థము దక్షిణదిశకు వెళ్ళమని చెప్పెను. సుగ్రీవుని ఆజ్ఞానుసారము వానర వీరులందరునూ అన్ని వైపులకు బయలుదేరిరి. శ్రీరాముడు తన కర కమలములతో హనుమంతుని నిమిరెను. తన వ్రేలి వుంగరము తీసి హనుమంతుని కిచ్చెను. సీతతో తన బలము, బలగము గురించి చెప్పి ఆమెను ధైర్యముగా వుండమనీ, తన ప్రేమను, విరహమునూ తెలియజేయమనియు కూడా చెప్పెను.

హనుమంతుడు శ్రీరాముని సుందరమూర్తిని హృదయములో బంధించి బయలుదేరెను. ప్రభువు సర్వాంతర్యామి. సామాన్య మానవునివలె రాజనీతి ననుసరించుచు చరిత్ర నడుపుచుండెను.

వానరులందరునూ నదులు, సరస్సులు, గుహలు గాలించుచుండిరి. అందరి మనసు, శ్రీరామ కార్యమందు నిమగ్నమయి

యున్నది. శరీరశ్రమ ఎవ్వరికీ తెలియుటలేదు. మార్గమధ్యమున కన బడు రాక్షసుల నందరినీ హతమార్చుచుండిరి. ఋషులు, మునులు, కనుపించినచో సీత జాడ తెలియునేమోయని ఒక్కుమ్మడిగా గుమి గూడి యడుగుచుండిరి.

దక్షిణదిశకు పోయిన హనుమంతుని యూథము దాహము వేసి ఒక పర్వతగుహావద్దకు వెళ్ళిరి. వారికి పర్వతముమీద కొంగలు, హంసలు కనుపించినవి. అందుచే అచట నీరు దొరుకునను ఆశచే క్రిందికి దిగిరి.

# స్వయంప్రభ-శంపాతి

తపోమూర్తి స్వయంప్రభ ఒక చక్కని సరస్సు ప్రక్కన మందిర మేర్పరుచుకొని నివసించుచున్నది. అచట ఒక వుద్యాన వనము వున్నది. స్వయంప్రభ దూరమునుండే శ్రీరామ దూతలను చూచినది. వారు ఆమెకు నమస్కరించిరి. మంచిమంచి పండ్లు, ఫల ములు యిచ్చి వానరవీరులకు ఆకలిదప్పులు తీర్చినది.

ఆమె అనుజ్ఞ తీసుకొని వారందరునూ సరస్సునందు స్నానము చేసి తాము సీతాన్వేషణముకొరకు వచ్చితిమని ఆమెతో చెప్పిరి. ఆమె సీత జాడ త్వరలో తెలియుననీ, నిరాశ చెందవలదనీ చెప్పి తన తపోబలముతో వారి నందరినీ ఒక్క క్షణములో దక్షిణమున సముద్ర తీరమున చేర్చినది. ఆ తరువాత స్వయంప్రభ శ్రీరాముని దర్శనార్థము రాముని సన్నిధానమునకు వెళ్ళిపోయినది.

*　　　*　　　*

సుగ్రీవుడిచ్చిన నెల గడువు పూర్తి యగుచున్నది. సీత జాడ తెలియలేదు. అంగదుని కన్నులలో నీరు నిండినది. వానరులందరునూ భయపడసాగిరి. వానరవీరులందరు చింతాక్రాంతులై వుండటం జాంబవంతుడు చూచి-"శ్రీరాముడు నిర్గుణబ్రహ్మము. సామాన్య మానవుడు కాడు. అజేయుడు, అజన్ముడు. రామునియందు ప్రీతి కలిగియున్న మనమందరమూ అదృష్టవంతులము. దేవతలు, భూదేవి, గోవుల హితము కోరి రాము డవతరించెను. సగుణోపాసకులంద రునూ శ్రీరాముని సేవలో నిమగ్నులై యున్న యింకేమికావలెను?" అనెను.

## దారి చూపిన శంపాతి

జాంబవంతుని భక్తియుతమగు పలుకులు విని గుహలోనుండి శంపాతి బయటకు వచ్చెను. ఆ ముదుసలి గ్రద్దను చూచి వారందరునూ జటాయువును జ్ఞాపకము చేసుకొనిరి. జటాయువంత ధన్యజీవి మరొకరుండరనుకొనిరి. అది శ్రీరామ కార్యములో తనువు చాలించినది. ఆ అదృష్టము దానికి దక్కినది. పరంధామము చేరుకొన్నది.

శంపాతి వానర వీరులను నిర్భయముగా నుండమని చెప్పి తన సోదరుడు జటాయువును గురించి అడిగి మరికొన్ని వివరములు తెలిసికొన్నది. వారులు జటాయువు శ్రీరామునకు చేసిన సేవను వేయినోళ్ళ పొగడిరి. శంపాతి జటాయువుకు తిలాంజలి ఘటించి తన రెక్కలు మాడిపోవుటకు కారణము తన అహంకారమేననీ, సూర్య తేజస్సుకు తన అంగహీనత ఏర్పడినదని చెప్పినది. తన గాథ నంతయు వానరులకు యింకా ఈవిధముగా విన్నవించినది. చంద్రముని యను ఋషి నాకిట్లు చెప్పెను "త్రేతాయుగమున సాక్షాత్తు పరబ్రహ్మమే మనుష శరీరము ధరించును అతనిభార్యను రాక్షసులు ఎత్తుకొని పోవుదురు. ఆమెను వెదకుటకు ప్రభువు దూతలను పంపించును. వారిని చూడగానే నీకు మరల రెక్కలు వచ్చును. చింతించవలదు. సీతాదేవిని వారికి చూపించగలవు!"

ఈపై కథ నంతనూ శంపాతి వానరులకు వినిపించి సీత జాడ ఈవిధముగా తెలిపినది—"త్రికూట పర్వతముమీద లంకయున్నది. రావణాసురుడు రాజ్యమేలుచున్నాడు. సీతను అపహరించి తెచ్చి అతడే అశోకవనములో వుంచెను. ఆమె శ్రీరాముని కొరకు అహర్నిశలు విలపించుచున్నది. నాకున్న దివ్యదృష్టితో ఆమెనుచూచితిని. నేను ముసలిదానను. లేకున్న నూరుయోజనములు ఒక లెక్కలోనిది కాదు.

మీలో ఎవరైన నూరుయోజనములు దూక గలిగినచో శ్రీరామ కార్యము నెరవేర్చ గలరు. రాముని కృపవలన నాకు

తిరిగి రెక్కలు శక్తి వచ్చుచున్నవి. రామ నామ మహిమ వర్ణించలేము. పాపికూడా పావనుడగును మీరు రామదూతలు. రాముని స్మరించి సముద్రము లంఘించి లంకకుచేరు ఉపాయ మాలోచింపుడు."

ఇట్లు పలుకుచూ శంపాతి ఎగిరిపోయినది. వానర యోధులు విస్మయ విభ్రాంతులయిరి.

# ఎందుకోసం? ఎవరికోసం

**ఆచార్య బిరుదురాజు రామరాజు**

వేదాలు ప్రస్థానత్రయం తరువాత రామాయణ భారత భాగవతాలే భారతీయులందరికీ ఆరాధ్యగ్రంథాలు. ఇది చదువుకొన్న శిష్టుల విషయం. కాని చదువుసంధ్యలు రాని జానపదులకు మాత్రం ఈ మూడు ఇతిహాస పురాణాలే పరమ ప్రామాణికాలు; ఇహపర సాధకాలు. ఈ మూటిలో కూడా రామాయణం పరమారాధ్యము. పరమోపాధేయము. రామాయణమొక్కటే ఇంత ప్రశస్తి పొందటానికి కారణమేమైయుంటుంది? భగవంతుని అవతారాలు లీలలు వర్ణించే మరెన్నో గ్రంథాలున్నా రామాయణంవలె హృదయానికి పట్టవెందుకు? రాముడు దేవుడైనా మానవునివలె ప్రవర్తించటమే దీనికి కారణం. సీతారాములవంటి దంపతులు, రామసోదరులవంటి అన్నదమ్ములు, కౌసల్యాదశరథులవంటి తలిదండ్రులు, కైకేయీ సుమిత్రలవంటి సవతితల్లులు, సుగ్రీవ విభీషణులవంటి స్నేహితులు, హనుమవంటి బంటు, చివరకు రావణాసురునివంటి పగవాడు-మనకు మరే గ్రంథంలోను ఏ సాహిత్యంలోను తారసిల్లరు. అంత సహజంగా అంత ఉదాత్తంగా అంత ఆదర్శవంతంగా ఉన్నవాళ్ళ చరిత్రను సమకాలీనుడైన వాల్మీకి మహర్షి అతిశయోక్తులు లేకుండా ఉన్నదున్నట్లుగా బ్రహ్మ ఆదేశం ప్రకారం చెప్పినాడు. ఎందుకోసం చెప్పినాడు? ఎవరికోసం చెప్పినాడు? సమస్త కాలాలకు సమస్త లోకాలకు చెప్పినాడు. తాను చెప్పిన నిజమైన చరిత్రమీద ఆ మహర్షికున్న ప్రత్యయం ఎటువంటిదనుకున్నారు?

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి".

(సుందరకాండ)

# పవనసుతుని ప్రయాణం

హనుమంతుడు శ్రీరామదూత. అతులిత బలశాలి. రామ కార్యార్థము సముద్రము దాటు ప్రయత్నములో నున్నాడు. రామ నామ స్మరణ చేయుచు తన బరువును పెంచుకొనెను. ఆ బరువుకు పర్వతములు పాతాళమునకు క్రుంగిపోసాగినవి.

పవనపుత్రుడు పయనించి లంకకు వెళ్ళుట దేవతలు చూచి సంతసించిరి. వాని కార్యదీక్షను పరీక్షించుటకు 'సరస' యను పెద్ద సర్పమును వానియొద్దకు పంపిరి. అది ఆంజనేయుని మ్రింగవలెనని ప్రయత్నించినది. అతడు తాను సీతను వెదకు ప్రయత్నములో వెళ్ళు చుంటిననీ, తిరిగి రామదర్శనము చేసుకొని ఆమె జాడ వారికి తెలిపి తాను వచ్చెదననీ అపుడు స్వయముగా తానే ఆ సర్పమునకు ఆహార మగుదుననీ చెప్పెను. అది నమ్మలేదు. అపుడు హనుమంతుడు తన శక్తిని ప్రయోగించి సరస కంటెనూ నూరురెట్లు తన శరీరమును పెంచెను. అది చూచి సరస హనుమంతుని దీక్షను, బుద్ధిబలమును పరీక్షించుటకు తాను వచ్చితిననీ, సఫలముగా రామకార్యము నెర వేర్చుకొని రమ్మనీ ఆశీర్వదించి వెళ్ళిపోయినది.

సముద్రము దాటునపుడుగూడ హనుమంతుడు విపత్తుల నెదుర్కొనవలసివచ్చెను. సముద్రములో ఒక రాక్షసి వున్నది. అది తనఆసురీమాయలతో ఆకాశమునఎగురువారందరినీ వారినీడపట్టుకొని క్రిందికి లాగుచుండును. హనుమంతునిమీదకూడా ఆ మాయను అది ప్రయోగించినది. ఆ రాక్షసిని హతమార్చి అతడు సముద్రము

దాటెను. శ్రీరాముని మహిమతో ఆంజనేయుడు కాలయముని కూడా మ్రింగివేయగల బలశాలి యయ్యెను.

పర్వతముపై దనుండి హనుమంతుడు లంకనుచూచెను లంకా నగర వైభవము ఇంతా అంతా నని వర్ణింప తరము గాకుండా వున్నది. కోటిమంది యోధులు లంకను కాపలా కాయుచుండిరి. రాక్షస సైన్య మెంత యున్నదో ఒక్కసారి కలియచూడగనే హను మంతునికి తెలిసిపోయినది.

హనుమంతుడు అతి సూక్ష్మశరీరము ధరించి లంకలో ప్రవే శించుటకు ప్రయత్నించెను. నగర సింహద్వారమువద్ద కాపలా కాయుచున్న లంకిణి హనుమంతుని జాడ పసిగట్టి వానిని లోపలికి పోనియకుండ అడ్డు తగిలినది. హనుమంతుడు శరీరమును పెంచి ఒక్క గ్రుద్దు గ్రుద్దెను. దానితో అది నేలమీద పడెను. రామ దూత చేతిలో తాను దెబ్బతినుట లంకానగర వినాశనమునకు నాంది యని నమ్మి శ్రీరామ కార్యము నెరవేరుగాక అని పలికినది.

## లంకలో రామ నామం

హనుమంతుడు తిరిగి సూక్ష్మ శరీరము ధరించి లంకానగర రాజసౌధము లన్నియూ సీతకొరకు గాలించెను. ఒకచోట విభీష ణుడు రామ నామస్మరణ చేయుచూ కనుపించెను. అతడు భగవం తుని భక్తునివలె కనుపించుచున్నాడు సీత జాడ తెలుపగలడని హను మంతున కనిపించినది.

విభీషణుడు..."పవనపుత్రా! నేను తామస శరీరము ధరించిన వాడను. రాక్షస శరీరము నాది. భగవంతుని స్మరించు అర్హత నాకు లేదు. మోక్షసాధన చేయలేక పోవుచుంటినని చింతించు చుంటిని. శ్రీహరి కృపలేనిదే మీవంటి సత్పురుషులను సందర్శించు అదృష్టము దక్కదు."

భగవన్నామము గురించి అతడు పలుకుట తోడనే ఆంజనే యుని కన్నులలో ఆనందాశ్రువులు నిండినవి. భగవంతుని దయా

రసము, కరుణ తలచుకొని ఇరువురు రామ భక్తులునూ అనిర్వచనీయ మైన ఆనందము పొందిరి.

విభీషణుడు సీతను ఎట్లు చూడవచ్చునో ఉపాయమాలోచించి హనుమంతునితో చెప్పెను. హనుమంతుడు తిరిగి సూక్ష్మరూపు ధరించి అశోకవనమున ప్రవేశించెను. అచట సీతను చూడగనే మన స్సునందే నమస్కరించెను. ఆమె మనస్సు శ్రీరాముని యందు లగ్నమై యున్నది. రాముని కొరకు చింతించుచుచూ విలపించుచూ కూర్చొనివున్న సీతను చూచి హనుమంతునకు దుఃఖము వచ్చినది.

అదేసమయమున రావణాసురుడు కొంతమంది రాక్షసస్త్రీలనూ మండోదరిని వెంటబెట్టుకొని అచటికి వచ్చెను. సామ దాన భేద దండోపాయముల నుపయోగించి సీతను వశమొనరించు కొనుటకు ప్రయత్నించెను. ఒక్కసారి సీత తనవంక చూచిన చాలును. మండోదరినీ, మరెందరినో సీతకు దాసీలుగా చేసెదనని పలికెను. కోసలాధీశుని స్మరించుచూ సీత ఒక గడ్డిపోచ నడ్డము పెట్టుకుని యిట్లనెను-"దశముఖా! మిణుగురు పురుగు కాంతికి కమలమెక్కడైన వికసించునా? శ్రీరఘువీరుని బాణమును గురించి నీకింకనూ తెలి యక పోవచ్చును. అధముడా! ఆ బాణమెంతో తీక్షణమైనది. దానికి నీవు గురికాక తప్పదు నేను వంటరిగా నున్న సమయమున నన్నప హరించుకొని తీసుకు వచ్చితివి. నీకు సిగ్గులేదు."

మండోదరి సీతను నిర్బంధించ వలదని రావణాసురుని వేడు కొన్నది. సీత తన వశమవక పోవుట రావణుడు భరించలేక అహం కార పూరితుడై ఆమెను చంపుటకుద్యుక్తు డయ్యెను. అక్కడ చేరిన రాక్షస స్త్రీలందరూ అనేక చెడు వేషములు వేసుకొని సీతను భయపెట్ట సాగిరి.

వారిలో త్రిజట యను రాక్షసికూడా కలదు. ఆమెకు శ్రీరాముని పాదములయందు భక్తిగలదు. ఆరాత్రి త్రిజట ఒక కలగంటిననీ ఆకలలో ఒకకోతి లంకాపురి తగులబెట్టినట్లు, రావణుని పది తలలు ఇరవయి భుజములు నరికివేయ బడినట్లు, లంకానగర

వాసులందరూ శ్రీరాముని అఖండకీర్తిని శ్లాఘించుచున్నట్లు, విభీష ణుడు లంకకు రాజైనట్లు కలగన్నానని చెప్పినది. అందుచే సీతను కష్టపెట్ట వద్దని తోటి రాక్షస స్త్రీలతో చెప్పినది.

## అంగుళీ ప్రదానం

సీత క్షణమొక యుగముగా గడుపుట హనుమంతుడు గ్రహిం చెను అపుడు హనుమంతుడు శ్రీరాముడిచ్చిన వుంగరమును క్రింద పడవేసెను శ్రీరామ నామాంకితమై వున్న ఆ వుంగరమును చూచి సీత హర్ష విషాదములతో వ్యాకులచిత్తు రాలయినది. ఆమె మనస్సునందు ఇట్లు తలపోయసాగెను—"శ్రీరాముడు సర్వదా అజేయుడు. ఆ మహనీయుని జయించగలవారెవరు ? మాయారహి తుడు, దివ్యుడు, చిన్మయుడు. అటువంటివాడు వుంగరము వేయ లేడా?" అనుకొన్నది

హనుమంతుడు చెట్టుమీదనుండి దిగి జరిగిన వృత్తాంతము ఆమెకు తెలిపెను. అతనిని చూచి సీత ఆశ్చర్యచకితురాలయినది. హనుమంతుడు-"అమ్మా! సీతమ్మతల్లీ! నేను శ్రీరాముని దూతను. పరాత్పరుడు కరుణా నిధానుడు శ్రీరామునిమీద వొట్టు వేసుకొని చెప్పుచుంటిని. ఈ వుంగరము నేనే తెచ్చితిని శ్రీరాముడు తన గుర్తుగా యీ వుంగరము యిచ్చి పంపెను.

సీతాదేవి వానరులకు రామలక్ష్మణులకు మధ్యన స్నేహమెట్లే ర్పడినదని హనుమంతు నడిగినది. వాని సమాధానము విన్నతరువాత మనోవాక్కాయ కర్మలా అతడు శ్రీరాముని దూతయేనని నమ్మకము కలిగినది. అతడు భగవంతుని బంటు, నమ్మిన బంటు అని తెలిసి కొన్నప్పుడు ఆమె నేత్రములలో ప్రేమాశ్రువులు నిండినవి.

ప్రభువు శ్రీరాముని, లక్ష్మణుని యోగక్షేమము లడిగి తెలుసు కొన్నది. వారిరువురి క్షేమసమాచారములు తెలిపినపిదప సీత అవరి మిత మనోవ్యధ కలిగియుండుటను చూచి హనుమంతుడు వారామె కొరకు దుఃఖించుచుండిరనీ, వెదకుచుండిరనీ తెలిపెను. సీతకంటె

రెట్టింపు వియోగముతో శ్రీరాముడు వ్యధ చెందియున్నాడని చెప్పెను. శ్రీరాముడు ఈ రాక్షస సమూహామును అనాయాసముగా సంహారింపగలడనీ, ఆమె జాడ తెలిసిన తక్షణము రాముడు బయలు దేరుననీ సీతకు హనుమంతుడు ధైర్యము గొలిపెను. సీతమ్మతల్లి అనుజ్ఞ యిచ్చినచో తానే తక్షణము ఆమెను శ్రీరాముని చెంతకు చేర్చగలనని కూడా చెప్పెను. కాని శ్రీరాముడు తన కట్టి ఆదేశ మీయలేదని చెప్పెను. కావున కొన్నిరోజు లెట్లో వోర్చుకొనుమని ఆమెను వోదార్చెను.

సీతాదేవి-"పుత్రా! ఆంజనేయా! వానరులందరూ నీవలెనే యుందురేమో! వారు ఈ ఘోరరాక్షసుల నెట్లు సంహారించగలరు?" అన్న సందేహము వెలువరించెను. ఇది విని హనుమంతుడు తన దృఢకాయమును పెంచి తన శక్తిని ప్రకటన చేసెను. మేరు పర్వతా కారములో నున్న హనుమంతుని చూచిన తరువాత ఆమెకు నమ్మ కము కలిగినది. హనుమంతుడు రామ భక్తుడు. వాని తేజస్సు బలము చూచి సీతాదేవి సంతోషించినది.

హనుమంతుడు తనకు ఆకలిగా నున్నదని అచటనున్న పండ్లు ఫలములు కొన్ని తినగోరుచుంటిననీ సీత నడిగెను. శ్రీరఘునాధుని హృదయములో స్మరించి తియ్యని పండ్లు కోసుకొని తినమని చెప్పి, అచట రాక్షసయోధు లున్నారు జాగ్రత్త యని హెచ్చరించినది.

## అశోకవన వినాశనము

హనుమంతుడు సీతకు నమస్కరించి తోటలోనికి దూకెను. కడుపునిండా పండ్లుతిని చెట్లు విరచుట మొదలుపెట్టెను. రాక్షస వీరులు వానిని చూచి పోట్లాడిరి. హనుమంతుడు కలియబడి పోట్లా టకు దిగి వారిలో కొందరిని చంపెను. కొందరుపోయి రావణునితో మొరబెట్టుకొనిరి. మరికొందరు రాక్షసయోధులను రావణుడు పంపెను. ఆంజనేయుడు వారినిచూచి సింహానాదముచేసి మహాకా యము పెంచి వారిపై కురికి వారినందరినీ పరిమార్చెను. అశోకవన

ములోని చెట్లన్నియూ పీకి నానా విధ్వంసమూ చేసెను. కావలావారి నందరినీ చావమోదెను.

అపుడు రావణుడు అక్షయ కుమారుని పంపెను. అసంఖ్యాక మైన యోధాగ్రేసరుల నెందరినో వెంటబెట్టుకొని ఆతడు పవనసుతు నిపై కురికెను. అక్షయకుమారుని హతమార్చగానే వారిలో మిగిలిన వారు కొందరుపోయి ఆకోతి మామూలు కోతిమాత్రం కాదు, అతి బలశాలి అని రావణునితో మొరపెట్టుకొనిరి.

పుత్రవధవిని రావణుడు మహాకోపముతో ఆ కోతిని బంధించి తీసుకొని రమ్మని మేఘనాధుని పంపెను. ఇంద్రుని జయించగల అతు లిత బలశాలి మేఘనాధుడు. అతడు హనుమంతుని వద్దకు వెళ్లెను. హనుమంతుడు అమాంతమూ ఒక చెట్టుపీకి దానితో మేఘనాధుని మోదెను. వాని రథము విరిగి ముక్కలైనది. వారిరువురు కలియ బాదుకొను చున్నవుడు రెండు గజరాజములు కలియబడినవా అన్న ట్లుండెను. మేఘనాధుని వీపుమీద పిడుగు గుద్దులు గ్రుద్ది హనుమం తుడు చెట్టెక్కి కూర్చొనెను. మేఘనాధుడు అసురీమాయలెన్నో ప్రయోగించి చివరకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. బ్రహ్మాస్త్ర మునకు హనుమంతుడు లొంగక తప్పలేదు. అపుడు మేఘనాధుడు నాగపాశమువేసి హనుమంతుని బంధించి తీసుకొనిపోయి రావణుని వద్ద పడవేసెను.

# రావణుడు - రామదూత

ఎవరి నామమును స్మరించి జ్ఞానులు, మునులు సంసారబంధము నుండి విముక్తులగుచున్నారో అట్టి శ్రీరామచంద్రుని దూత ఒక రాక్షసుని చేతిలో బంధింపబడినాడు!

బందీకృతుడైన హనుమంతుడు రావణసభను చూచెను. ఆ ఐశ్వర్యము చెప్పనలవికాదు. దిక్పాలకులు దేవతలు చేతులు జోడించి రావణునికి నమస్కరించుచుండిరి. రావణుడు-"ఓరీ! వానరా! ఎవరి అండ చూసుకొని నీవు నా వనము నాశనము చేసితివి? నీకు భయము లేనట్లున్నది. నీ ప్రాణములయందు నీకు ప్రీతి లేదా! రాక్షసుల నెందుకు చంపితివి?"

హనుమంతుడు-"రావణా! ఎవరి అండ చూసుకొని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయములు చేయుచున్నారో, ఆది శేషువు ఈ సమస్త బ్రహ్మాండమును మోయుచున్నాడో, నీవంటి దుష్టులను శిక్షించుటకు ఎవరు నానా అవతారములు ఎత్తుచున్నారో, ఈ సకల చరాచర జగత్తునకు స్వామి ఎవరో, ఆ పరాత్పరుని, భగవంతుని, శ్రీరాముని దూతను నేను. ఆ రాముని అండ చూసుకొని నేను నీ వనము నాశనము చేసితిని. నేను కోతిని గనుక కడుపు నిండుగా పండ్లు తిని, నా స్వభావ లక్షణము ప్రకారము కొమ్మలు విరుచుచుంటిని. నీవారు నామీద కెగబడిరి. ఆత్మరక్షణకొరకు చెట్లు పీకి వారిని చావమోదితిని, అందులో కొందరు చచ్చిరి!

"రావణా! ఇప్పటికైననూ నీ అహంకారమును వదలుకొని, నీ వంశక్షేమమును గురించి ఆలోచించుకొనుము. రామభద్రునితో నీకు విరోధము తగదు. జానకీదేవిని విడిచిపెట్టుము. శ్రీరాముడు

దయాసముద్రుడు. శరణాగత వత్సలుడు. నీవు వారిని శరణు వేడిన నీ అపరాధములను మన్నించి నిన్ను రక్షించును. అపుడు నీవు అచంచలముగా, అఖండముగా, లంకారాజ్యము నేలుకొనగలవు. పులస్త్య ఋషివంశము పూర్ణచంద్రునివంటిది. ఆ వంశమునకు నీవు కళంకము తేవలదు.

"రావణా! శ్రీరామునకు ద్రోహము తలబెట్టినవారిని రక్షించువారెవరునూ వుండరు. నీవు దురహంకారివి!" అనెను. దుష్ట రావణునికి ఈ హితవచనము లేవియూ రుచించలేదు.

రావణుడు-"ఈ కోతి నాకు గురువుగారివలె హితబోధలు చేయుచున్నది ఈ మూర్ఖుని చంపు"డని ఆదేశించుచూ అట్టహాసముగా నవ్వెను.

ఆ సమయమున విభీషణుడు అచటికి వచ్చెను. "దూతను వధించుట ధర్మముకాదు. మీకు తోచిన చిన్న దండన విధించి వానిని విడిచిపెట్టుట మంచిదని" సలహా చెప్పెను. ఎట్లో ఈ సలహా రావణునకు కూడా నచ్చినది.

రావణుడు-"ఈ కోతికి అంగభంగము చేయుడు. కోతులకు తోకయందు ఎక్కువ ప్రీతి. కనుక తోకకు నిప్పు అంటించిన చాలును! అపుడు ఈ తోకలేని కోతి తన స్వామియొద్దకు పోయి ఆ మూర్ఖుని వెంటబెట్టుకొనివచ్చును. అతని సామర్థ్యము నేను చూచెదను" అనుచు సవాలు చేసెను.

హనుమంతుని తోకకు నిప్పు అంటించుటకు రాక్షసమూక అందరునూ చేరిరి. పెద్దపెద్ద గుడ్డలు నూనెలో ముంచి చుట్టుట మొదలుపెట్టిరి. ఎని గుడ్డలూ ఎంత నూనెయూ చాలుటలేదు! హనుమంతుడు తన విరాట్ శక్తితో తోకను పెద్దది చేసెను. అగ్ని ముట్టించిన తరువాత రాక్షసులందరునూ సంతోషములో గంతులు వేసిరి.

## లంకకు చిచ్చు

హనుమంతుడు తనను బంధించిన పాశములన్నిటిని త్రెంచు కొనెను. రావణుని బంగారు సౌధముమీది కెగిరి కూర్చొనెను. వానిని చూసి రాక్షసులందరునూ భయభ్రాంతులైరి. భగవంతుని ప్రేరణ వలన ఆ సమయములో నలభైతొమ్మిది పవనములు ఒక్కసారిగా వీచినవి. హనుమంతుడు విశాలకాయుడై గర్జించుచూ ఆకసములోని కెగిరెను. అపుడు అసంఖ్యాకములైన నిప్పుకణములు రాలినవి. లంక లోని ప్రతి యిల్లు కాలి భస్మమయినది.

ఆ దహనకాండ చూచి రాక్షసులందరునూ భయభీతులై ఆర్త నాదము చేసిరి. లంకానగరము భస్మమయినది. ఎవరు అగ్నిని స్పష్టిం చిరో ఆ పరాత్పరుని దూత హనుమంతుడు. అందుచేత అగ్ని హను మంతు నేమియు చేయలేదు. ఒక్క విభీషణుని యిల్లు తప్పించి లంక నంతయూ కాల్చివేసిన తరువాత హనుమంతుడు సముద్రము లోనికురికెను. తోక చల్లార్చుకొని అలసట తీర్చుకొనెను.

సీతాదేవి వద్దకు వెళ్ళి ఆమె ఆనవాలుగా ఏదైనా శ్రీరాముని కిమ్మని అడిగెను. ఆమె చూడామణి తీసి అంజనేయున కిచ్చినది. ఒక నెల గడువులోపల శ్రీరాముడు రానిచో తనను ప్రాణములతో చూడ జాలరని, తన వేదననూ యిక్కట్లనూ, రామునికి నివేదించమనీ చెప్పినది.

హనుమంతుడు అనేక విధముల ఆమెకు ధైర్యముచెప్పి నమ స్కరించి ఆమె అనుజ్ఞ తీసుకొని తిరుగు ప్రయాణమునకు బయలు దేరెను. పవనసుతుడు పయనించు సమయమున సంతోషముగా గర్జించెను. ఆ భీషణధ్వనికి రాక్షసస్త్రీలకు గర్భస్రావములు కలిగి నవి ! సముద్రము లంఘించి అంజనేయుడు అవతలివొడ్డుకు చేరెను.

# 'కనుగొంటిని సీతమ్మను'

శ్రీరామలక్ష్మణు లిరువురు ఒక శిలావేదికపై కూర్చొనిరి. సీత జాడ తెలియలేదు. చింతాక్రాంతులైన అన్నదమ్ము లిరువురు దక్షిణదిశనుండి తిరిగి వచ్చుచున్న వానరయోధులు సంతోషముగా జయధ్వానములు చేయుట చూచిరి. శ్రీరాముడు ఎంతో వాత్సల్యముతో వారి నందరినీ ఆదరించెను. ఆలింగనము చేసుకొనెను. వారు రాముని పాదములకు సాష్టాంగప్రణామము చేసిరి. రాముడు వారి కుశలమడిగెను.

జాంబవంతుడు— "ప్రభూ! ఎవరిమీద మీకు దయ కలుగునో వారు నిరంతరము కుశలముగానే యుందురు. వారికి సదా శుభమే కలుగును. మీ కృపవలన మా కృషి ఫలించినది. మా జన్మ సఫలమయినది. పవనకుమారుడు సాధించుకొనివచ్చిన రామకార్యము వేయినోళ్ళ కొనియాడిననూ తీరదు" అని హనుమంతుడు సాధించిన ఘనవిజయమును సంతోషముతో శ్రీరామునికి విన్నవించెను.

శ్రీరాముడు- "ఆంజనేయా! సీత ఎట్లున్నది? తన ప్రాణముల నెట్లు కాపాడుకొనుచున్నది?" అని అడిగెను.

ఆంజనేయుడు- "రామా! రాఘవా! మీ నామమే ఆమెకు రక్ష! ఆ స్మరణమే రాత్రింబవళ్లు ఆమెను కాపాడుచున్నది. ఆ ధ్యానమే ఆమెకు చుట్టుప్రాకారములు. మీ రూపమే ఆమె హృదయములో అంకితమైయున్నది. ఈ చూడామణి ఆమె గుర్తుగా మీ కీయమని చెప్పినది" అని చూడామణి శ్రీరామున కందించెను.

శ్రీరాముడు చూడామణి నందుకొని హృదయమునకు హత్తుకొనెను. కమలనయనుని కనులు సజలమయినవి. సీతాదేవి పడుచున్న కష్టములు, వేదన వివరముగా హనుమంతుడు రామునకు విన్నవించెను.

సమస్తలోకములకు ప్రభువైన శ్రీరాముడు, హనుమంతుని వంటి హితుడు తనకు లోకములో లేడని మాటి మటికీ కృతజ్ఞత తెలిపెను. భగవంతుని పలుకులు విని హనుమంతుని కన్నులలో ప్రేమాశ్రువులు నిండినవి— "రామా! నన్ననుగ్రహించి రక్షింపుడు" అనుచూ రాముని పాదములపై బడి అశ్లేయుండెను.

# లంకపైకి దండయాత్ర

భగవంతుడు రావణ సంహారము, రాక్షస సంహారము చేయు ప్రయత్నములో వున్నాడని ఎరిగి దేవతలు పువ్వులు జల్లిరి.

సుగ్రీవుడు వానర భల్లూక సైన్యములు తయారుచేసెను. వారందరునూ గుంపులు గుంపులుగా గుమిగూడిరి. శ్రీరాముడు ఆ సైన్యమునంతనూ దృష్టి సారించి ఒక్కసారి చూచెను. రాముని కృపాకటాక్షముతో వారందరును అతులిత శక్తి శాలురయిరి. పర్వతసములైరి. అందరునూ ముందుకు సాగవలసినదిగా శ్రీరాముడాదేశించెను.

వానర భల్లూక సైన్యమంతయు బయలుదేరినది. ఆదృశ్యము నెవరు వర్ణించగలరు? సంతోషముతో వారందరునూ గర్జించిరి. భయంకరమగు వారి గర్జన విని దిగ్గజములే చలించినవి. భూమి కంపించినది. పర్వతములు ఊగిసలాడినవి. సముద్రము ఉత్తాలత మొందినది. కోటానుకోట్ల వానరయోధులు ముందుకు సాగిరి.

కృపానిధానుడు శ్రీరాముడు వారందరితో కలిసి సముద్ర తీరము చేరెను. హనుమంతుడు లంకను తగులబెట్టిన నాటినుండి రాక్షసు లందరునూ భయ భీతులయిరి. శ్రీరామ దూతకే అంత అతులితమైన శక్తి యున్నపుడు ఇక రామున కెంతశక్తి యుండవలెను? వారి యూహా కందుటలేదు. లంకానగర స్థితిచూచి మండోదరి వ్యాకులపడినది.

మండోదరి రావణునితో—"ప్రియతమా! శ్రీహరితో విరోధము తగదు. నామాటవిని వైదేహిని రామునియొద్దకు వెంటనే పంపివేయుడు. పంపనిచో సీత మీకులమును తుదముట్టించును. శ్రీరా

ముని బాణములు సర్ప సమూహముల వంటివి. ఈ రాక్షసులంద రునూ ఆ బాణ సర్పములకు బలియయి తీరవలసినదే!"

మూర్ఖుడూ అహంకారీ యయిన రావణుడు—"మండోదరీ! మానసికముగా నీవు బలహీనురాలవు. భయపడకుము. ఒకవేళ వానరసైన్యమంతయూ కలసివచ్చినను మన రాక్షసులు వారిని చంపి తినివేయుదురు. లోకపాలకుడైన ఇంద్రుడు నన్ను చూచి భయపడును. అటువంటిది నేను ఆ వానరులచేతిలో, నరులచేతిలో వోడిపోవుదునేమోయను భయము, అనుమానము నీకు కలుగుట ఆశ్చర్యముగా నున్నది" అని పట్టమహిషికి ధైర్యము చెప్పెను.

## తమ్ముని తీపి పలుకులు

విభీషణుడు- "అన్నా! శ్రీరాముడు సైన్యసమేతముగా తరలి వచ్చుచున్నాడు. శ్రీరాముడు కేవలము మానవులకుమాత్రమే స్వామి కాదు, సమస్తలోకమునకు స్వామి అఖిలాండకోటి బ్రహ్మాండము కంతకూ అతడే అధిపతి. రాముడు గోవులను, బ్రాహ్మణులను దేవతలను రక్షించుట కవతరించెను. వేద ధర్మములు కాపాడుటకే అతడుద్భవించెను. అట్టి దేవాదిదేవునకు శిరస్సువంచి నమస్కరించుము. వారితో విరోధము తగదు. ఆ సర్వేశ్వరునకు సీతాదేవిని ఇచ్చి శరణు వేడుము. శ్రీరాముని నామము స్మరించిన తాపత్రయ ములు తొలగిపోవును. అన్నా! భగవంతుడే ఈ శ్రీరాముడని ఎరుగుము".

విభీషణుడు యీ విధముగా చెప్పుట రావణునకు నచ్చలేదు. రావణుడు-"ఓరీ! దుష్టాత్మా! ఈ జగత్తులో నేను జయించలేని యోధులెవరు? నా భుజబలము నెదిరించగలవారున్నారా? నీకు మృత్యువాసన్నమయినది. అందుచేతనే నీవు శత్రుప్రతిభను పొగడు చుంటివి." ఇట్లు పలుకుచూ రావణుడు విభీషణుని మర్దించెను. అవతలకు తీసుకొని పొమ్మని సేవకులతో చెప్పెను.

అపుడు విభీషణుడు-"శ్రీరాముని సంకల్పము మీకెవరికినీ అర్థముకాలేదు. మీరందరునూ కాలవశులై యున్నారు. నేను పోయి ఆ రామునే శరణు వేడెదను" అనుచూ విభీషణుడు అచటినుండి వెళ్ళిపోయెను. అచట వున్న రాక్షసులు రావణుడునూ అందరూ ఆయుక్షీణము పొందినట్లు అనుభూతి చెందిరి. రావణుడు వైభవ విహీనుడైనట్లు బాధపడెను.

విభీషణుడు శ్రీరాముడున్న చోటికి వచ్చెను. అతడు రావణుని ప్రత్యేక దూతయని వానరులు భావించుకొనిరి కాపలాదారు అతనిని లోనికి పోనీయలేదు. రావణుని తమ్ముడు విభీషణుడు వచ్చెనని సుగ్రీవుడు శ్రీరామునితో చెప్పెను. సుగ్రీవుడు-"ప్రభూ! రాక్షస మాయలు తెలిసికొనలేము. ఇచ్ఛానుసారముగా దేహములు మార్చు కొనగలరు. దుర్బుద్ధితో అతడు వచ్చియుండవచ్చును. అతనిని బంధించియుంచుట మంచిది" అనెను.

శ్రీరాముడు-"మిత్రమా! రాజనీతి నీకు బాగా తెలుసును. కాని శరణు జొచ్చినవారిని నేను తప్పక రక్షించి తీరుదును. భయ రహితునిగా చేయుదును". ప్రభువు పలుకులు విని హనుమంతుడు ఎంతో సంతోషించెను.

## శరణాగత రక్షణ

శ్రీరాముడు-"కోటి బ్రహ్మహత్యాపాతకములు చేసినవాడైననూ చివర కతడు హృదయ పరివర్తన చెంది నా శరణు జొచ్చిన నే నతనిని రక్షించుదును. విభీషణుడు కుబుద్ధితో ఇపుడు నావద్దకు రాలేదు. నిర్మల మనస్కులే నన్ను చూడగలరు. నన్ను చేరగలరు. ఒకవేళ రావణుడే ఇతనిని నావద్దకు పంపిననూ సరే మీరెవరునూ భయపడనవుసరములేదు. నిర్భయముగా వానిని నావద్దకు తీసుకొని రండు".

అపుడు అంగదుడు, హనుమంతుడు శ్రీరామునకు జయము పలుకుచూ వెళ్ళి విభీషణుని వెంటబెట్టుకొని సాకేత సార్వభౌముని

వద్దకు తీసుకొనివచ్చిరి. రామలక్ష్మణులను చూచి విభీషణుడు నేత్రా నందము పొందెను. శోభాధాముడైన శ్రీరాముని చూచుచూ విభీష ణుడు కన్నార్పడముకూడా మరచిపోయెను. అట్లే చూచుచుండెను. భగవంతుని విశాలభుజములు, ఎర్రకలువలవంటి నేత్రములు, శ్యామల శరీరము, విశాల వక్షస్థలము ఎంతో మనోజ్ఞముగా వుండెను. రాముని చూచుటతోడనే విభీషణుని నేత్రములలో ఆనందాశ్రువులు నిండినవి.

విభీషణుడు-"ప్రభూ! నేను రావణాసురుని తమ్ముడను. రాక్షసకులములో పుట్టినవాడను. తామసిక శరీరము. రాక్షస స్వభా వానుసారము ఎన్నో పాపములు చేసితిని. మీరు దయాసముద్రులని విని మిమ్ము చూచుటకు ధైర్యము కూడగట్టుకొని వచ్చితిని. ఈ భవ భయమును హరింపచేయు సమర్థులని ఎరిగి మీ శరణు వేడితిని. ఆశ్రిత జనరక్షకా! శ్రీరామా! నన్ను రక్షింపుము".

విభీషణుని దీనవచనములు భగవంతుని హృదయమునకు హత్తు కొన్నవి. వానిని దగ్గరకు తీసుకొని ఆలింగనము చేసుకొనెను. శ్రీరాముడు-"విభీషణా! నీ నివాసము దుష్టులతో కూడియున్నది. ఆ పరిసరములలో నీవు నమ్మిన ధర్మమును ఆచరించలేవు. నరక ములో వుండవలసివచ్చిననూ భయపడనవసరములేదుగాని దుష్టు లతో చేరియుండుట దుష్కరము".

విభీషణుడు-"శ్రీరఘునాయకా! నన్ను మీ సేవకునిగా అను గ్రహించిరి. మీ చరణారవిందములు దర్శించుకొనిన తరువాత నా భయము తీరినది. మీకు ఎవరిమీద అనుగ్రహము కలుగునో వారిని త్రివిధ తాపములూ బాధించవు. మిమ్ము కనులారా చూచు అదృ ష్టము నాకు దక్కినది. నా జన్మ ధన్యమైనది".

శ్రీరాముడు-"నన్ను శరణు జొచ్చినవారిని నేను తప్పక ఆదరింతును. అతడు దుష్టుడైననూ చివరకు హృదయ పరివర్తన చెంది నన్ను శరణు జొచ్చినచో నేనతనిని తప్పక ఆదరింతును. నీవంటి సత్పురుషులు నాకు యిష్టులు".

శ్రీరాముని ప్రియవచనములు విన్న విభీషణుని ఆనందమునకు మేరలేదు. అతడు మాటిమాటికి రాములవారి పాదములపై బడి నమస్కరించెను. శ్రీరాముడు సముద్రజలము తెప్పించి విభీషణునికి రాజ్యాభిషేకము చేసెను. శ్రీరాముని కృపాస్వభావము నెరిగి ఆకాశమునుండి దేవతలు అపారమగు పుష్పవృష్టి కురిపించిరి. వానరు లందరూ హర్షాతిరిక్తులయిరి.

# లక్ష్మణ లేఖ

అందరూ కలసి సముద్రపు వొడ్డుకుచేరిరి. వారినందరినీ సముద్ర మెట్లు దాటించవలెనా యని దర్భశయనుడై శ్రీరాము డాలోచించు చుండెను.

విభీషణుడు రావణ సభనుండి రామునివద్దకు వచ్చిననాటి నుండి కొందరు రాక్షసులు ఆసురీ మాయలతో వానరులవలె కపట వేషములు ధరించి వారి మధ్యన తిరుగుచుండిరి. శ్రీరాముని లీలలు చూచుచు యిహాపరములు మరచిరి. అపుడు వారి నిజమర్మములు బయటపడినవి. సుగ్రీవుడు వారి నందరిని తగురీతిని దండించెను.

లక్ష్మణుడు ఒక లేఖ వ్రాసి ఆ రాక్షసుల ద్వారా రావణునికి పంపెను. లేఖను తీసుకొని పోయిన రాక్షసులను చూచి రావణుడు అవహేళనగా నవ్వెను. సమాచారము లేమిటని ప్రశ్నించెను. అపుడు వారిలో శుకుడను రాక్షసుడు లేచి-"రాజా! నేను చెప్పునది సావధానముగా వినుడు. కోపగించకుడు. విభీషణుడు వెళ్ళి శ్రీరాముని దర్శించుట తోడనే వారతనికి రాజతిలకము పెట్టిరి. మేము దొంగ వేషములో తిరుగుచున్నామని తెలుసుకొని మమ్ములను ముప్పతిప్పలు పెట్టిరి."

"శ్రీరాముని సైన్యమును గురించి వేయినోళ్ళ పొగడినను చాలదు. వానరులు, భల్లూకములు, విశాలకాయులు. లంకను తగుల బెట్టి అక్షయకుమారుని హతమార్చిన హనుమంతునికంటే కోటిరెట్లు బలముగలవారా సైన్యములో వున్నారు. ద్వివిధ, మయంద, నల, నీల, అంగద, గద, వికటాస్య, దధిముఖ, కేసరి, నిశఠ, శఠ, జాంబ

వంతుడు మొదలగు వారందరునూ బలశాలులు. వారందరూ ఒక ఎత్తు సుగ్రీవుడు ఒక్కడూ ఒక ఎత్తూ. శ్రీరాముని కృపవలన వారందరునూ అతులిత బలసంపన్నులు. ముల్లోకములలోని యోధులను జయించగల వీరాగ్రేసరులు. దశముఖా! అందులో ఏ ఒక్కడునూ మిమ్ములను జయించలేనివాడు లేడు! అందరునూ మీకంటే బలవంతులుగా మాకు కనుపించిరి.

వానరులందరునూ చేరి సముద్రమును పుక్కిటపట్టెద మనుచుండిరి. లేదా పర్వతములను పెకలించుకు వచ్చి సముద్రమును పూడ్చిపార వేసెద మనుచుండిరి. రావణుని నలిపి బూడిద చేసెద మనిరి. సహజముగా వారందరునూ నిర్భయులు శ్రీరాముడు వారికి అండగా నున్నాడు.

"శ్రీరాముని బలము తేజస్సు శక్తిని గురించి ఆదిశేషువు కూడా చెప్పలేడు వారు ఒక్కబాణము విడిచిన చాలును. నూరు సముద్రములైననూ ఇంకిపోగలవు. కాని శ్రీరాముడు ధర్మ పరాయణుడు. సముద్రము నెట్లు లంఘించవలెనా యని విభీషణుని అడిగెను."

దూత పలికిన ఈ వచనములు విని రావణుడు పకపక నవ్వి- "అంతటి బుద్ధిశాలి గనుకనే వానరులను వెంటబెట్టుకొని వచ్చుచున్నాడు! శుకా! నీవు వట్టి మూర్ఖుడవు. శ్రీరాముని గురించి అసత్యమగు దంభములు పలుకుచుంటివి. విభీషణుని వంటి పిరికివానిని సలహా అడిగిన రాముడెంత గొప్పవాడో నాకు తెలుసును. వానికి విజయము విభూతి ఎట్లు కలుగును?"

దుష్ట రావణుని పలుకులు విని శుకుడు లక్ష్మణుని లేఖ వానికందించెను, అహంకారముతో రావణుడు ఆ లేఖను ఎడమచేతితో అందుకొనెను. ఒక మంత్రివర్యుని చేతికిచ్చి చదవమని ఆనతిచ్చెను.

ఆ లేఖలో యిట్లుండెను. "మూర్ఖ రావణా! అహంకారముతో నీ కులమును నాశనము చేసుకొనకుము. నీ తమ్ముని వలెనే నీవునూ శ్రీరాముని శరణు వేడుము. లేనిచో శ్రీరాముని అగ్నిబాణము నకు సకుటుంబముగా నీవు గురికావలసి యుండును."

లేఖ సమాచారము వినుటతోటనే రావణునకు లోలోపల ఎంతో భయము కలిగినది. పైకిమాత్రము చిరునవ్వు నవ్వి-"ఆ చిన్న వాని వాగ్విలాసము చూడుడు!" అనెను.

శుకుడు-"రాజా! లేఖలోని విషయములు పరమ సత్యములు. నామాట విని శ్రీరామునితో విరోధము తలపెట్టవలదు. శ్రీరాముడు సమస్త లోకములకూ స్వామి. దయాసముద్రుడు. శరణు జొచ్చిన మిమ్ము తప్పక క్షమించును. జానకీదేవిని తక్షణము శ్రీరామునకు యిచ్చివేయుడు".

ఈ మాటలు వినగానే రావణునకు పట్టరాని కోపము వచ్చెను. దండము తీసుకొని శుకుని చావబాదెను. అతడునూ విభీషణునివలె శ్రీరామునివద్దకు పోయెను. శ్రీరాముని కృపవలన శాపవిముక్తుడై రాక్షసరూపము పోయి అతడు ఒక గొప్ప మునియయ్యెను.

* * *

## సాగరుని విన్నపము

మూడు రోజులైనది. సముద్రుడు శ్రీరామునకు త్రోవ నీయ లేదు. రాముడు కోపముతో అగ్నిబాణము ఎక్కుపెట్టెను. అది చూచుటతోడనే సముద్రుని గుండెలో జ్వాల బయలుదేరినది. సము ద్రములోని జలజీవులన్నియూ వ్యాకులపడి బయటికి వచ్చినవి.

సముద్రుడు బ్రాహ్మణ రూపములో బంగారు పళ్ళెమునిండా రత్నములు నింపుకొని బయటకు వచ్చెను. శ్రీరాముని పాదములు

పట్టుకొని దండప్రణామము చేసెను. సముద్రుడు-"ప్రభూ! నా అపరాధము మన్నింపుడు. పృథ్వి, ఆకాశము, అగ్ని, వాయువు, జలము వీటి సహజనైజము జడమయము. ప్రభువు కనుసన్నలలో నడుచుకొనుటే పంచభూతములకూ శ్రేయోదాయకము".

సముద్రుని వినమ్ర వచనములు విని శ్రీరాముడు చిరునవ్వు నవ్వెను. సముద్రుడు-"శ్రీరఘునాయకా! నలుడు, నీలుడను వానరులకు ఋషీశ్వరుని వరప్రదానము గలదు. వారిచేతులతో తాకగానే కొండరాళ్ళుకూడా నీళ్ళమీద తేలును. శ్రీరామా! నా శక్త్యాను సారము నేను మీకు తోడ్పడుదును".

శ్రీరాముని చరిత్రము కలియుగములోని సమస్త పాపములనూ పోగొట్టును. సాకేత సార్వభౌముడు సుఖదాముడు.

# శ్రీమద్రామాయణము

ఆచార్య పల్లా దుర్గయ్య

"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం గిరాం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలం".

రామాయణ భారత భాగవతములు మూడును ఋషిప్రోక్తములు. ఇవి భారతీయ సంస్కృతికి మూలకందములు. ఇందు రామాయణము కావ్యము, భారత మితిహాసము, భాగవతము పురాణము. నారాయణాంశ సంభూతుడయిన వ్యాసభగవానుడు వేదములను విభజించి, పురాణములను విరచించి, పంచమవేదమయిన భారత సంహితను ప్రవచించుట సమంజసమే. కాని రామనామమునేని యుచ్చరింపనేరని కటికిబోయ "ఈమట్టినావట్టి" నాశ్రయించి సంస్మరించి తుదకు రామనామమును జపింపనేర్చి, వాల్మీకియయి దేవభాషలో రామాయణమును గానము చేయగలుగుట ఎంత విచిత్రము.

రామనామమహిమ అపారము! "రాశబ్దోచ్చారణమాత్రేణ ముఖాన్నిర్యాంతి పాతకాః" అనికదా అభియుక్తోక్తి. నిరంతర రామనామ స్మరణముచే విగతపాపుడయి పునీతుడయి జ్ఞానచక్షువయి ఆదికవి యయినాడు వాల్మీకి. ఆదికావ్యమయినది రామాయణము "మూకం కరోతి వాచాలం" అన్న ఆర్యోక్తి అన్వర్థమయినది.

సంస్కృతమున వాల్మీకి రామాయణమే రామాయణము. వ్యాసభారతమే భారతము. తెలుగులో కవిత్రయ భారతమే భారతము. బమ్మెర పోతన భాగవతమే భాగవతము. రామాయణము మాత్రము రంగనాథ రామాయణాదు లెక్కకు మిక్కిలి. అయినను తమిళమున కంబరామాయణమువలె, హిందీలో తులసీదాసు రామాయణమువలె విశేష ప్రజాదరణ పాత్రమయిన రామాయణము తెలుగులో ఏది?

## (యుద్ధ కాండ)

# సేతు బంధనము

శ్రీరామనామమే ఈ భవసాగరమును దాటించగల పెద్ద సేతువు!

శ్రీరాముడు వానరయోధులను పిలచి ఆలస్యమెందులకని త్వరగా సేతువు నిర్మింపుమని ఆదేశమిచ్చెను. సైన్యమంతయూ సురక్షితముగా అవతలివొడ్డుకు చేరవలెనుగదా! బలమైన ఎత్తైన చెట్లు చేమలు పీకితెచ్చి వంతెన స్తంభము లేర్పరచిరి. పర్వతములు, కొండ రాళ్ళు వానరులందరు అవలీలగా తెచ్చి సముద్రములో పడవేయు చుండిరి. నలుడు, నీలుడు తాకగనే అవి నీటిపైకి తేలుచుండెను. శ్రమ లేకుండా కొద్దికాలములోనే వారందరు సేతువు నిర్మించిరి.

కృపాసింధువు శ్రీరాముడచట ఒక శివలింగ ప్రతిష్ఠాపన చేయ వలెనని సంకల్పించెను. వెంటనే కొంతమంది ఋషులను, మునులను సుగ్రీవు డచటికి పిలిపించెను. వారు యథావిధిగా మంత్రపఠనము చేసిరి. శ్రీరాముడు శివలింగమును ప్రతిష్ఠించెను. శ్రీరాముడిట్లు చెప్పెను-"ఎవరు ఈ రామేశ్వరుని కభిషేకము చేయుదురో వారికి సాయుజ్యముక్తి కలుగును. నిర్మలహృదయముతో శివుని పూజించిన వారు నా సన్నిధానమునకు చేరుదురు. నాచే నెలకొల్పబడిన సేతు వును దాటినవారు సంసార సాగరమునే దాటుదురు". శ్రీరాముని పలుకులు విని అందరునూ మోదమందిరి.

శ్రీరాముడు తన సైన్యము నిర్మించిన వారధిని చూచి అత్యంత ప్రసన్నుడయ్యెను. వానరసైన్యమంతయూ అపరిమిత ఉత్సాహముతో సేతువు దాటుచుండిరి. విజయోత్సాహముతో

గర్జించిరి. శ్రీరాముడు వారధిమీదనించి విస్తారమయిన సముద్రమును చూచెను. కరుణా నిధానుడు శ్రీరాముని దర్శించుకొనుటకు సముద్రములో నున్న జలచరములన్నియూ బయటకు వచ్చినవి. మొసళ్లు, నీటిపాములు ఒక్కొకటి కొన్ని యోజనముల పొడవున్నవి. వాటి వాటికి మధ్యనగల స్వాభావిక విరోధమును మరచి ఒక్కుమ్మడిగా పైకివచ్చి శ్రీరాముని దర్శించుకొన్నవి. కోటానుకోట్ల జలజీవులు ఒక్కసారిగా పైకి తేలినపుడు నీటిపైన తెట్టు గట్టినట్లున్నది. అడుగున నీరున్నట్లే తెలియుట లేదు.

శ్రీరాముని ఆదేశానుసారము అసంఖ్యాకమైన వానర సైన్యము ముందుకు తరలినది. శ్రీరఘునాధుడు సేనాపమేతుడై వారధి దాటెను.

# లంకలో రఘునాథుడు

శ్రీరాముని సేవించుకొనుటకు చెట్లన్నియూ ఫలించినవి. రాముని సైన్యము తియ్యతియ్యని పండ్లు తినిరి. పర్వతశిఖరములెక్కి వానరులందరూ లంకానగరమును కలియచూచిరి. రాక్షసులు కనుపించగనే వారికి సమయము దగ్గరబడినది అనుకొనుచుండిరి. కొంత మందిని పట్టుకొని ముక్కులు చెవులు కోసి పంపుచుండిరి.

ముక్కులు చెవులు తెగిన రాక్షసులు పోయి రావణునితో శ్రీరాముడు సేనాసమేతుడై లంకలో విడిది చేసెనని చెప్పిరి. ఈ సంగతి విని రావణుడు కానరాకుండా వ్యాకులపడెను. నీరధి, జలధి, సింధు, వారీశ, తోయనిధి, కంపతి, ఉదధి, పయోధి, వాటన్నిటినీ శ్రీరాముడు బంధించెనాయని ఆశ్చర్యపోయెను.

శ్రీరాముడు ఎక్కువ శ్రమ లేకుండగనే సేతుబంధనముచేసి లంకలో ప్రవేశించెనను విషయము మండోదరికి తెలిసినది. ఆమె భర్తతో—"ప్రియతమా! విరోధ మెప్పుడు సమానమయిన వారితో పెట్టుకొనవలెనుగాని శ్రీరామునితోనా? సూర్యతేజము ముందు మిణుగురు పురుగు ఎంత? రాముడు సాక్షాత్తు పరబ్రహ్మ! అమిత బలవంతుడు. మధుకైటభులను సంహరించిన ధీరుడు. వరాహ నారసింహ అవతారములెత్తి హిరణ్యాక్ష హిరణ్యకశిపులను చంపెను. ఆతడే వామనరూపుడయ్యెను. పరశురాముడుగా సహస్రబాహువును సంహరించెను. ఆ భగవంతుడే ఈ శ్రీరాముడు. భూభార మణచుటకు అవతరించెను.

"నాథా! శ్రీరామునితో మీకు విరోధము తగదు. కాలము కర్మము, జీవుడు అన్నియూ శ్రీరామునికి వశమై యున్నవి. సీతా

దేవిని వారికిచ్చివేయుడు. సృష్టి, స్థితి, లయములకు మూలభూతు డైన భగవంతుని స్మరించుకొనుడు. సాకేత సార్వభౌముడు మిమ్ము తప్పక అనుగ్రహించును."

ఇట్లు కంపిత స్వరముతో పలికిన మండోదరి పలుకులు విని రావణుడు ఆమెను సమాధాన పరచుటకు ప్రయత్నించెను. ఎప్పటి వలెనే ప్రగల్భములు పల్కెను.— "మండోదరీ! నీవనవసరముగా బాధపడుచుంటివి. నన్ను మించిన యోధుడు ఈ జగత్తునందే లేడు. వరుణుడు, కుబేరుడు, వాయువు, యముడు, మొదలగు దిక్పాలకుల నెల్లరను నా భుజబలముతో వోడించితిని. దేవతలు దానవులు మనుష్యులు నా ఆధీనములో నున్నారు. నా బలముమీద నీకు నమ్మకము లేదా ? ఎందులకిట్లు పిరికిపందవలె భీతిల్లుచుంటివి ?"

భర్త అహంభావముచూచి మండోదరి ఎంతగానో చింతించినది. రావణుని పుత్రుడు ప్రహస్తుడుకూడా తండ్రికి అనేకవిధముల శ్రీరాముని ప్రతాపమునుగురించి తెలిపెను. లంకను తగులబెట్టి పోయిన హనుమంతుని మహత్తును గుర్తుచేసెను. కాని మృత్యువాతన బడనున్న రాక్షసుల బుద్ధి ఎందుకు మారును ? పరివర్తన ఎందుకు కలుగును ? వారందరునూ యుద్ధమునకే కాలు దువ్వుచుండిరి.

# అంగద రాయబారము

శ్రీరాముడు తన సైన్యమును యుద్ధసన్నద్ధులు కావలసినదిగా ఆదేశమిచ్చెను. అపుడు జాంబవంతుడు శ్రీరామునితో ఇట్లు విన్నవించెను— "సర్వజ్ఞా! రామచంద్రా! ముందుగా అంగదుని రావణునివద్దకు రాయబారము పంపిన బాగుండునేమో యనిపించుచున్నది" అనెను.

జాంబవంతుని సలహా శ్రీరామునకు నచ్చినది. శ్రీరాముడు అంగదునితో రావణునివద్దకు పోయి రాయబారిగా చనుమని ఆదేశమిచ్చెను.

ప్రభువు పాదములకు నమస్కరించి అంగదుడు బయలుదేరెను. భగవంతుని అనుగ్రహ మెవరిమీద యుండునో ఆతడు సకల గుణసంపన్నుడగును. అంగదుడు స్వాభావికముగా నిర్భయుడు. రావణుని వద్దకు పోవు త్రోవలో అడ్డుతగిలిన రావణుని కుమారుని చంపెను. అదిచూచి రాక్షసులు భయపడి, ఆనాడు లంకను తగులబెట్టి పోయిన కోతి తిరిగి వచ్చినదని భావించిరి. విధాత ఇంకేమి చేయనున్నాడోనని భయభీతులయిరి.

అంగదుడు రావణ దర్బారు ద్వారమువద్దకు వెళ్లెను. తన రాక తెలుపుచూ కబురుపంపెను. రావణుడు ఆ కోతిని పిలుచుకొని రమ్మని హేళనతో ఆజ్ఞాపించెను.

రావణుడు సింహాసనముమీద కూర్చొనియుండుట అంగదుడు చూచెను. వాని రూపము సాక్షాత్తు ఒక కాటుక పర్వతమువలె నున్నది. వాని తలలు పర్వత శిఖరములవలె నున్నవి. భుజములు

వృక్షములవలె నున్నవి. ముక్కు ముఖము పర్వత గుహావలె నున్నది. నిస్సంకోచముగా నిర్భయముగా అంగదుడు రావణ సభలోకి అడుగు పెట్టెను. అంగదుని చూచుటతోడనే సభాసదులందరునూలేచి నిల బడిరి. శత్రుదూతకు తన సభలో ఇంత గౌరవము జరుగుట రావణు నకు అసహనముగా నుండెను.

రావణుడు—"ఓరీ! కోతీ! నీ వెవడవు ?"

అంగదుడు—"నేను శ్రీరామ దూతను. నా తండ్రి నీకు మిత్రుడు. అందుచేత నీ క్షేమముకోరి వచ్చితిని. నీవు పులస్త్యఋషి వంశస్తుడవు. శివార్చకుడవు. అయిననూ నీవు మదము, మోహము వీడలేక జగజ్జనని సీతాదేవిని అపహరించుకొని వచ్చితివి".

రావణుడు-"ఓరీ! కోతిపిల్లా! నీ వెవడవో! నీతండ్రి ఎవడో ముందు తెలుపుము. ఏకారణమువలన నీవిపుడు నా స్నేహము కోరు చుంటివి?"

అంగదుడు-"నా పేరు అంగదుడు. నేను వాలి పుత్రుడను."

రావణుడు ఆశ్చర్యముతో-"నీవు వాలి కొడుకువా? నీ తండ్రి కుశలమేనా? కులభ్రష్టుడవు నీవు వాలి కొడుకువై ఎట్లు పుట్టితివి? నీ నోటితో నీవే రామదూతనని చెప్పకొనుచుంటివి?"

అంగదుడు-"శ్రీరామునితో విరోధము పెట్టుకొన్నవారికి కుశలమెక్కడ? రావణా! నీకు ఇరవై కండ్లునూ చెవులునూ వున్ననూ నీవు గ్రుడ్డివాడివి! చెవిటివాడివి! బ్రహ్మాదిదేవతలు పూజించు ఆ శ్రీరామదూతను నేను!" అని తిరిగి వక్కాణించెను.

అంగదుని పలుకులు విని రావణుడు కనుబొమ్మలు ముడిచి "ఓరీ! నేను నీతిధర్మము ఎరిగినవాడనుగనుక నేనీ కఠోర వచనములు విని సహించగలుగుచుంటిని".

అంగదుడు-"నీ నీతిధర్మము లెవరెరుగరు? పరస్త్రీని దొంగి లించి తెచ్చి ఇంకా ధర్మపన్నాలు వల్లెవేయుచుంటివి"

రావణుడు-"పశువా! నీకు బుద్ధిలేదు. వ్యర్థముగా వదరు చుంటివి. నా భుజబల మెరుగవేమో! నేను లోకపాలకులను జయిం చితిని. నా సైన్యములో నాకంటె బలము తక్కువవారెవరూ లేరు. నీ యజమాని స్త్రీవియోగములో బలహీనుడై యున్నాడు. వాని తమ్ముడంతకంటెనూ చింతించుచూ వుండవచ్చును. విభీషణుడు సరే సరి వట్టి పిరికిపంద. జాంబవంతుడు ముసలివాడు. వారిలో సరిగా యుద్ధము చేయగల యోధుడొక్కడనూ లేడు. నలుడు, నీలుడు శిల్పులేగాని యుద్ధవీరులు కారు. క్రిందటిసారి వచ్చి లంకను తగుల బెట్టి పోయిన ఆ మూర్ఖుడు కొంత సమర్థుడై యుండవచ్చును".

అంగదుడు-"రాక్షసరాజా! ఆంజనేయునికంటే ఎన్నోరెట్లు బలశాలి సుగ్రీవుడు. సీతమ్మ జాడ తెలుసుకొని రమ్మని మాత్రమే హనుమంతుని పంపియుండిరి. లేనిచో నీగతి ఏమయియుండెడిదో! రామాజ్ఞ లేనిదే నీజోలికి రాకూడదని అతడు లంకను తగులబెట్టి వెళ్ళిపోయెను". అంగదుని వ్యంగ్యవచనములు విని రావణునకు వళ్ళు మండిపోయినది-"మూర్ఖా! మీ కోతిజాతికి ఒక లక్షణమున్నది. మిమ్ములను పోషించు యజమానిని అస్తమానము పొగడుచుందురు. స్వయముగా ఆలోచించు శక్తి, సిగ్గు, అభిమానములు మీకు శూన్యము. యజమాని ఆడించిన రీతిని ఆడుచుందురు.

"నా భుజబలము మీకు తెలియదు. కైలాసపర్వతము నడు గుము. ఉమాపతి శివుని నడుగుము. నేను శివారాధకుడను. నా భుజ బలము దిక్పాలకులకు తెలుసును. వారి గుండెలలో నే నెప్పుడునూ ముల్లువలె కలకవేయుచుందును. జగత్ప్రసిద్ధి చెందిన రావణుడను నేను. శ్రీరామునితో యుద్ధము చేయతగని అల్పుడనని నీవెట్లనుకొను చుంటివి? నాముందు ఒక రాజకుమారుని పొగడుచుంటివి. నీ జ్ఞాన మేమనుకొనవలెను?"

అంగదుడు-"ఓరీ! నీచుడా! గర్విష్ఠీ! వళ్ళు దగ్గరబెట్టుకొని మాట్లాడుము. పరశురాముడు సహస్రబాహువులను వధించెను. అనేక మంది రారాజులను పరిమార్చెను. అటువంటి పరశురాముని గర్వము

శ్రీరాముని చూచుటతోడనే అణగిపోయినది. రావణా! శ్రీరాముని సామాన్య మానవునిగా తలచుచుంటివి. అది నీ దురదృష్టము".

"మన్మథుడు కేవలము ధనుర్ధరుడనీ, గంగను నదియనీ, కామ ధేనువును పశువనీ, కల్పవృక్షమును చెట్టనీ, అమృతమును రసమనీ, గరుత్మంతుని పక్షియనీ, ఆదిశేషువును పామనీ, చింతామణిని రాయి యనీ, శ్రీవైకుంఠమును నగరమనీ, హనుమంతుని కోతియనీ, శ్రీరా ముని సామాన్య రాజకుమారుడనీ అనుకొనుట కేవలము నీ మూర్ఖ త్వమును మాత్రమే సూచించుచున్నది".

అంగదుని పలుకులు విని రావణుడు మండిపడెను.-"అంగదా! కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు నాకు అండగా వున్నారు రాముడు సముద్రముమీద వారధి కట్టుట ఏమంత గొప్పకాదు. పక్షులుకూడా ఎగిరి దాటగలవు. అంతమాత్రముననే రాముడు శూరుడని యను కొనకుము. ఓరీ! కోతీ! నా భుజబలము ఒక్కటే సముద్రముకంటే అపారమైనది. నా బలమను సముద్రములో వీరులు, శూరులు, దేవ తలు, మనుష్యులు మునిగిపోగలరు. ఒక సామాన్య రాజకుమారుని పరాక్రమమును నీవు అదేపనిగా పొగడుచుంటివి. అంతటి ఘనుడై నచో ఈ రాయబారమెందులకు? శత్రువుతో సంధికి రావడము సిగ్గు చేటుగాదా! నావంటి యోధుడు ముల్లోకములలోనూ లేడని ఎరు గుము. నేను నా తలలను స్వయముగా అగ్నిహోత్రుని కాహుతి యిచ్చితిని. శివుడే ఇందులకు సాక్ష్యము. అట్లు ఆహుతియగుచున్నపు డొకసారి నా నుదుటివ్రాత చదువుకొంటిని. ఒక మనుష్యుని చేతిలో నాకు చావున్నదని చూచి విధాత పొరబాటున వ్రాసియుండవచ్చు నని నవ్వుకొంటిని. అయిననూ నేనిపుడు భయపడుటలేదు. అంగదా! అమర్యాదగా నాముందు మానవమాత్రునిగురించి పొగడకుము".

అంగదుడు-"రాక్షసులకు అవినీతి సహజలక్షణము. నీ గొప్ప దనమును నీవే పొగడుకొనుచుంటివి. శివారాధన, తలలు నరుకు కొనుట, కైలాసపర్వతము నెత్తుట ఇవన్నియూ నీ అహంభావమును సూచించుచున్నవి. తలలు తెగనరికి అగ్నికి ఆహుతి యిచ్చినంత

మాత్రమున రాక్షసులు గొప్పవారగుదురా? అసురీమాయలు ప్రయోగించు రాక్షసులు వీరులు శూరులు ఎట్లగుదురు? మిడతపురుగు పండను భ్రాంతితో దీపముచుట్టునూ తిరిగి, దగ్ధమగుచున్నది. ఆ ఆహుతి శౌర్యమనిపించుకొనునా?"

రావణుడు-"నీచకోతీ! నీవు చావు కోరుకొనుచుంటివి. అందు వలననే పిట్ట కొంచెము కూత ఘనముగా వున్నది. నీ వెవరి యండ చూచుకొని విర్రవీగుచుంటివో వానిలో బలపరాక్రమములు లేవు. అందుచేతనే దశరథుడు వానికి రాజ్యము నీయక అరణ్యములకు పంపెను. ఇటువంటి మనుష్యులను నిత్యమూ చంపి మా రాక్షసులు ఆహారముగా తినుచుందురు".

శ్రీరామునిట్లు నిందించుట అంగదుడు సహించలేకపోయెను. భగవంతునిమీద నిందలు వినుటగూడా గోహత్యవంటి పాతకముతో సమానమనుకొనెను.

అంగదుడు మండిపడి గట్టిగా గర్జించెను. ఆ శబ్దమునకు భూమి కంపించినది. సభాసదులు నేలను పడిరి. రావణు డెట్లో సమదాయించు కొనెను. రావణాసురుడు క్రోధావేశపూరితుడై-"ఈ కోతిని పట్టు కొని చంపుడు. భూమిమీద కోతులనునవి మిగలకుండా తినివేయుడు! ఆ ఇరువురు రాజకుమారులను బంధించి తెచ్చి నాముందు పడ వేయుడు!" అని గట్టిగా అరచెను.

అంగదుడు-"రావణా! నీవు పరస్త్రీని దొంగిలించి వక్రమార్గ మున నడచుచున్నవాడవు. పాపివి! మృత్యువాతను బడనున్నవాడవు. నీ పది ముఖములు మేము పగులగొట్టినప్పుడుగాని నీకు బుద్ధిరాదు.

"శ్రీరాముని బాణము నీ రక్తమును త్రాగును. అందుచేత నేను నిన్ను విడుచుచుంటిని. లేనిచో తల్లి సీతమ్మను ఈపాటికి రామునివద్దకు తీసుకొనిపోకపోదునా? లంకను కూకటివేళ్ళతో సహా పీకి సముద్రములో పారవేయగలను. నిన్ను పరిమార్చుట ఒక లెక్క

లోని పనిగాదు. శ్రీరామాజ్ఞ లేనిదే నీజోలికి రాకూడదని నిన్ను విడుచుచుంటిని".

అంగదుని పలుకులు విని రావణుడు అట్టహాసముగా నవ్వెను.

## కదలని పాదము

శ్రీరాముని మహిమ స్మరించుకొని అంగదుడు రావణసభలో ఒక ప్రతిజ్ఞ చేసెను-"రావణా! నేనిచట కాలూనితిని. నా యీ కాలను నీవు కదుపగలిగినచో శ్రీరాముడు తిరిగి వెళ్ళిపోవును. సీతను వోడిపోయినట్లే!

రావణుడు అచట వున్న రాక్షసుల నుద్దేశించి-"వీరులారా! ఈ కోతిపిల్ల కాలు పట్టుకొని ఈడ్చి నేలమీద పడవేయుడు".

ఇంద్రజిత్తు మొదలైన యోధులందరునూ లేచి వారివారి బలమంతయూ ప్రయోగించిరి అంగదుని పాదము వీసమంత కూడా కదుపలేకపోయిరి. రాక్షసులందరునూ గూడి ఒక్కుమ్మడిగా ప్రయత్నించిననూ వాని పాదము కదులలేదు. ఇది చూచి రావణుని మదము కొంత అణగినది. అపుడు రావణుడు లేచి ముందుకు వచ్చెను. అతడు అంగదుని పాదము పట్టుకొనుటకు వంగినపుడు అంగదు డిట్లనెను-"మూర్ఖుడా! నా పాదము పట్టుకొనిన ప్రయోజన మేమిగలదు. పోయి ఆ శ్రీరాముని పాదములు పట్టుకొనుము. నీకు రక్షణ కలుగగలదు".

ఇది విని రావణుడు లజ్జితుడయ్యెను. వానిలోని తేజస్సు, శక్తి, ఆయువు అన్నియూ ఉడిగిపోయినట్లనిపించినది.

శ్రీరాముడు జగదోద్ధారకుడు. జగదాత్ముడు. భగవంతుని యందు విముఖులైనవారికి సుఖశాంతులు వుండవు. అంగదుడు తిరిగి రాముని సన్నిధానమునకు చేరెను. రాముని చూడగనే వాని శరీరము పులకించి కన్నులలో ప్రేమాశ్రువులు నిండినవి.

# లంకను ముట్టడి

శ్రీరాముడు మంత్రులను, సేనలను పిలచి లంకానగరమును నాలుగువైపులా ముట్టడించమని ఆదేశమిచ్చెను. లంకకు నాలుగు సింహద్వారములున్నవి. ముందు వాటిని ఆక్రమించమని చెప్పెను. తమవద్దనున్న సైన్యమును నాలుగు దళములుగా విభజించి, జాంబవంతుడు, హనుమంతుడు, సుగ్రీవుడు, విభీషణుడు ఒక్కొక్క దళమునకు అధిపతులుగా నియమితులైరి.

లంకను చుట్టియున్న ప్రాకారములు అజేయములైనవి. శ్రీరాముని ప్రభావమువలన వారు అన్నివైపులనుండి చుట్టుముట్టిరి. శ్రీరామలక్ష్మణులకు జయము పలుకుచు నినాదములు చేసిరి.

దురహంకారియగు రావణుడు తనవారితో వానరుల గర్వమణచమనీ, కాలప్రేరితులై వారట్లు దుముకుచూ మీద కురుకుచున్నారనీ హెచ్చరించెను. వారందరనీ చంపి తినివేయమనికూడా ఆజ్ఞాపించెను. రావణుని అనుజ్ఞ తీసుకొని రాక్షసులందరునూ గొడ్డళ్ళు, బరిశెలు, శూలములు, కత్తులు, పరిఘలు, కొండరాళ్ళు చేత నిడుకొని వానరుల నెదుర్కొనుటకు బయలుదేరిరి. కోటిమంది రణధీరులు, బలశాలులు కోటబురుజులమీద నిలబడిరి. ఢంకాలు, ఢోళ్ళు అన్నియూ మ్రోగుచుండెను. ఆ మ్రోత వినుచు యుద్ధవీరులు రణరంగములోనికి ఉరకవలెనని ఉత్సాహపడుచుండిరి. పిరికివారికి మాత్రము గుండెలు బ్రద్దలగుచున్నట్లుండెను.

వానరులు ప్రయత్నించి కోటబురుజులెక్కి ఒక్కొక్క రాక్షసుని క్రిందకు పడద్రోయుచుండిరి. వారును అట్లే వానరులను లోనికి రాకుండ ప్రయత్నించుచుండిరి. శ్రీరాముని కృపవలన రాక్షసులను

చితకగొట్టి వానరులందరునూ కోటబురుజులెక్కిరి. అదిచూచి లంకా నగరమంతయూ హాహాకారములు వ్యాపించెను. రావణుడు మృత్యు దేవతను స్వయముగా ఆహ్వానించినాడని అందరునూ తిట్టిరి.

రణరంగమునుండి వెనుతిరిగి వచ్చిన రాక్షసులను రెండు వైపులా పదునున్న కత్తులతో నరికి పారవేసెదనని రావణుడు బెదిరించెను. అది విని రావణుని చేతిలో చచ్చుటకన్న రణరంగములో చచ్చిన వీరస్వర్గము దక్కునని వారు యుద్ధమునకు తెగించి ముందుకు పోయిరి.

హనుమంతుడూ మేఘనాధుడూ కలియబడిరి. ఎవరు ఎక్కువ బలవంతులో నిర్ణయించుట కొంచెము కష్టమే! కొంతసేపయిన తరువాత హనుమంతుడు ఒక్క గంతువేసి కోటపైకెక్కి కూర్చొనెను. హనుమంతునకు తోడుగా అంగదుడు కూడా కోటపైకి ఎక్కెను. మేఘనాధుని గుండెలమీద దెబ్బకొట్టిరి. అతడు దెబ్బ తినగనే వాని సారథులు అతనిని రథముమీద వేసుకొని తీసుకొనిపోయిరి.

హనుమంతుడు, అంగదుడు పునాదులతో సహా కోటను వూపిరి. అది చూచి రాక్షసులు హడలిపోయిరి. స్త్రీలు గుండెలు బాదుకొనిరి. కోతిచేష్టలు చేయుచూ, సింహగర్జన చేయుచూ అందరినీ హడలగొట్టి శత్రుసైన్యము మధ్యలోనికి వురికిరి. రాక్షసులను మర్దించి, లాతీలతో చావబాది పిడిగుద్దులతో హతమార్చిరి. కొంత మంది తలలు నరికి శ్రీరాముడున్నవైపు విసురుచుండిరి. శ్రీరాముడు కోమలహృదయుడు. విరోధభావముతో తనను తలచిననూ వారిని మోక్షధామమునకు చేర్చుచుండెను.

హనుమంతుడు, అంగదుడు శత్రువుల అంతుతేల్చి సాయంత్రమవగానే శ్రీరాముని సన్నిధికి చేరిరి. వారికి లేశమంతయూ శరీర శ్రమ కనుపించలేదు. ఈ ఉత్తమ యోధులను చూచి శ్రీరాముడెంతో సంతోషించెను.

ప్రదోషకాలమవగనే రాక్షసులందరూ తిరిగి యుద్ధమునకు సంసిద్ధులైరి. ఉభయపక్షములవారునూ అమిత బలశాలురు. హోటమి

నెవ్వరునూ వొప్పుకొనరు. కొంచెముసేపటిలోనే చీకటి పడినది. ఆ తరువాత కారుచీకట్లలుముకొన్నవి. రక్తము రాళ్ళు వర్షమువలె కురియుచున్నవి. ఒకరికొకరు కనుపించుటలేదు. అందరూ కోలాహలముగా అరచుచూ రణగొణ ధ్వని చేయుచుండిరి.

ఎచట ఏమి జరుగుచున్నదో శ్రీరామునకు తెలియును. శ్రీరాముడు ధనుస్సు ఎక్కుబెట్టి అగ్నిబాణము వేసెను. దానితో యుద్ధభూమికి వెలుగు వచ్చినది. హనుమంతుడు, అంగదుడు ఆశ్చర్యకరమైన యుద్ధకౌశలము చూపుచుండిరి. రాక్షసులలో కొందరు మడిసిరి. కొందరు గాయపడిరి. ఈవిధముగా శత్రుసైన్యమును చెదరగొట్టి హనుమంతుడు, అంగదుడు కోసలాధీశుని సన్నిధికి చేరిరి.

వానరసైన్యము నాలుగు దళములవారు సురక్షితముగా శ్రీరామునివద్దకు చేరిరి. రాముడు కృపాదృష్టితో వారివైపు చూడగనే వారు యుద్ధశ్రమ తీరి తేరుకొనిరి.

# లక్ష్మణస్వామి మూర్ఛ

లక్ష్మణుడు ధనుస్సు చేతబుచ్చుకొని యుద్ధమునకు బయలు దేరెను. వాని కన్నులు క్రోధముతో మిక్కిలి ఎర్రగా నున్నవి. విశాలమైన వక్షస్థలము, హిమవత్పర్వతమువలె ఉజ్జ్వలముగా నున్న శరీరము. వానరసైన్యమును వెంటబెట్టుకొని రణరంగములో ప్రవేశించెను.

వానరులు దానవులు ఎదురుపడిరి. ఇరువైపుల జయజయ ధ్వానములు మిన్నుముట్టుచున్నవి వానరులు రాక్షసులను గ్రుద్ది గదియలతో చావమోదిరి. దేవతాగణము లాకసమునుండి ఆ కౌతుకము చూచుచు ఒకసారి ఖేదము మరొకసారి మోదము నొందుచుండిరి.

మిట్టపల్లము లన్నియు రక్తముతో నిండిపోయినవి. లక్ష్మణుడు మేఘనాధుడు హోరాహోరీ పోరాడుచుండిరి. వారిరువురూ అసమాన యోధులు. రాక్షసులు కపటము, మోసము, మాయ, అధర్మము, అవినీతితో గూడిన యుద్ధము చేయుచుండిరి. లక్ష్మణుడు మేఘనాధుని రథము విరగగొట్టి సారథిని చంపెను. మేఘనాధునిమీద అనేక దెబ్బలు తీసెను. చావుదెబ్బలుతిన్న మేఘనాధుడు ప్రాణమాత్రముగా మిగిలియుండెను. లక్ష్మణుడు తన ప్రాణములు తీయనున్నాడని ఎరిగి మేఘనాధుడు వీరఘాతిని యను శక్తిని లక్ష్మణునిమీద ప్రయోగించెను.

ఆ శక్తి లక్ష్మణుని వక్షస్థలముమీద తగిలి అతడు మూర్ఛపోయెను. అపుడు మేఘనాధుడు లక్ష్మణుని లేవదీసి ఎత్తుకొనిపోవలెనని ప్రయత్నించెను. అతని వశము కాలేదు. తనతో సమానమగు

అనేక యోధులను తీసుకొనివచ్చి వానిని లేవదీయ ప్రయత్నించెను కాని అతడు పృథ్వీభారమును మోయు ఆదిశేషువు అంశము. అతనిని లేపలేక విఫలులై అందరునూ సిగ్గుపడి వెళ్ళిపోయిరి.

హనుమంతుడు లక్ష్మణుని స్థితి చూచి అవలీలగా లేవదీసి భుజమున వేసుకొని శ్రీరామునివద్దకు తీసుకొనివచ్చెను. తమ్ముని చూచి రాము డెంతో దుఃఖించెను. లంకలో నున్న సుషేణుడను వైద్యుని పిలిపించమని జాంబవంతుడు శ్రీరామునితో చెప్పెను.

## రాముని విషాదాశ్రువులు

హనుమంతుడు వెళ్ళి సుషేణుని ఇంటితోసహా తీసికొనివచ్చి రాములవారి ముందుంచెను. సుషేణుడు శ్రీరామునకు దండప్రణామములు చేసి సంజీవినీ మూలిక కావలెనని చెప్పెను. అది ఎచట దొరుకునో తెలుసుకొని వాతాత్మజుడు వాయువేగముతో బయలుదేరి వెళ్ళెను.

కాలనేమి యను రాక్షసుడు హనుమంతున కడ్డు తగిలి అసురీ మాయలు ప్రయోగించి వాని ప్రయాణమునకు విఘ్నములు చేయ బూనెను. హనుమంతుడు ఎటులో తప్పించుకొని సంజీవిని యుండు పర్వతమువద్దకు పోయెను. వానికి సంజీవిని ఏదో తెలియలేదు. అందుచేత ఆ పర్వతమునే మోసి తెచ్చుచుండెను. త్రోవలో భరతుడు హనుమంతుని ఆపి విషయములన్నియూ తెలుసుకొనెను. జరిగిన వృత్తాంతములు తెలిపి తక్షణమే ఆంజనేయుడు శ్రీరాముని వద్దకు వచ్చి చేరెను.

ఇచట శ్రీరాముడు సాధారణ మానవునివలె తమ్మునికొరకు బాధపడుచుండెను.—"అర్ధరాత్రి గడచినది. వాతాత్మజుడింకనూ రాలేదు. తమ్ముని మాటిమాటికీ హృదయమునకు హత్తుకొనుచూ "నాయనా! నా హితముకోరి నీవు తల్లి దండ్రులను, భార్యను వదలి వచ్చితివి. ఈ అడవులలో చలి, ఎండ, వానలు, నాకొరకు ఓర్చు కొంటివి. ఇపుడు నావేదన విని నీవెందుకు లేవవు? ఈ ప్రపంచములో

పుత్రులు, ధనము, స్త్రీలు, ఇల్లు వాకిలి, పరివారము - ఇవి పోయి ననూ తిరిగి పొందవచ్చును, కాని సోదరులను పోగొట్టుకొనిన తిరిగిదొరకరు! భార్యకొరకు తమ్ముని పోగొట్టుకున్నానను అపఖ్యాతి నాకు రానీయకుము. ఏముఖము పెట్టుకొని నేను అయోధ్యకు తిరిగి వెళ్ళగలను? నాయనా! సీతల్లికి నేనేమి సమాధానము చెప్పవలెను? ఆమెకు నీవే ప్రాణాధారము నిన్ను చేచేతులా నాకు వప్పచెప్పినది".

చింతలన్నియు దూరముచేయగల శ్రీరాముడు చింతించుచూ కూర్చొనెను. కలువరేకులవంటి రాముని కన్నులలో విషాదాశ్రువులు నిండినవి. శ్రీరఘునాధుడు వియోగరహితుడు, భక్తవత్సలుడు ఈ విధముగా నరలీలలు సలుపుచుండెను.

ప్రభువు దుఃఖము చూచి వానరు లెంతో బాధపడిరి. ఇంతలోపల హనుమంతుడు పర్వతముతోసహా అచటకు వచ్చెను. శ్రీరాముడానందముతో అతనిని ఆలింగనము చేసుకొనెను. వైద్యుడు సుషేణుడు వెంటనే సంజీవిని మూలికను లక్ష్మణునిమీద ప్రయోగించెను. అతడు లేచి కూర్చొనగానే శ్రీరాము డమితానందముతో వానిని కౌగలించుకొనెను.

హనుమంతుడు సుషేణుని యథాస్థానమున దించివచ్చెను.

# రావణుని యుద్ధ సన్నాహము

కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు వధింపబడుట రావణాసురునికి కుడి భుజములు విరిగిపోయినట్లయినది అమితముగా దుఃఖించెను. ఈ యిరువురునూ యోధానయోధులు. ప్రపంచములోని మానవులెవరూ జయించలేనట్టి అసమాన వీరాగ్రేసరులు. రాముడు కుంభకర్ణుని, లక్ష్మణుడు ఇంద్రజిత్తును అవలీలగా చంపివేసిరి. అందువలన రావణునకు దుఃఖము, క్రోధము ఒకదానిని మించి ఒకటిగా పెల్లుబికినవి. తనకూ మృత్యుదేవత నెత్తిమీద వున్నదని గ్రహించక రావణుడు పగదీర్చుకొనుటకు యుద్ధసన్నద్ధుడయ్యెను.

వానరులు కోట నాలుగువైపులా ముట్టడించిరి. ఈతూరి రావణుడు కేవలము తన భుజబలముమీదనే ఆధారపడి రణరంగమునకు బయలుదేరెను. అనేకమంది అసమాన యోధులు కాటుకధూమము వలె రావణునివెంట యుండిరి. ఎన్నో అపశకునములు వారికి ఎదురయ్యెను గర్వోన్మత్తుడైన రావణుడు ఆ అపశకునములను లెక్క చేయలేదు ఆయుధములు చేతిలోనుండి జారిపడినవి. ఏనుగులు, గుర్రములు రథములు వదిలి అటూ ఇటూ పారిపోవుచున్నవి. గ్రద్దలు, కాకులు కూయుచున్నవి. కుక్కలు మొరుగుచున్నవి. గుడ్లగూబలు భయంకర శబ్దములు చేయుచున్నవి. ఈ అపశకునము లన్నియూ రావణునకు మృత్యుసందేశ మిస్తున్నవా యన్నట్లుండెను.

అపారమయిన రాక్షస సైన్యము బయలుదేరినది. చతురంగ దళములు, వాహనములు, రథములు, పతాకధ్వజములు, మత్తగజములు, దండులుగా బయలుదేరినవి. రావణుడు యుద్ధమునకు తరలినపుడు దిగ్గజములు కంపించినవి, సముద్రములు పొంగినవి, పర్వతములు

పీగినవి. సూర్యకాంతిని కప్పివేయు దుమ్ము ఆకాశమున వ్యాపించి నది. పవనములు వీచుట ఆగిపోయినవి. పృథ్వి వ్యాకులపడినది. డోలు నగారాలు భీషణధ్వనితో మ్రోగుచున్నవి. భేరీలు, నఫరీలు, సహానా యిలు యుద్ధవీరులకు ప్రోత్సాహమిచ్చుచు మారుమ్రోగుచుండెను.

రావణుడు తన రాక్షస బలగముతో కోతులను, భల్లూకము లను తినిపారవేయని ఆజ్ఞాపించెను. తను ఆ యిరువురు రాజకుమారు లను హతమార్చెదనని ప్రగల్భములు పలికెను.

కాలయమునితో సమానమగు వానరవీరులు యుద్ధోత్సాహ ముతో పరుగులు తీయుచుండిరి. వారట్లు పరుగులు తీయునపుడు పర్వతములకు రెక్కలు వచ్చినవా యనిపించుచుండెను. గోళ్లు దంత ములు, పర్వతములు వృక్షములు వారి ఆయుధములు. వారు నిర్భయులు.

## జయద్రథ స్వరూపము

ఇరుపక్షముల వారునూ కయ్యమునకు కాలుదువ్వి కవ్వించు కొనుచుండిరి రావణుడు రథంమీద యుండెను. శ్రీరామునకు రథములేదు, శరీర రక్షణకు కవచము లేదు, చివరకు పాదరక్షలుకూడా లేవని విభీషణుడు వాపోయెను.

శ్రీరాముడు-"విభీషణా! జయద్రథమువేరు. దానికి శౌర్యము ధైర్యమను రెండు చక్రములుండును. సత్యము శీలములు పతాకము లుగా నుండును. ఇంద్రియము లన్నియూ వశమైయుండును. శమ దమములను కళ్లెములుండును. ఈశ్వర భజనే సారథి. సంతోషమే కత్తి, దానము గొడ్డలి, విజ్ఞానమే ధనుస్సు, నిర్మలమైన మనస్సు తూణీరము. సఖా! ఇటువంటి రథము ఎవరివద్ద యుండునో వారికి శత్రువుల నెదిరించుట ఏమంత కష్టముకాదు. భవభయ రహితులై యుందురు."

ప్రభువు పలుకులు విని విభీషణుడు ఆనందభరితుడై పర మాత్ముడు తనకు ఈవిధముగా జ్ఞానోపదేశము చేసెనని భావించెను.

బ్రహ్మాదిదేవతలు రామరావణ యుద్ధము చూడగోరి ఆకాశములో విమానములలో తిరుగుచుండిరి.

ఇరుపక్షముల యోధులు యుద్ధోన్మాదముతో ఢీకొనుచుండిరి. యుద్ధము ప్రారంభమయినది. ఒకరినొకరు నరుకుకొనుచుండిరి. రాక్షసుల తలలు తెగి క్రిందపడుచున్నవి. పొట్టలు చీల్చుచుండిరి. రాక్షసులు వానరసైన్యమును ముప్పతిప్పలు పెట్టుచుండిరి. వారికి శ్రీరాముని యండ యున్నదిగనుక తేరుకొనుచుండిరి. అనేక ఉపాయములతో వానరులు దుష్టరాక్షసులను సంహారించుచుండిరి. వారి పేగులు చీల్చి వానరులు హారములుగా మెడలో వేసుకొనుచుండిరి. రణగొణ ధ్వని భూమ్యాకాశముల నిండిపోవుచున్నది.

తన సైన్యము విచలితమగుచున్నదని రావణునకు తెలిసినది. అతడు తన ఇరవై చేతులతోను బాణములను సంధానము చేసెను. వానిని చూచి వానరులు హుంకరించిరి. వృక్షములు కొండరాళ్ళు తెచ్చి వానిమీదకు విసిరిరి రావణుని శరీరము వజ్రముకంటెనూ కఠోరమయినది ఆ రాళ్ళు వానికి తగిలి పొడిపొడిగా చూర్ణమయిపోవుచుండెను. రణోన్మత్తుడైన రావణుని రథము అచంచలముగానున్నది. వానరు లన్నివైపులనుండి చుట్టుముట్టిరి. ఈ వానరయోధులను అవలీలగా అందిపుచ్చుకొని రావణుడు నానాహింసలు పెట్టుచుండెను. వారు శ్రీరాముని స్మరించుచూ మొరబెట్టుచుండిరి. రావణుడు పదేసి బాణములు ఒక్కసారి విడుచుచుండెను. అవి అన్ని దిశలకు పోవుచున్నవి. సర్వత్ర బాణమయమైపోయినది. వానరురు వాటి బారినుండి తప్పించుకుపోవుటకు వీలులేకపోయినది. శ్రీరాముని తలుచుకొని ఆర్తనాదము చేసిరి.

## రావణుని 'కరాళశక్తి'

తమ సైన్యము వ్యాకులపడుట గ్రహించి లక్ష్మణుడు క్రోధపూరితుడై రణరంగమునకు బయలుదేరెను. రావణునిమీద సవాలు చేసి యుద్ధభూమిలో అడుగుపెట్టెను.

రావణుడు-"ఓరీ! నీవు నా పుత్రుని వధించిన ఘాతకుడవు. నిన్ను నేను వదలను. నీకొరకే వెదకుచుంటిని. నీమీద ప్రతీకారము తీర్చుకొనెదను". ఇట్లు పలుకుచూ రావణుడు ప్రచండబాణములను వదలెను. లక్ష్మణుడు వాటిని నూరుముక్కలు చేసి పడవేసెను. రావణుడు అనేక అస్త్రశస్త్రములు ప్రయోగించెను. లక్ష్మణుడు వాటిని గడ్డిపోచలక్రింద త్రుంచివేసెను. లక్ష్మణుడు రావణుని పదితలలమీద నూరేసి బాణములు వేసెను. వక్షస్థలముమీద అనేక బాణములు వేసెను. రావణుడు ఈ బాణముల ధాటికి తట్టుకొనలేక క్రిందపడెను.

రావణునకు తెలివి రాగానే బ్రహ్మదేవుడు తన కొసగిన కరాళశక్తిని లక్ష్మణునిమీద ప్రయోగించెను. అతడు మూర్ఛితుడై నేలమీద పడెను. ఇది చూచి పవనపుత్రుడు రావణుని ఒక్క పిడి గ్రుద్దు గ్రుద్దెను. ఆ దెబ్బ ఎట్లో రావణుడు తట్టుకొని హనుమంతుని బలమునకు మెచ్చుకొనెను. హనుమంతుడు లక్ష్మణుని లేవదీసి భుజము మీద నిడుకొని శ్రీరామునివద్దకు వెళ్ళెను.

# రామ రావణ యుద్ధము

రావణుడు లక్ష్మణునితో యుద్ధము చేసిన తరువాత ఆ రాత్రి ఒక యజ్ఞము తలపెట్టెను. యజ్ఞము సానుకూలముగా నెరవేరినచో ఇక వానిని ఎదిరించగలవారీ ప్రపంచములో నుండరు. ఈ సంగతి విభీషణునికి తెలిసినది, అతడు రాములవారితో చెప్పెను.

శ్రీరాముడు వానరములనందరినీపోయి ఆ యజ్ఞమును భంగము చేయమని ఆదేశించెను వారుపోయి నానా కోతిచేష్టలు చేసిరి. రావణాసురుని పీకి, గోకి కొరికి అచటనున్న సామగ్రినంతనూ చిందరవందర చేసిరి. ఏమిచేసిననూ రావణుడు చలించలేదు. తదేక దీక్షతో యజ్ఞము చేయుచునే యుండెను. అపుడు అంగదుడుపోయి మండోదరిని మరికొందరు స్త్రీలను జుట్టుపుచ్చుకొని ఈడ్చుకువచ్చెను. అదిచూచి రావణుడు సహించలేకపోయెను. క్రోధావేశ పూరితుడై యజ్ఞము మాని యుద్ధముచేయుటకు తలపడెను.

శ్రీరాముడు తన నుదుటిమీద పడుచున్న జటలను పైకితీసి గట్టిగా ముడివైచెను. ఎర్రని తామరేకులవంటి కన్నులు, నీల మేఘమువంటి శ్యామ శరీరము నడుముకు కటిసూత్రము అక్షయ తూణీరముతో శ్రీరాముడు యుద్ధ సన్నద్ధుడై బయలుదేరెను. భగ వంతుని శక్తిని, శోభను, తిలకించుచున్న దేవతలు హర్ష ప్రపుల్లితు లైరి. భూమి కంపించినది. పర్వతములు వూగినవి.

ఇంతలో నిశాచర సైన్యము కుమ్ముకొనుచు గ్రుద్దుకొనుచూ గుమిగూడిరి. వానర యోధులు ప్రళయకాల యములవలె వారికి ఎదురేగిరి. ఇరుపక్షముల వారు కలియబడిరి. వజ్రపాతము కురియు చున్నదా యన్నట్లుండెను. శ్రీరాముడు బాణవృష్టి కురిపించెను.

రాముని బాణము తగులుట తోడనే రాక్షస యోధులు చుట్టచుట్టు కొని నేలమీద పడుచుండిరి. వారి శరీరమునుండి రక్తము జలపాత మువలె ప్రవహించుచుండెను. ఆ రక్తపునదులు చూచుటకే భయం కరముగా నుండెను. భూత, పిశాచ, భేతాళములు ఆ రక్తపు నదు లలో స్నానము చేయుచుండిరి. కాకులు, గ్రద్దలు ఆ మాంసపుముద్ద లను నోట కరచుకొని ఆకసములోనికి ఎగురుచున్నవి. రాక్షస యోగినులు కపాలములలో రక్తము నింపుకొని త్రాగుచుండిరి. భూత, పిశాచములు వికృతముగా నాట్యము చేయుచూ, వెర్రి ఆనందముతో పాటలు పాడుచుండిరి. గ్రద్దలు రాక్షస పీనుగుల బొమికలను కొరుకుచూ కర్ణకఠోరమగు శబ్దము చేయుచుండెను.

రాక్షస వినాశము జరుగుచున్నదని రావణునకు తెలుసును. తాను ఒక్కడు అపారమగు వానరసైన్యము మధ్యన నిలచెను. అసురిమాయ సృష్టించెను.

ప్రభువు శ్రీరామునకు రథము లేకపోవుట చూచి ఇంద్రుడు తన రథమునూ సారథిని పంపించెను. ఆ దివ్యరథముపై సాకేత సార్వ భౌముడు కూర్చొనెను. ఆ రథమునకు అజరామరములగు గుర్రము లను కట్టెను. అవి మనోవేగము కంటెనూ త్వరగా పోగలవిగా నున్నవి.

## ఎందరో రామచంద్రులు

రావణాసురుడు రచించిన మాయ శ్రీరామునిమీద పోక లేదు. లక్ష్మణునితో సహా మిగిలిన వారందరూ ఆ మాయ నిజమేనని భ్రాంతులైరి. రావణుడు మరొక మాయ రచించెను. ఈసారి అచట నున్న యోధులందరూ శ్రీరామలక్ష్మణులవలె కనుపించసాగిరి. అంతమంది రామలక్ష్మణులను చూచి వానరులందరూ ఆశ్చర్య చకితులైరి. అపుడు శ్రీరాముడు ఒక్క బాణమువేసి ఆ మాయ నంతనూ చెరిపివేసెను.

శ్రీరాముడు తన సైన్యము అలసిపోయి వుండుట గ్రహించి ఇక వారిని యుద్ధము చేయవద్దని, తనుచేయు యుద్ధకౌశలము చూడ మని చెప్పెను.

శ్రీరాముని చూచి రావణుడు క్రోధముతో ఉడికి యిట్లనెను. —"ఓరీ! తపస్వీ! నేను సామాన్యుడను కాను. నాపేరు రావణుడు. నాయశస్సు జగత్తునకు తెలియును. లోకపాలకులు నానిర్బంధములో నుండిరి. ఇపుడు నీవు నాపాలిట పడితివి! నీవు ఖర, దూషణ, త్రిశిర లను, చంపితివి. వాలిని వధించితివి అనేక రాక్షస వీరులను సంహ రించితివి నీవు నీతమ్ముడునూ చేరి కుంభకర్ణుని, మేఘనాధుని హత మార్చిరి. నన్నుగూడ చనపగలనని గర్వించకుము! నాచేతిలో నీకు మృత్యువున్నది. నాతో విరోధము విరమించుకొని నీవు వెనుకకు వెళ్ళిపోవుట మంచిది".

రావణుడి దుర్భాషలు విని శ్రీరాముడు చిరునవ్వు నవ్వి- "రావణా! ఇటువంటి వ్యర్థప్రలాపమువలన ప్రయోజనములేదు. నీ పురుషార్థము చూపించుకొనుము ఇట్లుపలుకుచూ నీ కీర్తిని పోగొట్టు కొనకుము".

శ్రీరాముని వచనములు విని రావణుడు అట్టహాసముగా నవ్వి- "రామా! నాకు జ్ఞానబోధ చేయుమంటివా! నాతో యుద్ధము తలపెట్టి నపుడు లేని ప్రాణభయము నీకు యిప్పుడు కలుగుచున్నట్లున్నది?" అని బాణములు వదలుట ప్రారంభించెను. ఆ బాణములన్నియూ అనేక రూపములలో భూమ్యాకాశములు నిండిపోయినవి.

శ్రీరాముడు అగ్నిబాణము వేసి వాటినన్నింటిని భస్మీభూత మొనరించెను. రావణుడు శక్తిబాణము వేసెను. శ్రీరాముడు ఆ శక్తిని క్షీణింపచేయు మరొకబాణము వదలెను. రావణుడు ప్రయో గించు చక్ర త్రిశూలములనుకూడా శ్రీరాము డిట్లే త్రిప్పికొట్టు చుండెను. ఈవిధముగా రావణుని బాణములన్నియూ నిష్ప్రయోజ నములయ్యెను.

శ్రీరాముడు శత్రువుపై తీవ్రమైన బాణములు ప్రయోగించ వలెనని సంకల్పించి ప్రచండ ధనుష్టంకారము చేసెను. ఆ ధ్వనికి రాక్షసులందరునూ హడలిపోయిరి. మండోదరి గుండెలు అదరిపోయినవి. భూమి కంపించినది.

శ్రీరాముడు బాణములను గట్టిగా చెవివరకూ లాగి వదలు చుండెను. ఆ బాణములన్నియూ రెక్కలున్న పాములవలె శత్రువు మీదకు పోవుచున్నవి. శ్రీరాముడు మొదట రావణాసురుని రథము విరుగకొట్టెను. ఆ తరువాత సారథిని చంపెరు. అదిచూచి రావణుడు వివశుడై గట్టిగా గర్జించెను. కాని తనలోని శక్తి క్షీణించుచున్నదని గ్రహించుకొనెను.

వెంటనే రావణుడు మరొక రథమునెక్కి మరల యుద్ధమును ప్రారంభించెను. అనేక అస్త్రశస్త్రము లుపయోగించిననూ ఏమీ ప్రయోజనము లేకపోయెను. తన శ్రమ నిష్ప్రయోజనము, వ్యర్థమైపోయినదని తెలుసుకొని గర్జించుచుండెను.

ప్రభువు బాణములు సంధానముచేసి ఒక్కొక్కసారి మున్నది బాణములను వదలుచుండెను. రావణుని ఇరవై భుజములు, పది తలలూ ఎగిరి అవతల పడినవి. ఇట్లవి తెగి పడిపోగానే మరల క్రొత్త తలలు, భుజములు ఆవిర్భావమగుచుండెను. ప్రభువు శ్రీరామ చంద్రుడు మాటిమాటికీ ఆ తలలను చేతులనూ నరుకుచునేయుండెను. అవి యథాప్రకారము మొలకెత్తుచునేయుండెను. ప్రభువు ప్రచండ బాణముల తాకిడికి అవి నేలమీద పడక ఆకసములో ఎగురుచుండెను. ఇట్లు జరుగుచున్ననూ మూర్ఖ రావణుడు గర్జించుచూ రామునిపైకి బాణములు వేయుట మానలేదు.

అపుడు రావణుడు ఆసురీమాయ నొకదానిని రచించెను. దానితో భయంకరమగు క్షుద్రజీవులెన్నో ఉత్పన్నమైనవి. భూత

ములు, భేతాళములు, పిశాచములు, బాణములు చేతపుచ్చుకొని ప్రత్యక్షమైనవి. క్షుద్రదేవతలైన రాక్షస-యోగినులు ఒక చేతిలో కత్తి, మరొక చేతిలో మనుష్య కపాలములు పట్టుకొని వేడిరక్తము త్రాగుచూ గంతులు వేయుచుండిరి. రణభూమిలోని రక్తమాంసముల కొరకు వారు నోళ్ళు తెరచుకొనియుండిరి. ఆ క్షుద్రదేవతలు సంచరించినంతమేరకు నిప్పురవ్వలు మంటలు ప్రజ్వరిల్లెను.

ఆ క్షుద్రమాయ తొలగిపోగానే వానరులు తిరిగి శక్తిమంతులైరి. శ్రీరాముడు రావణునిమీదకు బాణసమూహము వదలుచునే యుండెను. ఇట్లు రామరావణుల మధ్యన జరిగిన మహాయుద్ధమును ఎట్లు వర్ణించవలెను?

రావణుని తలలు ఎన్నిమారులు నరికిననూ తిరిగి ఉత్పన్నమగుచునే యుండెను. ఆ దుష్టుడు చచ్చుటలేదు. ఇదిచూచి మునులు, సిద్ధులు, దేవతలు వ్యాకులులైరి. అపుడు శ్రీరాముడు విభీషణునివైపు చూచెను.

విభీషణుడు-"సర్వజ్ఞా! రావణుని నాభికుండములో అమృతమున్నది. ఆ బలముతోనే అతడు పునర్జీవితుడగుచున్నాడు".

విభీషణుని పలుకులు విని ప్రభువు వికరాళ బాణము చేతబూనెను. అన్నివైపులా మంటలు వ్యాపించినవి. ఆకసములో ధూమకేతువు కనుపించినది. ప్రచండవాయువులు వీచినవి. మేఘములు అపశకున సూచనగా రక్తమునూ, వెంట్రుకలనూ, దుమ్మునూ వర్షించినవి. అమంగళకరమైన సూచనలెన్నో కనుపించెను ఇవన్నియూ చూచి మండోదరి భయకంపితురాలై దుఃఖించినది.

శ్రీరాముడు వికరాళ బాణము వదలెను. ఆ బాణము కాలసర్పమువలె వెడలి రావణాసురుని కుక్షిలోని అమృతకుండమును

పీల్చివేసినది. అప్పుడు రావణుని ఇరవై భుజములు, పది తలలు విరిగి క్రిందపడినవి. ఆ మొండెముమీద శ్రీరాముడు మరొక బాణము వేయగనే అది రెండుముక్కలై క్రింద దొర్లెను.

రావణుడు మరణించి నేలకు వొరగగనే భూమి కంపించినది. సముద్రము లుప్పొంగినవి. దిగ్గజములు పర్వతములు కదిలినవి. దేవతలు హర్షించి నగారాలు మ్రోగించిరి. బ్రహ్మాండమంతయూ జయ జయ ధ్వానములతో నిండిపోయెను. దేవతలు పుష్పవర్షము కురిపించిరి. శ్రీరాముని దిగ్విజయమును అనేకవిధముల స్తుతించిరి. సమస్తలోక సంరక్షణార్థము శ్రీరాముడు రాక్షస సంహారము చేసెను.

# ప్రభు దర్శనం

రావణుని మరణానంతరము శ్రీరాముడు విభీషణునకు లంకాధీశునిగా పట్టాభిషేకము చేయించెను. ఆతరువాత శ్రీరాముడు తనసైన్యము నుద్దేశించి యిట్లనెను. "మీ అందరి సహకారము బలము శౌర్యములతో నేను ప్రబల శత్రువును వధించగలిగితిని. విభీషణుడు రాజ్యము పొందెను. మీ అందరి యశస్సు ఎల్లపుడు ముల్లోకము లందును కీర్తింపబడును, ఎవరు నాతోపాటు మిమ్ముల నందరినీ తలచుకొనెదరో వారు ఈ భవసాగరమును అనాయాసముగా దాటుదురు." ప్రభువు పలుకులు స్వయముగావిన్న వానరులందరూ మాటి మాటికి శ్రీరామునకు పాదాభివందనము చేసిరి.

శ్రీరాముడు హనుమంతుని పిలిచి సీతాదేవికి ఈ శుభవార్త తెలిపి ఆమెను వెంటనే తీసుకొని వచ్చుటకు ఏర్పాటు చేయమని చెప్పెను. హనుమంతుడు వెళ్ళి జరిగిన సమాచారము లన్నియూ ఆమెకు విన్నవించెను. సీతాదేవి హనుమంతుని ఎట్లు అభినందించవలెనా యనుకొనెను. ఇంత శుభవార్త నందించినందుకు ఆమె మనసారా ఆనందించినది. తనను తక్షణం శ్రీరాముని వద్దకు చేర్చ మని కోరినది.

అచట మరణించగా మిగిలిన రాక్షస స్త్రీలు కొందరు సీతను చక్కగా అలంకరించిరి. విభీషణుడు పల్లకి ఏర్పాటు చేసెను. హనుమంతుడు అంగదుడు సుగ్రీవుడు విభీషణులు వెంటరాగా సీత పల్లకిలో శ్రీరాముని సన్నిధికి వచ్చినది.

రావణుని వద్ద యున్నది సీతాదేవి యొక్క ఛాయామూర్తి మాత్రమే! ప్రపంచముకొరకు శ్రీరాముడు సీతను కటువచనములు

పలికెను. సీతాదేవి యొక్క ధర్మము, నీతి, శీలము, సౌజన్యము నెరిగిన లక్ష్మణుని కన్నులలో నీరు నిండినది. సీత లక్ష్మణస్వామిని అగ్ని ఏర్పాటు చేయుమని చెప్పినది! శ్రీరాముని ఆదేశము గూడా అదేగనుక లక్ష్మణుడు అగ్నిని ప్రజ్వరిల్ల చేసెను. సీతాదేవి తన పవిత్రతను నిరూపించు కొనుటకు అందులో ప్రవేశించినది. ఆ అగ్ని చల్లని చందనమువలె శీతలముగా మారినది. అపుడు సీతయొక్క ప్రతిబింబము అగ్నిలో అంతర్ధాన మయినది. అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై సీతను చేతబుచ్చుకొని వచ్చి శ్రీరాములకు వొప్పచెప్పెను.

సీత పునఃసమాగమముచూచి దేవతలు ఆనందముతో ఢంకాలు, నగారాలు మ్రోగించిరి. పువ్వులు జల్లిరి. కిన్నెరలు పాటలు పాడిరి. అప్సరసలు నాట్యమాడిరి. శ్రీ సీతారాముల అనుపమ శోభను తిలకించి వానరులు ముగ్ధులయిరి దేవతలందరునూ అనేకవిధముల శ్రీరాముని స్తుతించిరి

దేవరాజు ఇంద్రుడు శ్రీరాముని స్తుతించునపుడు రాముడిట్లనెను-"ఈ మహాయుద్ధములో కొందరు వానరులు, భల్లూకములు చనిపోయిరి. వారు నా హితము కోరి నాకొరకు ప్రాణము లర్పించిరి గాన నీవు వారినందరిని పునరుజ్జీవింపచేయుము".

విభీషణుడు శ్రీరాముని తన గృహామునకు రమ్మని యుద్ధ బడలిక తీర్చుకోవలసినదిగా వేడెను. వాని ఆదరణ, ప్రేమ చూచి దీన దయాళువు కన్నులలో నీరు నిండినది. కాని శ్రీరామునకు వెంటనే అయోధ్య వెళ్ళిపోవలెననీ తన వనవాస గడువు పూర్తియగుటకు ఒకటి రెండురోజులు మాత్రమే వున్నదనీ, తనకొరకు తపించుచు భరతుడు వేయి కన్నులతో ఎదురు చూచుచుండుననీ చెప్పెను. గడువు పూర్తియగునాటికి తానచటకు చేరనిచో భరతుని సజీవునిగా చూడజాలనని కూడా చెప్పెను.

శ్రీరాముడు వానర భల్లూకముల నందరినీ తమతమ స్వస్థానములకు వెళ్ళమని సవినయముగా ఆదేశించెను. శ్రీరాముని పలుకులు

చిని వారందరునూ విహ్వాలురై రి. చేతులు జోడించి-"జగత్ప్రభూ! మమ్ము కృతార్థులను చేయుడు. మాకు మీ సన్నిధి విడిచి పోవలెనని లేదు. శ్రీరఘునాథా! ముల్లోకములకు, సకల చరాచర జగత్తునకు మీరే ప్రభువులు!" అనుచు వారందరునూ ప్రేమావేశ పరవశులై రి. నోటమాట రాలేదు. కళ్ళ నీరు కట్టలుతెంచుకొని ప్రవహించు చుండెను.

వారిస్థితి గ్రహించి శ్రీరాముడు వారినందరిని సమాధాన పరచి సంతృప్తి నొందించి వారివారి స్వస్థానములకు పంపెను.

## పుష్పకవిమానము

విభీషణుడు శ్రీరాముని తిరుగు ప్రయాణమునకు పుష్పక విమానము నేర్పాటుచేసెను. శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై ప్రయాణ మవగనే సుగ్రీవుడు, జాంబవంతుడు, హనుమంతుడు, అంగదుడు, విభీషణుడు కన్నులలో నీరు నింపుకొని అచట నిలబడిరి. వారి ప్రేమాతిశయమును చూచి శ్రీరాముడు వారినందరినీ విమాన ములో కూర్చొనబెట్టుకొనెను. విమానము ఉత్తరదిశగా వెడలెను.

అందరునూ శ్రీరామునకు జయము పలికిరి. విమానములోని ఎత్తైన వేదికమీద సీతారాములు కూర్చొనిరి- వారు ప్రయాణమై ముందుకు సాగునపుడు దేవతలు పువ్వులు జల్లిరి. మనోహ్లాదమగు శీతల పవనములు వీచసాగెను. అన్ని వైపులా శుభశకునములే కన బడెను. ఆకాశము నిర్మలముగా నుండెను. అందరునూ ప్రశాంత చిత్తులై యుండిరి.

శ్రీరాముడు సీతతో "ఇచటనే లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించెను. రావణ కుంభకర్ణు లిచటనే మరణించిరి. హనుమంతుడు, అంగదుడు ఎందరో రాక్షసులను చంపిరి.

"సముద్రముమీద ఇచటనే వారధి కట్టితిమి. శివలింగ ప్రతిష్ట చేసితిని" అని సీత ఎరుగని విషయములన్నియూ పూసగుచ్చినట్లు విశదీక రించెను. సీతా రామ లక్ష్మణులు రామేశ్వరమునకు నమస్కరించిరి.

అరణ్యములందు తామెచటెచట నివసించిరో, ఆయా ప్రదేశములన్నియూ సీతకు సవిస్తరముగా చూపించెను. విమానము అతి త్వరితగతిని ప్రయాగ చేరెను. నిషధరాజు గుహునకు శ్రీరామాగమనవార్త తెలిసి పడవ ఏర్పాటుచేసెను. అందరునూ గంగ అవతలి తీరమునకు చేరిరి. అచట కొంచెము సేపాగిరి. సీతాదేవి గంగను పూజించినది. సీతను అఖండ సౌభాగ్యవతిగా నుండవలెనని గంగాదేవి దీవించినది. గుహుడు సీతా రామ లక్ష్మణులను చూచి ఆనందమగ్నుడై సమాధిస్థితి నందెను.

అచటనుండి వాయుసుతుడు మనోవేగముతో అయోధ్యకు ముందుగా రామాగమనవార్త తెలుపుటకు వెళ్లెను.

శ్రీరాముని పవిత్ర చరిత్రము సకలజనులకు శుభమునిచ్చును. భగవంతుని స్వరూప స్వభావములను గురించి విశేషజ్ఞానము నొసగును. ఎవరు శ్రీరఘువీరుని సమరలీలలు శ్రద్ధగా వినెదరో వారికి నిత్యమూ విజయమే కలుగును

కలియుగమున సమస్త పాపములను తుడిచివేయుటకు శ్రీరామ స్మరణ మొక్కటే శరణ్యము

# ఆదర్శ మానవత్వం

శ్రీ వారణాసి రామమూర్తి రేణు

ప్రాచేతమహర్షి రచనతో ప్రారంభమై ఎన్నో రామాయణాలు వెలిసినాయి. వీటిలో ఆదికావ్యమైన వాల్మీకి రచన శ్రీరాముని మానవుడుగా చిత్రీకరించింది. "ఆత్మానం మానుషం మన్యే" అంటూ శ్రీరాముడే అనేకచోట్ల చెప్పుకున్నాడు. లోక సంగ్రహ దృష్టినీ, జాత్యుద్ధరణ లక్ష్యాన్ని సాధించదలచుకొనిన యుగకవి తులసీ, వాల్మీకినిమాత్రమే అనుసరించడం ప్రయోజనకారి కాజాలదు. మానవశక్తియందలి నిర్వీర్యత్వం నిరూపితమైన ఆ నాటి వాతావరణంలో మళ్లీ ఒక మానవమాత్రునిగా రాముని చిత్రించినందువల్ల జాతికి ఆశించిన ఓదార్పు, విశ్వాసం, ఊరట, ధైర్యం లభించవు. ఆ మానవత్వానికి దివ్యత్వాన్ని జోడించి అఘటన ఘటనా సామర్థ్యాన్ని తోడుచేసి ఆదర్శమానవత్వమేకాక అలౌకికాలైన శక్తులతో కూడిన పరబ్రహ్మతత్వమే రామునిరూపాన అవతరించిందనీ, అది అనంతశీలం, అనంతబలం, అనంతసౌందర్యాల విలక్షణ సంపుటి యనీ, కాగా ఆ శక్తికసాధ్యమంటూ ఏదీ వుండదనీ జాతి మానసంలో విశ్వాసం కలిగించడమే తులసీదాసు నెరవేర్చవలసిన, నెరవేర్చిన మహాత్కార్యం. అందుచేతనే ఆయన ఏ ఒక్క రామాయణాన్ని పూర్తిగా అనుసరించలేదు. మధుకరవృత్తి నవలంబించి సంస్కృత కాననంలో పరిమళించిన విభిన్న రామాయణ తదితర గ్రంథ కుసుమాలనుంచి తనకు అనుకూలించినట్లు భావ మకరందాన్ని సంగ్రహించి తన మానస మధుకోశంలో నిక్షిప్తం గావించుకున్నారు.

(రామాయణ సుధాలహరి నుండి)

(ఉత్తరకాండ)

# శ్రీరామాగమనము

శ్రీరాముని కొరకు భరతుడు తపించుచూ ఎదురుచూచు చుండెను. రాముడు గడువు ముగియుటకు ఇంకనూ ఒక్కదిన మున్నది. వేయికన్నులతో పురజనులు, పరివారమందరూ ఎదురు చూచుచుండిరి. అటువంటి సమయమున హనుమంతుడచటకు వెళ్లెను. ముందుగా భరతునకు శ్రీరామాగమనవార్త తెలిపెను.

భరతుని ఆనందమునకు అంతులేదు. అతడు ఆంజనేయుని ఆలింగనము చేసుకొని యింతటి శుభవార్త తెచ్చిన అంజనేయునికి ఏమిచ్చిన ఋణము తీరును ? అనుకొనెను. ఆంజనేయుడు శ్రీరాముడు రాక్షస సంహారమెట్లు చేసెనో వినిపించెను. భరతునియందు శ్రీరామునకు గల భాతృప్రేమ ప్రాణమునకంటెను మిన్నయని చెప్పెను. ఈ పలుకులు విని వాని హృదయము ఉప్పొంగిపోయినది.

అపుడు భరతుడు అయోధ్యలోని వశిష్ఠమహర్షికి, తల్లులకు, రాజపరివారమునకు, పురజనుల కందరకూ శ్రీరామాగమన వార్త తెలిపెను. వారందరునూ పరమానందభరితులైరి. శుభసూచనగా నగారాలు ప్రమోగించిరి. సీతారామలక్ష్మణులకు స్వాగతము పలుకుటకు నగరములోని స్త్రీపురుషులందరూ ఆబాలగోపాలము ఎదురు చూచుచూ వూరు బయటకు వచ్చిరి. బంగారు పళ్ళెరములలో నవ తులసీదళములను, గోరోజనము, పాలు, పెరుగు, పండ్లు, పుష్పాలు, తెచ్చి సంతోషముతో మంగళహారతులు పాడుచుండిరి.

పుష్పక విమానము అయోధ్యానగరము సమీపించగనే శ్రీరాముడు వానరులకు రమణీయమగు అయోధ్యను చూపించెను,

వారితో శ్రీరాముడు-"సఖులారా! అయోధ్య ఎంతో పవిత్రమైన ప్రదేశము! వైకుంఠపురముయొక్క గొప్పదనమును అందరూ కొని యాడుచుండురు. కాని నాకు ఈ అయోధ్య అలవైకుంఠపురము కంటెనూ అందముగా నుండును. ఇది నా జన్మభూమి. జీవరాశు లను తరింపచేయు సరయూనది యిచట ప్రవహించుచున్నది. ఈ నగర నివాసులందరూ నాకు అత్యంత ప్రియమైనవారు" అనెను. అయోధ్యలోని ఆబాలగోపాలమూ ఊరు బయటకు వచ్చి తనకొరకు వేచియుండుట గ్రహించి ప్రభువు శ్రీరాముడు పుష్పకమును అచటనే ఆపి క్రిందకు దిగెను. సీతారామలక్ష్మణులు. వానరులు అందరునూ దిగి పుష్పకమును కుబేరునివద్దకు పంపిరి.

శ్రీరాముడు ధనుర్బాణములను క్రిందనుంచి గురువు వశిష్టు లకు, వామదేవునకు పాదాభివందనము చేసెను. భరతుడు శ్రీరాముని పాదములపై బడెను. వానిని చూచి శ్రీరాముని శ్యామశరీరము పుల కించినది. కన్నులలో నీరు నిండినది ముల్లోకములకు నాధుడైన శ్రీరాముడు భరతుని లేవదీసి హృదయమునకు హత్తుకొనెను. వారిరువురిమధ్యన గల ప్రేమ వర్ణనాతీతము. ప్రభువు హర్షితుడై శత్రుఘ్నుని హృదయమునకు హత్తుకొనెను. భరత శత్రుఘ్నులు సీతాదేవికి నమస్కరించిరి.

శ్రీరాముని వియోగములో పధ్నాలుగు సంవత్సరములు గడి పిన అయోధ్యావాసు లెంతో దుర్బలులైరి. వారు శ్రీరాముని చూడ గనే ప్రేమవిహ్వాలులైరి. భగవంతుడు అసంఖ్యాకమైన రూపము లతో వారివారి యోగ్యతానుసారము దర్శనమిచ్చెను. రాముని చూచి వారు శోకరహితులైరి.

కౌసల్య, సుమిత్ర, కైక శ్రీరాముని చూచి పరవశులైరి. రాముని సన్నిధి అందరికీ పెన్నిధే! కైకేయి రామునివద్దకు వచ్చు టకు సంకోచించి దూరముగా నిలబడెను. శ్రీరాము డది గ్రహించి ఆమెవద్దకు తానే వెళ్ళెను. ముగ్గురు తల్లులు సీతారామలక్ష్మణుల నాశీర్వదించిరి. వారందరి హృదయములు హర్షప్రపుల్లితములయ్యెను.